# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జనవరి-మార్చి 2011

100 Years

నవనారీ ప్రస్థానానికి వందేళ్ళు

ప్రభవించే చైతన్యానికి జేజేలు

# వ్యాసెక్టమి ఆపరేషన్ మగవారి బాధ్యత

మనదేశ జనాభాను అరికట్టుట మన అందరి బాధ్యత. ఆ బాధ్యతను పురస్కరించుకొని మన గవర్నమెంట్ అనేక చర్యలు చేపట్టినది. అందులో భాగంగా పురుషులకు నిర్వహించే శాశ్వత కుటుంబ నియంత్రణ పద్ధతి వ్యాసెక్టమి (నోస్కాల్‌పల్ వ్యాసెక్టమి) ఒకటి.

మనదేశ జనాభా 1129 మిలియన్లు. ప్రపంచములో అధిక జనాభా గల దేశములలో మన దేశము రెండవ స్థానంలో ఉన్నది. ప్రతి నిమిషానికి 176 మంది జన్మించుచున్నారు. మన రాష్ట్ర జనాభా 8.54 కోట్లు. మన రాష్ట్రములో ప్రతి సంవత్సరము 7 నుండి 8 లక్షల కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు జరుగుచున్నవి. ఇందులో 4 శాతం మాత్రం మగవారు శాశ్వత కుటుంబ నియంత్రణ పద్ధతులు పాటిస్తున్నారు.

కుటుంబంలో మగవారి భాగస్వామ్యమును పెంపొందించుటకు, మగవారిని శాశ్వత కుటుంబ నియంత్రణ పద్ధతిని పాటించుటకు, ప్రోత్సహించుటకుగాను అనంతపురం జిల్లా నందు 2008 నుండి 2011 మార్చి వరకు ప్రతి సంవత్సరము జనవరి, ఫిబ్రవరి, మార్చి మాసములలో ప్రత్యేక 'నోస్కాల్‌పెల్ వ్యాసెక్టమి' ఆపరేషన్ శిబిరాలు నిర్వహించబడుచున్నవి.

**వ్యాసెక్టమి :**

మగవారు ఇకపై సంతానము వద్దని అనుకొన్నప్పుడు ఈ వ్యాసెక్టమి ఆపరేషన్ చేయించుకోవచ్చు. ఇది సాంప్రదాయ పద్ధతి.

**నోస్కాల్‌పెల్ వ్యాసెక్టమి :**

- ఇది అత్యంత అధునాతనమైన, అతి సులభతరమైన ఆపరేషన్.
- ఇది కోతలేని, కుట్టులేని, నొప్పిలేని మగవారికి చేయు శాశ్వత కుటుంబ నియంత్రణ పద్ధతి.
- ఈ శస్త్ర చికిత్స కేవలం 5-10 నిముషములలో చేయబడును.
- ఈ శస్త్ర చికిత్స చేయించుకొన్నవారు అరగంట తర్వాత ఇంటికి వెళ్ళవచ్చును.
- ఈ శస్త్రచికిత్స ప్రత్యేక శిక్షణ పొందిన డాక్టర్లచే నిర్వహించబడును.
- ఎన్.ఎస్.వి. చేయించుకొన్న దారిద్రరేఖకు దిగువ వున్న ప్రతి ఒక్కరికి రూ. 1100/- పరిహార వేతనము ఇవ్వబడును.

ఈ కార్యక్రమము గురించి ఇతర వివరములు తెలుసుకొన గోరినవారు అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రములలోని వైద్యాధికారులు, మరియు ఇతర సిబ్బంది నుండి తెలుసుకొనగలరు.



**ఒక్కరు ముద్దు - ఇద్దరు వద్దు**

**జిల్లా కలెక్టర్**
అనంతపురం

**జిల్లా వైద్య మరియు ఆరోగ్యశాఖాధికారి**
అనంతపురం

# పేదోడికి పచ్చడిమెతుకులేనా?

## సంపాదకీయం...

కోటి ఆశలతో నూతన సంవత్సరంలో అడుగు పెట్టిన ప్రజానీకానికి ఆహార ద్రవ్యోల్బణం పెద్ద షాకే ఇచ్చింది. 2011 సంవత్సరంలోనైనా ఈ ధరల నుంచి సామాన్యుడికి ఊరట లభిస్తుందేమో అనుకుంటే, ఆ అవకాశం కనుచూపుమేరలో కనపడటంలేదు. "సంచుల్లో డబ్బులు, జేబుల్లో సరుకులు" అన్న చందంగా పరిస్థితి మారిపోయింది. 2010 డిసెంబర్ చివరి నాటికే ఆహార ద్రవ్యోల్బణం 19 శాతానికి పెరగడం ఆందోళనకరం. ప్రజలందరికీ ఆహార భద్రతను కల్పించాల్సిన ప్రభుత్వం ఆ బాధ్యతను దేశ, విదేశీ ప్రైవేట్ శక్తుల దయా దాక్షిణ్యాలకు వదిలేస్తోంది. ఫ్యార్వర్డ్, ఫ్యూచర్ ట్రేడింగ్ విధానాలతో కృత్రిమ ద్రవ్యోల్బణం సృష్టించి బడా వ్యాపారులు ప్రజలను లూటీ చేస్తున్నారు.

"కొనబోతే కొరివి అమ్మబోతే అడవి"లా నిత్యావసర సరుకుల ధరలు వున్నవి. కుటుంబమంతటికి కిలో కూరగాయలు కావల్సివున్నా పావు కిలోతో సరిపెట్టుకోవాల్సిన పరిస్థితి. సామాన్య జనం, ముఖ్యంగా మహిళలు ఇప్పటికే అర్ధాకలితో జీవిస్తున్నారు. 80 శాతం మహిళలు సరియైన పౌష్టికాహారం లేక రక్తహీనతతో బాధపడుతున్నారు. ప్రపంచం మొత్తం మీద పౌష్టికాహార లోపంతో బాధపడే 5 ఏళ్ళలోపు బాలల్లో 40 శాతం మన దేశంలోనే వున్నారు. కూరగాయలు, పాలు, పండ్లు, గుడ్లు, మాంసం, నూనెలు, పప్పులు ఇలా ధరలు పెరగడానికి కాదేదనర్హం అంటూ ఒకదానితో ఒకటి పోటీ పడుతున్నవి. వాటికి తోడుగా ప్రభుత్వం సంవత్సరకాలంలో 9 సార్లు పెట్రోలు ధరలు పెంచి సామాన్యుడి నడ్డి విరిచింది. పెరుగుతున్న ధరలకనుగుణంగా ఆదాయాలు పెరగక, కుటుంబ అవసరాల కోసం మైక్రో ఫైనాన్స్ ఉచ్చులో చిక్కుకొని పేద కుటుంబాలు విలవిల లాడుతున్నవి. బడా పారిశ్రామిక వేత్తలకు, పెద్దలకు వేల కోట్ల రూపాయలు రాయితీలిస్తున్న యు.పి.ఏ ప్రభుత్వానికి పేదల కడగండ్లు మాత్రం పట్టవా?

ఉన్నత స్థానాలలో జరిగిన అవినీతి కారణంగా లక్షల కోట్ల రూపాయల దోపిడి ప్రజల జీవన స్థితిగతులను దిగజార్చింది. వరుస కుంభకోణాలతో స్వాతంత్ర్యమనంతరం భారత చరిత్రలో 2010 సంవత్సరానికి విశిష్ట స్థానమే దక్కింది. సమస్త కుంభకోణాలను తలదన్నే 2జి స్పెక్ట్రమ్ కుంభకోణంతో పాటే, అక్రమ ఘనులు, భూమి కేటాయింపులు ఐ.పి.ఎల్ క్రికెట్ పోటీలు, కామన్‌వెల్త్ క్రీడలు, ఆదర్శగృహనిర్మాణం, కర్నాటకలో ఎడ్డి భూ అవినీతి, ఇలా చెప్పుకుంటూపోతే ఒకటా రెండా, చాంతాడంత.

ఒక్క 2జి స్పెక్ట్రమ్ కుంభకోణం కారణంగానే ప్రభుత్వ ఖజానాకు 1,76,000 లక్షల కోట్ల రూపాయల నష్టం వాటిల్లినట్టు కాగ్ అంచనా వేసింది. ఇక కె.జి బేసిన్ వల్ల రిలయన్స్ సంస్థలు పొందే అనుచిత లబ్ది విలువ స్పెక్ట్రమ్ కుంభకోణానికి రెట్టింపు వుంటుందని అంచనా. ప్రధాని మన్మోహన్ సింగ్ దొంగలను, అవినీతి పరులను కాపాడే కాపలాదారుడిలా కాక, పై డబ్బు మొత్తాన్ని సామాజిక రంగంలో వెచ్చించినట్టు అయితే మన ప్రజల, ముఖ్యంగా ఆమ్‌ఆద్మీ జీవన ప్రమాణాలు కొంతవరకైనా మెరుగుపడవా?

కుంభకోణాలకు తోడుగా, విదేశీ బ్యాంకుల్లో 22 లక్షల కోట్ల రూపాయల ( 462 బిలియన్ డాలర్లు) నల్లధనాన్ని దాచుకున్నారు భారతీయ బడాబాబులు. ప్రతిష్టాత్మకమైన వికీలిక్స్ సంస్థ స్విస్ బ్యాంకుల్లో దాచుకున్న వారి చిట్టాను బయటపెడతానని ప్రకటించింది. విదేశాలు అందించిన నల్ల కుబేరుల వివరాలు బహిర్గతం చెయ్యడం సాధ్యం కాదని సెలవిచ్చారు మన ప్రధానమంత్రి. మనకంటే చాలా చిన్నవి, ఆర్థికంగా బలహీనంగా వున్న ఫిలిప్పైన్స్, నైజీరియా లాంటి దేశాలు స్విస్ బ్యాంకుల నుండి అధికారయుతంగా సమాచారాన్ని సేకరించడంతోపాటు, నేరస్థులను శిక్షించారు. మన ప్రభుత్వం కూడా నల్ల ధనంపై డొల్ల మాటలు కట్టిపెట్టి కార్యాచరణకు పూనుకోవాలి.

ఆమ్,ఆద్మీ పేరుతో గద్దెనెక్కిన యు.పి.ఏ ప్రభుత్వం సామాన్యుల గోడు పట్టించుకోకపోగా, మరిన్ని భారాలతో వారి నడ్డి విరగ్గొడుతోంది. ఇటువంటి పరిస్థితుల్లో ప్రజలంతా పోరు బాట పట్టి ప్రభుత్వంపై వత్తిడి తేవాలి. ఈ నూతన సంవత్సరంలోనైనా ప్రజా ఎజెండాను రూపొందించేలా ప్రజా పోరాటాలు ఉధృతం చెయ్యాలి. మన దేశ వనరులు లూటీ కాకుండా నిరోధించి, మహోన్నత భారతాన్ని నిర్మించుకోవాలి.



## చైతన్య మానవి

### ఈ సంచికలో...




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం**

రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్:
2,1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు

**ఎస్. పుణ్యవతి**

మేనేజర్

**ఎం.సుధ**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

**విరాళం రూ : 10/-**

ప్రజాశక్తి డైలీ ప్రింగ్‌ప్రెస్, ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020



**నూతన సంవత్సర శుభాకాంక్షలు**

**2011**




అంతులేని అవినీతి భారతం
ఐక్య పోరుతో పడదాం భరతం

**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా)**


### ఈతరం బాల్యం

అమ్మ అనటం రాని ప్రాయంలోనే
అక్షరాభ్యాసం
పాలసీసా పట్టుకోవడం రాని చేతికి
పెన్సిల్, నోట్‌బుక్

మాతృభాష రాలేదు ఇంకా
ఇంగ్లీషు భాష మొదలు
మమ్మీ, డాడీ, మిల్క్‌వాటర్
వంటి ఇంగ్లీషు మాటల గారడి
వేలకి వేలు డొనేషన్లు ఎబిసిడిలకి

స్కూళ్లోను, రిక్షాల్లోనూ అలిసి
అమ్మఒడిలో చేరాలని
ఇంటికి వస్తే డోర్ లాక్

అమ్మకోసం ఎదురుచూపు
ఆఫీసులో అలసిన అమ్మకి
లాలించే ఓపిక, తీరిక ఏది?

హాయిగా ఆడుకునే టైమ్
హోంవర్క్‌కి సరిపోతుంది
లేరులే ఆటల్లోనేస్తాలు
ఉన్నాయి టివి ఛానల్స్ కావాల్సినన్ని

ఇరవయ్యేకటో శతాబ్దం
ప్రగతిశీలులారా?
పిల్లల బంగారుబాల్యం
నిర్దయంగా - కర్కశంగా కరిగిపోతోంది

ఇలాగే సాగితే
బంగారు బాల్యం పేరుతో
మరొక పాఠ్యపుస్తకం చదవాలేమో?

శోధించండి
బాల్యం గతి తప్పితే
భావి జీవితమే
గతి తప్పుతుంది సుమా!

- పి. నాగలక్ష్మి

# అంతర్జాతీయ మహిళా దినోత్సవ స్ఫూర్తితో...

-ఎస్. స్వరూపరాణి.

అంతర్జాతీయ మహిళా దినోత్సవం ప్రారంభించి వందేళ్లు పూర్తయ్యాయి. 21వ శతాబ్దంలోకి అడుగుపెట్టి పదేళ్లు గడిచిపోయాయి. మహిళా దినోత్సవానికి శతాబ్దకాలం గడిచినా మహిళల పరాధీనత, సాధికారతలో సమూల మార్పులు రాలేదు. గత రెండు దశాబ్దాలుగా పాలకులు అనుసరిస్తున్న ప్రపంచీకరణ, సరళీకరణ విధానాలవలన మహిళాసమస్యలు కొత్త రూపాలు సంతరించుకున్నాయి. సామాజిక, ఆర్థిక దాడికి వ్యతిరేకంగా స్త్రీలు తమ అస్థిత్వం కోసం అలుపెరగని పోరాటం చేస్తున్నారు.

బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ సమాజాలలో పీడన, దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన పోరాటాలలో పురుషులతో పాటు ప్రపంచవ్యాప్తంగా మహిళలు భాగస్వాములుగా వున్నారు. ఫ్యూడల్ వ్యవస్థలో వున్న ఆస్తి సంబంధాలు స్త్రీని ఇంటికి బందీ చేయగా పారిశ్రామిక విప్లవం అనివార్యంగా స్త్రీలను సామాజిక ఉత్పత్తిలో భాగస్వాములను చేసింది. కుటుంబ హింసో అణగారిన స్త్రీలు, కుటుంబ ఆర్థిక కారణాల రీత్యా అనివార్యంగా పరిశ్రమల్లో కార్మికులుగా పని చేయడం ప్రారంభించారు. ఈ చర్య సామాజికంగా మహిళలను అభివృద్ధి పథం వైపు నడిపింది. పెట్టుబడిదారీ వ్యవస్థ కార్మికులతో విపరీతమైన శ్రమదోపిడీకి పాల్పడింది. తద్వారా పారిశ్రామిక పెట్టుబడి పోగు పడింది. పురుషుల కన్నా స్త్రీలకు, పిల్లలకు అతి తక్కువ వేతనాలిచ్చి పనిలో పెట్టుకునేవారు. ఫ్యాక్టరీలలో వేలాది మంది మహిళలు, పిల్లలు పని చేసేవారు. వారి పరిస్థితులు అత్యంత దయనీయంగా వుండేవి. అదనపు పనికి ఎలాంటి వేతనాలు వుండేవి కాదు. రోజుకు 18గంటలు పనిచేయాల్సివచ్చేది. కనీస సౌకర్యాలు లేని వాతావరణంలో సరైన వెలుతురు కూడా లేని చోట పని చేయాలి. యూరినల్స్‌కి వెళ్ళాలన్నా, బిడ్డకు పాలు ఇవ్వాలన్నా యజమాని అనుమతి తీసుకోవాలి. పసిపిల్ల వాడికి పాలు యివ్వాల్సివస్తే ఆమె పనినే కోల్పోయేది. పేదరికం కారణంగా పనిని పోగొట్టుకోలేక బిడ్డనే కోల్పోవలసి వచ్చేది.

ఆమెరికాలోని న్యూయార్క్ నగరంలో బట్టలమిల్లుల్లో పనిచేసే మహిళలు 1857 మార్చి8న 18 గంటల పనిని తగ్గించాలని, పని ప్రదేశాలలో సౌకర్యాలు కల్పించాలని, వేతనాల పెంపుకోసం, ఓటుహక్కు కావాలని న్యూయార్క్ నగరంలో మహిళలు భారీ ప్రదర్శన, పికెటింగు జరిపారు. సమ్మె చేస్తున్న మహిళా కార్మికులను నిర్బంధించి కాల్పులు జరిపింది యాజమాన్యం. కాల్పుల్లో దాదాపు 146మంది యువతులు చనిపోయారు. అయినా మహిళలు పట్టువీడక సమ్మె కొనసాగించటంతో యాజమాన్యం తల ఒగ్గక తప్పలేదు. మహిళలు సంఘటితంగా పోరాడి హక్కులు సాధించుకున్న తీరు ప్రపంచ మహిళా లోకానికి స్ఫూర్తి నిచ్చింది. యాభై ఏళ్ళ అనంతరం 1908లో న్యూయార్క్ నగరంలో సుమారు 30వేలమంది మహిళా కార్మికులు 8 గంటల పని కొరకు, వేతనాలు, ఓటుహక్కు కోసం వీధుల్లో ప్రదర్శన జరిపారు. ''ఆకలి [illegible]తో చస్తూ బ్రతికేకన్నా పోరాడుతూ చావడం మేలు'' అన్న నినాదాన్ని ముందుకు తెచ్చారు. వారి ప్రదర్శనపై పోలీసులు పాశవికంగా దాడిచేశారు. ఆ దాడిలో వందలాదిమంది గాయపడ్డారు. అనేక దేశాలలో జరిగిన పారిశ్రామిక కార్మిక పోరాటాలలో పురుషులతో పాటు స్త్రీలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. 8గంటలు మాత్రమే పని వుండాలి, వేతనాలు పెంచాలి, ప్రసూతి సౌకర్యాలు, పిల్లలకు పాలిచ్చేందుకు కొంత సమయం కేటాయించాలని, ఓటుహక్కు మొదలైన డిమాండ్స్‌తో మహిళా కార్మికులు పోరాటాలలో పాల్గొన్నారు. ఉద్యమాలలో తాము పాల్గొనటానికి ఇంటి బాధ్యతలకు ఎలాంటి ఆటంకం లేకుండా జాగ్రత్త పడేవారు. కుటుంబ ప్రయోజనాలతోపాటు సంఘ ప్రయోజనాలకు కూడా ప్రాధాన్యతనిచ్చేవారు.

1907, స్టట్‌గార్ట్‌లో మొట్టమొదటి ఇంటర్నేషనల్ సోషలిస్టు వుమెన్స్ కాన్ఫరెన్స్

జరిగింది. ఈ కాన్ఫరెన్స్‌కు 15 దేశాలకు చెందిన 59మంది మహిళలు పాల్గొన్నారు. క్లారాజెట్కిన్ నాయకత్వాన అంతర్జాతీయ బ్యూరో ఏర్పడింది. 1910 కోపెన్‌హెగెన్‌లో 2వ అంతర్జాతీయ సోషలిస్టు మహిళా సదస్సులో మార్చి 8 మహిళల హక్కుల దినంగా జరపాలని ప్రపంచ మహిళలకు పిలుపునిచ్చింది. ఆనాటి నుండి సమానత్వం కొరకు, దోపిడీ, పీడనకు వ్యతిరేకంగా మార్చి 8 మహిళా దినోత్సవం జరుపుకుంటున్నాం. క్లారాజెట్కిన్, లా పాషనారా మొదలైన సోషలిస్టు మహిళల పిలుపుతో ప్రారంభమైన మార్చి8న మహిళా దినోత్సవం ప్రపంచ వ్యాప్తంగా వ్యాప్తిచెందింది.ప్రభుత్వాలు కూడా మహిళా సమస్యలను పరిగణనలోకి తీసుకోవాల్సిన పరిస్థితి నెలకొంది. మహిళా సమస్యలపై చర్చించేందుకు ప్రపంచ మహిళా సదస్సు జరపాలని 1972లో జరిగిన ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశం నిర్ణయించింది. మొట్టమొదటి అంతర్జాతీయ మహిళా సదస్సు 1975లో మెక్సికోలో జరిగింది. ఆసదస్సులో దశాబ్దకాలం (1975నుండి1985)పాటు అంతర్జాతీయ మహిళా దినోత్సవాలు ప్రత్యేకంగా నిర్వహించాలని పిలుపునిచ్చింది. 150దేశాలు ఈ తీర్మానానికి మద్దతు తెలిపాయి. భారతప్రభుత్వం మహిళల పట్ల వున్న అన్ని విధాలైన వివక్షతలను, అసమానతలను తొలగిస్తామని, మార్చి 8ని మహిళా దినోత్సవంగా జరుపుతామని ప్రకటించింది మూడవ ప్రపంచ మహిళా సదస్సు 1985లో నైరోబీలో జరిగింది. దశాబ్ద కాలంగా ఆయా దేశాలు సాధించిన విజయాలను సమీక్షించించింది. 1995లో బీజింగ్‌లో నాల్గవ ప్రపంచ మహిళా సదస్సు జరిగింది. అందులో 195 దేశాల నుంచి ప్రతినిధులు పాల్గొన్నారు. ఆసదస్సులో మహిళా సంఘాలు పెట్టిన అనేక తీర్మానాలు ఆమోదింపబడ్డాయి. ఈనేపథ్యంలో ప్రభుత్వాలు అనివార్యంగా మహిళా సమస్యల పరిష్కారానికి కృషి చేయాల్సిన అవసరమేర్పడింది. ఉదా: ఉద్యోగాలు, చదువులలో 33శాతం రిజర్వేషన్స్, పంచాయితీ లలో 73,74వరాజ్యాంగ సవరణ, వరకట్న నిషేధం మొదలైన చట్టాలను పోరాట ఫలితంగా మన దేశంలో సాధించుకోగలిగాం.

నేడు బహుళ జాతి సంస్థలు మహిళా దినోత్సవ అసలు ఉద్దేశ్యాన్ని మరుగున పరిచి తమ ఉత్పత్తుల అమ్మకాలకు ప్రచారానికి ప్రత్యేక వేదికగా మలుచుకుంటున్నాయి. కర్తవ్యాలను రూపొందించుకుని సాధించు కునే దిశగా ఐద్వా మహిళా దినోత్సవాలను దేశవ్యాప్తంగా నిర్వహిస్తుంది.

2015 నాటికి జండర్ సమానత్వాన్ని, మహిళల సాధికారితను సాధించడం, హింసను నిరోధించడం. తల్లీ పిల్లల ఆరోగ్యాన్ని మెరుగు పరచడం, పిల్లల మరణాలను తగ్గించడం, పేదరికం, ఆకలిని నిర్మూలించటం, ప్రాథమిక విద్యను అందించటం వంటి సహస్రాబ్ది లక్ష్యాలను సాధించేందుకు అవసరమైన చర్యలు చేపట్టాలని ఐక్యరాజ్య సమితి ప్రకటనపై భారత ప్రభుత్వం కూడా సంతకం చేసింది.




అయితే 2015 నాటికి మనం ఈ లక్ష్యాలను సాధించగలమా? మానవాభి వృద్ధి సూచిలో 177 దేశాలకు గాను మనదేశం 134 వస్థానంలో వుంది

గత రెండు దశాబ్దాలుగా పాలకవర్గాలు అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాల వలన ఎన్నో పోరాటాల ద్వారా సాధించుకున్న చట్టాలు కనుమరుగవుతున్నాయి. రాత్రి షిఫ్టులలో మహిళల చేత పనిచేయించ కూడదనే నిబంధన సడలించింది. పర్మినెంటు ఉద్యోగాలు స్థానే క్యాజువల్ కార్మికులు, గృహకార్మికులు 10 నుండి 12 శాతం పెరిగారు. పనిగంటలు పెరిగాయి. శ్రమ దోపిడీ పెరిగింది. కాంట్రాక్టు కార్మికులకు నిజవేతనాలు లేవు. ఉద్యోగ భద్రత లేదు. శాశ్వత ఉద్యోగులలో రిటైర్ అయిన స్థానంలో కొత్త నియామకాలు లేకపోవటంతో ఉన్న వాళ్ళపై పని భారం పెరుగుతున్నది. ప్రభుత్వ రంగాన్ని మూసివేసి ప్రైవేటీకరించే దిశగా ప్రభుత్వాలు నడుస్తున్నాయి.పేదల సంక్షేమాన్ని విస్మరించి ప్రాథమిక విద్య,వైద్యరంగాలను కార్పోరేటీ కరిస్తూంది. ప్రైవేటీకరణవలన 1/3 వంతు ఉద్యోగాలలో మహిళలకు అవకాశాలు కల్పిస్తూ చేసిన చట్టం నీరుకారిపోతుంది. క్రింది స్థాయి ఉద్యోగినుల దగ్గర నుండి పై స్థాయి వరకు లైంగిక వేధింపులు పెరిగాయి. ఇదేమని ప్రశ్నించే వీలులేదు. తమ సమస్యల పరిష్కారానికై పోరాడుతున్న మహిళా ఉద్యోగినులు,కార్మికులపై ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధకాండ ప్రయోగిస్తుంది.

ప్రపంచీకరణ తెచ్చిపెట్టిన సంస్కృతులు స్త్రీలపై లైంగిక దాడుల పెరుగుదలకు దారితీస్తున్నాయి. పిల్లలపట్ల అనుచిత లైంగిక ప్రవర్తన , లైంగిక కుంభకోణాలు, బ్లాక్‌మెయిలింగ్‌లు వగైరాలు పెరిగాయి. నయా ఉదారవాద విధానాల వల్ల వినియోగ విలువలు సర్వవ్యాపితమవుతున్న పరిస్థితులలో మీడియా స్త్రీని వస్తువుగా చిత్రించడం పెరిగింది. స్త్రీలను కించపరిచే విధంగా అసభ్యంగా చిత్రించే ధోరణులు సీరియళ్ళలోనూ, సినిమాలలోనూ విపరీతం గా పెరుగుతున్నాయి. దారిద్ర్యం కారణంగా ఎక్కువమంది స్త్రీలు వ్యభిచార వృత్తిలోకి నెట్టబడుతున్నారు. మార్కెట్ విలువలు గుడ్డి వినియోగ సంస్కృతి వరకట్న దాహాన్ని పెంచుతూ అంటురోగంలా దేశమంతా విస్తరిస్తున్నది. ఇది స్త్రీల ప్రతిపత్తిపై అనేక విధాల ప్రభావం చూపిస్తున్నది. స్త్రీ, శిశు, భ్రూణ హత్యలు దిగ్భ్రాంతికరంగా పెరగడానికి వెనుక ప్రధాన కారణం ఇదే. అదే సమయంలో పెరిగిపోతున్న గృహ హింస పెద్ద సంఖ్యలో స్త్రీల ప్రాణాలు బలిగొంటోంది. వారి శారీరక, మానసిక ఆరోగ్యాలను హరిస్తున్నది.

మహిళా సాధికారత కాగితాలకు పరిమితమైంది. అనేక ఉద్యమాలు చేసిన ఫలితంగా పంచాయితీలలో 73, 74 రాజ్యాంగ సవరణ వచ్చింది. దేశంలో 10లక్షల మంది పైగా మహిళలు పరిపాలనలో భాగస్వాములయ్యారు. ఉన్నత పదవులలో వున్న రాష్ట్రపతి, స్పీకరువంటి కొద్ది మంది మహిళలను చూపించి మహిళలు అన్ని రంగాలలో సాధికారిత సాధించారని పాలకులు ప్రచారం చేస్తున్నారు. రాజకీయ పార్టీల అంతర్గత కమిటీలలో మహిళలు ప్రాతినిధ్యం నామ మాత్రమే. 1996 నుండి చట్టసభలలో మూడోవంతు మహిళా రిజర్వేషన్ బిల్లు కొఅకు మహిళాసంఘాలు ఆందోళనలు చేస్తున్నాయి. ఏకాభిప్రాయం లేదనే సాకుతో బిల్లును పార్లమెంట్‌లో

ప్రవేశపెట్టడం లేదు. 15వ లోక్‌సభలో మహిళల భాగస్వామ్యం 10.5శాతానికి మించలేదు. 544 స్థానాలకు 55 మంది మహిళలు మాత్రమే ఎన్నికయ్యారు. మన రాష్ట్రంలో 294 స్థానాలకు 35 మంది మాత్రమే ఎన్నికలలో గెలుపొందారు. గత సంవత్సరం మార్చి 9న రాజ్యసభలో ఆమోదం పొందిన బిల్లు లోకసభలో ఆమోదానికి పెట్టలేదు. లింగ వివక్షతతో కూడిన మన రాజకీయ సంస్కృతిని మహిళలు అవగాహన చేసుకోవాలి. మార్చిలో జరగబోయే బడ్జెట్ సమావేశాలలో బిల్లుని పార్లమెంటులో ఆమోదానికి పెట్టి ప్రజాస్వామ్యం విలువలు కాపాడటానికి పోరాడుదాం.

దేశంలో ఆర్థిక అసమానతలు పెరిగాయి స్త్రీ పురుషుల మధ్య అంతరాలు పెరుగుతున్నాయి. ఒకవైపు వెలిగిపోతున్న భారతం మరో వైపు పేదరికంతో నలిగి పోతున్న భారతం నెలకొంది .ఆహార గిడ్డంగుల్లో 6కోట్ల టన్నులు ఆహారధాన్యాలు పేరుకుపోయాయి. ఇంకోవైపు అర్థాకలితో ప్రజలు పస్తులుంటున్నారు. ప్రపంచ ఆకలి సూచిలో 88దేశాలలో మనదేశం 66వ స్థానంలో వుంది. 1990 తర్వాత ప్రపంచ కుబేరులలో 39నుండి 53కి పెరిగారు. మరోపక్క నిత్యావసరాల ధరల పెరుగుదల వలన స్త్రీలు తమ వినియోగాన్ని తగ్గించు కుంటున్నారు. ప్రజాపంపిణీ వ్యవస్థను నీరుగార్చటంతో ఆహారలభ్యత క్షీణించటం వలన తిండికోసం మహిళలు మరింత శ్రమ చేస్తున్నారు. 8.5 శాతం వున్న ఆహార ద్రవ్యోల్బణం 18.8 శాతానికి చేరుకుంది. ఫ్యూచర్, ఫార్వర్డ్ ట్రేడింగ్‌కు బడా పెట్టుబడిదారులకు అవకాశమివ్వటం వలన ధరలపై నియంత్రణ లేదు.. పెట్రోలు, డీజిల్‌పై వున్న నియంత్రణ ఎత్తివేయటం వల్లకూడా ధరలు పెరుగుతున్నాయి.

సుప్రీంకోర్టు గోడౌన్లలో ముక్కి పోతున్న బియ్యాన్ని ఉచితంగా 35కిలోల చొప్పున పంపిణీ చేయమని ఆదేశాలిచ్చినా ప్రభుత్వం అందుకు సిద్ధపడడం లేదు. ధరలు పెరుగుదల వలన మహిళలు, పిల్లల్లోరక్తహీనతపెరిగింది. పౌష్టికాహారం లేక శిశుమరణాలు పెరిగాయి. (1000జననాలకు 62మరణాలు) పుట్టే బిడ్డలు 54.16 శాతం బరువుతో తక్కువతో వుంటున్నారు. మన దేశంలో రోజుకు 6వేల మంది పిల్లలు పౌష్టికాహారంతో మరణిస్తున్నారు. ఏటా 20 లక్షల మంది పిల్లలు 6 సం॥ల లోపు మరణిస్తున్నారని జాతీయ ఆరోగ్య సర్వే లెక్కలు తెలుపుతున్నాయి. పేదరికం, ఆకలి, ధరల పెరుగుదలను వ్యతిరేకంగా ఉద్యమించాలి. ఫ్యూచర్, ఫార్వర్డ్ ట్రేడింగ్‌ని నిషేధించి ప్రజాపంపిణీని సార్వజనీకం చేయాలి. గ్రామాల్లో పట్టణాల్లో నివసించే నిరుపేద మహిళలకు ఆహార భద్రత ఉపాధికోసం మార్చి8ని స్ఫూర్తిగా తీసుకుందాం.

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శతాబ్ది ఉత్సవాల సందర్భంగా మహిళలపై జరుగుతున్న అణచివేత, దోపిడీ, పీడనకు వ్యతిరేకంగా ఉద్యమిద్దాం! లింగ అసమానతకు వ్యతిరేకంగా సమానత్వం కోసం పోరాడుదాం. అవినీతి, ధరలు, నిరుద్యోగ్యాన్ని పెంచడంతోపాటు నిరంకుశ పాలన చేస్తున్న ముబారక్ ప్రభుత్వానికి ఘోరీ కట్టిన ఈజిప్ట్ ప్రజల పోరాట స్ఫూర్తిని తీసుకుందాం! ప్రపంచీకరణ, సరళీకరణ విధానాలను ప్రతిఘటిద్దాం!!

**గమనిక**

చైతన్య మానవి పత్రిక ప్రింటింగ్ చార్జీలు పెరగడం వలన పేజీలు 48కి పెంచి వెల రూ. 10లకు పెంచడమైనది. పాఠకులు ఈ పెంపును గమనించగలరు.

ఎడిటర్

## మంటల్లో మానవత

కాలమా కనుచున్నావా
విశ్వంలోని వింతలు
కావవి వింతలు విడ్డూరపు చర్యలు
అమానుషత్వపు అకృత్యాలు
గుండెల్లేని బండల్లాంటి
తనయులున్న తల్లితండ్రుల కోసం
వెలిశాయి వృద్ధాశ్రమాలు
వేనవేల సంఖ్యల్లో
అసురులు సైతం చేయలేని
అకృత్య చర్యలను అవలీలగ చేస్తున్న
మానవుల మనస్తత్వాలు
సభ్య సమాజం సిగ్గుతో తలవంచే
దానవాతీత దహనకాండలు
మనసున్నా లేకున్నా మనకే దక్కాలనుకొనే
దుర్బుద్ధి మహమ్మారి
దాపురించిందీ నేడు మానవజాతికి
అందుకే అబలలపై, అతివలపై
పురుష్యాధిక్యహంకారం
విషపు కోరలు చాపి కాటువేస్తోంది
విశృంఖలత్వాన్ని ప్రదర్శిస్తోంది
అమ్మాయంటే అందం
అందమంటే అనుభవం అనుకొనే
నీచజాతి భావాల సముదాయానికి
సమాధులు కట్టేదెన్నడో
సూర్య కిరణాల్లోని తీక్షణత్వాన్ని
మంచు బిందువుల్లోని శీతలత్వాన్ని
గమనించగలిగిన పురుషజాతికి
అతివల మదిలోని అంతర్మథనం
అర్థం కావడం లేదా
వాళ్ళ కళ్ళలో వెలిగే జీవితాల
ఆశాజ్యోతుల కాంతులు
కనబడడం లేదా
కఠకు రాయి గుండెలతో
కసాయి తనపు చేష్టలతో
యాసిడ్‌లతో దాడులు
బ్లేడులతో కోతలు
గొడ్డళ్ళతో నరికి వేతలు
చూస్తున్న వారి గుండెలోతుల్లో
భయకంపిత ప్రకంపనాల హోరులు
ఇవేనా మానవ జీవితాల విలువలు
ఎటుపోతోంది నరజాతి గమనం
ఎక్కడికి చేరుతోంది
దారుణకాండ గమ్యం
మంటల్లో మానవత మసి అవుతుంటే
కళ్ళు తెరచి చూడాలన్నా
రేపటి కోసం జీవించాలన్నా
బ్రతకాలన్నా మనసే లేని మనసుతో
మనుగడ సాగించాలన్నా
సహకరించలేనంటోంది నా ఆత్మ
నాలో నుండి నన్ను వేరుచేస్తూ
వెళ్ళి పోతానంటూ..........
నేను ఒప్పుకోవడం లేదు
ఆ అవకాశమివ్వడం లేదు
అందుకే చెప్తున్నాను నా ఆత్మకి
కాసేపు ఆగు ఆలోచించు
కాలము చూస్తు ఊరుకోదు
కాలానికి అనంతమైన శక్తి ఉంది
గాయాలను రేపేది మాన్పేది కాలమే
మళ్ళీ మంచి రోజులు వస్తాయి
మమత మానవత్వాల
పరిమళాలు వెదజల్లే
మంచి మనసులతో ఉండే
మంచి సమాజం తెస్తుంది
అది చూడాలంటే నేనుండాలి
నేనుండాలంటే నాలో నీవుండాలి

-సి. హెచ్. కళావతి.

# ఐపిసి 498-ఎ కోసం 'ఐద్వా' సాగించిన మహోద్యమం

## సింహావలోకనం

-అల్లూరి మన్మోహిని

స్వతంత్ర భారత మహిళల రక్షణకై ఐ.పి.సి 498 ఎ, సెక్షన్ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా ఉద్యమం సాధించి ఇచ్చిన గొప్పవరం.

అది 19 1983 నవంబరు నెల. ఐద్వా కేంద్ర కమిటీ పిలుపు. దేశంలోని ఐద్వా రాష్ట్ర కమిటీలన్నీ తక్షణమే కదిలి, భారత ప్రజలందరితో వరకట్న హింసల నుండి మహిళల రక్షణ కోరుతూ అప్పటి ప్రధాని ఇందిరాగాంధీకి పోస్టులో ఉత్తరాలు రాయించే కార్యక్రమం.

స్వాతంత్ర్యం వచ్చాక భారత ప్రజలు దేశ ప్రధానికి స్వయంగా ఉత్తరాలు రాసుకునే అవకాశం అఖిల భారత ప్రజాతంత్ర సంస్థ దేశ చరిత్రలో మొదటిసారి కల్పించింది. అదే దేశవ్యాపిత పోస్టు. కార్డుల మహోద్యమం. అంటే పోస్టుకార్డుమీద రెండే వాక్యాలు.

> భారత ప్రధానమంత్రిగారికి, న్యూఢిల్లీ
> 1.వరకట్న నిషేధ చట్టం పటిష్ఠంగా అమలు జరగాలి.
> 2. మహిళలకు రక్షణ కల్పించాలి.
>
> -ఇట్లు
> పోస్టు చేసిన వ్యక్తి సంతకం
>
> ఫ్రం అడ్రసు: అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం
> రాష్ట్రం పేరు, జిల్లా , గ్రామం పేరు:
> పోస్టు కార్డు వెళ్ళాల్సిన ప్రదేశం: ప్రధానమంత్రి గారికి న్యూ ఢిల్లీ.

అని పోస్టు కార్డుల మీద ప్రింటు చేసి దేశంలోని అన్ని రాష్ట్ర కమిటీలు నమూనా పంపిస్తే స్థానికంగా ఎక్కడిక్కడ ఆయా ప్రాంతాల్లో వున్న పోస్టాఫీసులో పోస్టుకార్డులు కొని, ప్రింటు చేయించి జిల్లా, గ్రామ కమిటీలు కార్యకర్తలకు అందించటం జరిగింది. కార్డు ఖరీదు 15 పైసలు, ప్రింటింగ్ చార్జి 10 పైసలు అంటే ఇరవై ఐదు పైసలు వ్యక్తుల దగ్గర తీసుకొని సంతకం చేయించి, ఎవరి కార్డు వారికే ఇచ్చేసి వారినే పోస్టు బాక్సులో వేసుకోమని చెప్పారు. ఆ పద్ధతిలో సాగిన ఆ ఉద్యమం ప్రజలను, పార్లమెంటును స్తంభింపజేసింది. ఆ సమయంలో శీతాకాల సమావేశాలు ప్రారంభమయ్యాయి. 1983 డిసెంబరు 12వ తేదీ వరకు జరిగాయి. డిసెంబరు 8వ తేదీ లోపు దేశవ్యాప్తంగా ప్రజలు అనగా భారతదేశ స్త్రీ, పురుషులు పోస్టు చేసిన కార్డులు ప్రధానమంత్రిగారికి చేరిపోవాలి. అని ఐద్వా ఆదేశం. ఐద్వా కార్యకర్తలు ప్రకటించిన కార్యక్రమంలో కర్తవ్యోన్ముఖులై కదిలారు. పట్టణ, గ్రామీణ ప్రాంతాల్లోని ఐద్వా కార్యకర్తలు ఇనుమడించిన దీక్ష, పట్టుదలతో పోస్టు కార్డులు పట్టుకుని పేటలు, ఆఫీసులు అంటే కలెక్టరు, జిల్లా పరిషత్తు, మున్సిపల్, ఎమ్మార్వో మొదలైన ఆఫీసులలోని ఉద్యోగులు కార్డులుపోస్ట్ చేశారు. విద్యాసంస్థలు కళాశాల విద్యార్థులు, లెక్చరర్లు మొదలైన అన్ని వర్గాల ప్రజలను కలుసుకుని అది ఒక మహోద్యమంగా సాగించారు. ముఖ్యంగా సంతకం చేసి ఎవరికి వారే కార్డును పోస్టు చేసుకోవటం మూలంగా వ్యక్తిగతంగా దేశప్రధానికి ఉత్తరం వ్రాసుకుంటునట్లు



ఎవరికి వారే ఆ పని ఎంతో గొప్పగా భావించి స్పందించారు. జీవితంలో వ్యక్తిగతంగా దేశప్రధానికి నేను ఉత్తరం వ్రాసుకున్నాను అనే ఉత్తేజం పొందారు. జిల్లాలోని పోస్టాఫీసుల్లో 1000, 2000 పోస్టుకార్డులు కావాలని కొనటకు వెళితే కావాల్సినన్ని దొరికేవి కావు. పట్టణాలలోని పోస్టాఫీసులన్నీ తిరిగి ఎక్కడ ఎన్ని దొరికితే అన్నీ కొని, ప్రింటు చేయించుకునేవారం. ఆ రకంగా ఆ పోస్టుకార్డుల ఉద్యమం బాగా ప్రచారమయింది. ఫలితంగా ఐద్వా ప్రతిష్ఠ బాగా పెరిగింది. దేశవ్యాపితంగా ప్రజల నుండి రోజూ వేలు లక్షలుగా అందుతున్న పోస్ట్ కార్డులతో ప్రభుత్వం వెంటనే స్పందించాల్సి వచ్చింది.

ఐద్వా ఉద్యమం పై రెండు రోజులు పార్లమెంటు సమావేశాల్లో చర్చ జరిగింది. అప్పటికే వరకట్న నిషేధ చట్టం వున్నా ఆ చట్టం కాగితాలకే పరిమితం అయ్యింది. వివాహ సందర్భంగా కుటుంబాలలో కట్నం ఇవ్వటం, పుచ్చుకోవటం అనేది ఒక గొప్ప తనంగా మారింది. వరకట్న నిషేధ చట్టం ఈ నియంతృత్వ దోపిడీ వ్యవస్థ మూలంగా చిత్తుకాగితంలా చెత్తబుట్టలోకి తోయ బడింది. వివాహమన్నది ఒక వ్యాపారంగా మారింది. కుటుంబంలోకి కొత్తగా అడుగు పెట్టిన స్త్రీని ఒక ఆర్థిక వనరుగా భావిస్తున్నారు.

పెట్టుబడిదారీ దోపిడీ వ్యవస్థలో స్త్రీని తక్కువగా చేసి చూపించే ప్రయత్నం నిరంతరం జరుగుతోంది. కానీ ఆచరణలో

అంతరిక్షంలోనే ఆరు నెలలు ఉండి అక్కడి వాతావరణంపై పరిశోధనలు జరిపిన సునీతా విలియమ్స్ వంటి ఎందరో స్త్రీలు తమ మేధస్సు, ధైర్య సాహసాలు పురుషులకన్నా దేనిలో తక్కువ కాదని నిరూపించుకున్నారు.

శాస్త్ర విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి చెందిన హైటెక్ నాగరిక సమాజంలో స్త్రీలపై వరకట్న హింసలు పెరిగిపోతున్నాయి. మహిళల రక్షణకై ప్రభుత్వ పరంగా చర్యలకై ఐద్వా తీసుకున్న చారిత్రాత్మక ఉద్యమం పోస్టు కార్డుల ఉద్యమం.

ఐద్వా ఉద్యమానికి కదిలిన కేంద్ర ప్రభుత్వం, దేశంలోని పోలీసు స్టేషన్లలో వరకట్న హింసలు హత్యలకు సంబంధించిన కేసులు ఒక నెలలో ఎన్ని రిజిష్టరు అయినవో వాటి అడ్రసులతో సహా ప్రభుత్వానికి వెంటనే రిపోర్టులు తయారు చేసి ఇవ్వాలని ఆదేశించారు. పోలీసు డిపార్టమెంటు ఒక్కో పోలీసు స్టేషన్‌లో నెలలో రికార్డు అయినవి దాదాపు 1100 కేసులు ఉన్నాయని రిపోర్టు ఇచ్చారు. అంటే పోలీసు కేసుల వరకు రానివి అజ్ఞాత హింసలు హత్యలు మూడు వంతులు ఉంటాయని అందిరికీ తెలిసిన విషయమే. పోలీసు రిపోర్టుతో మహిళలపై పెరుగుతున్న హింసను గమనించిన కేంద్ర ప్రభుత్వం మహిళా ఉద్యమానికి తలవంచి చట్టం చేయకతప్పలేదు.

ఇందిరా గాంధీ భారత ప్రధానిగా అధికారంలో ఉండగా తయారయిన నూతన చట్టం ఐ.పి.సి. 498ఎ సెక్షను. చట్టం వచ్చిన కొద్ది రోజులకే ఆమె 1984 అక్టోబరు 31న హత్య గావించబడ్డది.

ఐద్వా రాష్ట్ర కార్యాలయం నాటికి విజయవాడలోనే ఉన్నది. రాష్ట్ర కమిటీ ప్రధాన కార్యదర్శి మోటూరు ఉదయం ఆఫీసులో ఉన్నారు. మచిలీపట్నం నుండి తాతినేని ప్రసాద్(ఫిలిం డైరెక్టరు) గారి అమ్మాయి. తమ ఇంటి దగ్గరలో ఉన్న ఒక స్త్రీకి భర్తవల్ల ప్రాణాపాయం ఉందని ఉదయం దగ్గరకు తీసుకు వచ్చింది. ఆమె కంఠం మీద పీక నులిమివేసిన గాట్లు కూడా ఉన్నాయి. ఆందోళనతో వచ్చిన ఆ ఇద్దరినీ వెంటనే రిక్షా మీద పోలీసు సూపరెండెంటు ఆఫీసుకి తీసుకువెళ్లాం. ఎస్.పి.గా ఉన్న వ్యాస్ కు ఉదయం ఆ అమ్మాయి భర్త పెడుతున్న హింసలు వివరించగా వ్యాస్ గారు వెంటనే చర్యలు తీసుకుని ముద్దాయిని అరెస్టు చేసారు. బాధితురాలికి రక్షణ కల్పించారు. ఎస్.పి. వ్యాస్ ఉదయంను చూచి ఉత్సాహంతో అన్నమాటలు "మీరు సాధించుకున్న కొత్త చట్టాన్ని ముందుగా మీరే ఉపయోగించుకున్నారు." (మీరు అంటే ఈ ఉద్యమం సాధించుకున్న చట్టం) వ్యాస్ గారి వ్యాఖ్యానం, ఆయన కూర్చున్న ఆఫీసు రూము, ఆ మొదటి కేసు ఎప్పటికీ మరువలేము.

సమాజంలో సగ భాగమైన భారత స్త్రీల రక్షణకై మహా పురుషులు రాజా రామ్మోహన్‌రాయ్, గురజాడ, కందుకూరి వీరేశలింగంగారు మొదలైన మహనీయుల ఆశయాలకనుగుణంగా 1936వ సంవత్సరంలోనే ఐద్వా ఏర్పడింది. దేశంలో జాతీయ సంస్థగా జాతి రక్షణకు బహుముఖ సేవలందిస్తున్న ఐద్వా సాగించిన చారిత్రాత్మక మహోద్యమం భారత ప్రభుత్వాన్ని న్యాయ వ్యవస్థను కదిలించి సాధించిన గొప్ప వరం ఐ.పి.సి. 498ఎ సెక్షను. ధన స్వామ్య సమాజంలో 80శాతం స్త్రీలు బలిపశువులవుతున్నారు. 20శాతం పురుషులు కూడా స్త్రీల మూలంగా కష్టాలకు గురౌతున్నట్లు తెలుస్తుంది. కానీ జాతికి జన్మనిచ్చే స్త్రీలే పెద్ద సంఖ్యలో అరాచక శక్తుల చేతిలో ఛిద్రమైపోతున్నారు. సమాజంలో హింస అనుభవించే మెజారిటీ సంఖ్యను కాపాడాల్సిన ప్రధాన అంశాన్ని పరిశీలించిన మేధావి వర్గం, న్యాయ మూర్తులు తీసుకొచ్చిన ఈ చట్టం సామాజిక సంక్షేమం కోసం, కుటుంబ సౌభాగ్యం కోసం మరింత పటిష్టంగా అమలు చేయాలి. సమాజానికి కుటుంబ జీవితం పునాది. స్త్రీ సౌభాగ్యమే కుటుంబ సౌభాగ్యం. స్త్రీ సంక్షేమం అంటే సామాజిక సంక్షేమం అన్నారు మహనీయులు. స్త్రీ జీవితం చల్లగా సాగితేనే కుటుంబ జీవితంలో సుఖ శాంతులు వెల్లివిరుస్తాయి.

## మహిళల కన్నెర్ర

అరబ్బు దేశాలలో నియంతలకు, రాచరికానికి వ్యతిరేకంగా ప్రజలు సామూహికంగా తిరుగుబాటు చేస్తుంటే ఇటలీలో అధ్యక్షుని భోగలాలసత్వం, శృంగార లీలలకు వ్యతిరేకంగా మహిళలు కన్నెర్ర చేసారు. నాగరిక సమాజానికే మాయని మచ్చలా తయారైన అధ్యక్షుడు బెర్లుస్కోనీ దిగిపోవాలని పదిలక్షల మందితో ప్రదర్శన జరిపారు. 230 నగరాల్లో మహిళలు భారీ ప్రదర్శనలు నిర్వహించారు. 74 సం॥ల వృద్ధ నాయకునికి మహిళలంటే చులకన. ఆటబొమ్మల కిందలెక్క. బెర్లుస్కోనీ వికృత చేష్టలు భరించలేక ఇద్దరు భార్యలు విడాకులిచ్చారు. ఇటలీలో 18 సం॥ల లోపు యువతులతో డబ్బిచ్చి శృంగారం నెరపటం నేరం. మొరాకో దేశానికి చెందిన రూబీ అనే డ్యాన్సర్‌తో సాగించిన రాసలీలకు పాల్పడ్డారన్న అభియోగంపై కోర్టు విచారణ ఎదుర్కోబోతున్నాడు. ఈ ప్రబుద్ధుడు అవినీతి అక్రమాలలో ప్రపంచ కుబేరుల్లో 74 స్థానంలో వున్నాడు. అధ్యక్ష భవనాన్ని రాసలీలల కేంద్రంగానూ, అవినీతి నిలయంగానూ మార్చిన బెర్లిస్కోనీకి ఘోరీ కట్టాలని మహిళలు చేపట్టిన ఉద్యమం విజయవంతం కావాలని ఆశిద్దాం.

## త్రాగునీరు లేని 70-శాతం ప్రజలు

దేశంలో తాగునీరు, మరుగుదొడ్లు, విద్యుత్‌కు సంబంధించిన దిగ్భ్రమ కలిగించే విషయాలు వెల్లడయ్యాయి. గ్రామీణ ప్రాంతాల్లో ఈ మూడుసౌకర్యాలు ఉన్న గృహాలు కేవలం 18శాతం మాత్రమే ఉన్నాయి. పట్టణ ప్రాంతాల్లో అయితే 68శాతం గృహాలకు మూడు సౌకర్యాలు ఉన్నాయి. భారతదేశంలోని నివాస గృహాల పరిస్థితి, ఇతర సౌకర్యాలపై కేంద్ర ప్రభుత్వం జరిపిన నేషనల్ సాంపుల్ సర్వే 2008-09 నివేదికను కేంద్రం విడుదల చేసింది. ఆ నివేదికలో గ్రామీణ ప్రాంతాల్లో రక్షిత మంచినీటి సరఫరా, మూడో వంతుకంటే తక్కువ జనాభాకే అందుతోంది. 55% బోరు బావుల మీద ఆధారపడుతుండగా మిగిలిన 15 శాతం ఇంకా నీటి వనరుల కోసం ఎదురు చూస్తున్నారు. కేవలం గ్రామీణ ప్రాంతాలే కాదు, పట్టణ ప్రాంతాల్లోనూ 8% తాగునీటి సౌకర్యాలు అసలు లేవని సర్వేలో తేలింది. మిగిలిన వారిలోనూ 74 శాతానికి మాత్రమే అవసరాలకు తగినట్లుగా తాగునీటి సౌకర్యాలు ఉన్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో 65శాతానికి, పట్టణ ప్రాంతాల్లో 11% మరుగుదొడ్డి సౌకర్యాలు లేవని సర్వేలో తేలింది. దేశం మొత్తం మీద 75% ఇళ్ళకు విద్యుత్ సౌకర్యం వుంది. 55% మంది గ్రామీణులు, 92 శాతం మంది పట్టణ ప్రాంతాల ప్రజలు పక్కాఇళ్ళల్లో నివసిస్తున్నారు. అయితే గ్రామీణ, పట్టణ ప్రాంతాల బేధాలతో సంబంధంలేకుండా పెళ్ళయిన జంటల్లో 75మందికి ప్రత్యేక గది సౌకర్యం లేదని సర్వేలో ప్రశ్నల ద్వారా తేలింది.

# భారత శిక్షా స్మృతి

**(IPC) సెక్షన్ 498-ఎ చట్టంలో చేసిన సవరణల గురించి పిటిషన్స్ కమిటీకి ఐద్వా ఇచ్చిన మెమోరాండంలోని కొన్ని ముఖ్యమైన అంశాలు.**

ఐపిసి సెక్షన్ 498A ను నీరుగార్చి దాని ప్రాధాన్యతను తగ్గించే విధంగా డాక్టర్ అనుపమ సింగ్ అనే వ్యక్తి దాఖలు చేసిన పిటిషన్‌ను రాజ్యసభ పిటిషన్స్ కమిటి పరిశీలనలోకి తీసుకోవడం పట్ల ఐద్వా తీవ్ర విస్మయాన్ని, విచారాన్ని వ్యక్తంచేస్తుంది. పిటిషన్ దారుడు ఈ 498A సెక్షన్ బెయిల్ పొందే విధంగానూ మరియు ఈ సెక్షన్ పై కోర్టులకున్న హక్కుల పరిధినుండి మినహాయింపు ఇవ్వాలని కోరాడు.

తీవ్రమైన గృహహింస మరియు వరకట్న సంబంధిత వేధింపులు తీవ్రమైన నేరాలు అనే వాస్తవాన్ని 498A చట్టం గుర్తిస్తుంది. అందువలన ఈ నేరాలకు 3సంవత్సరాలు జైలుశిక్ష ఉండాలని చట్టం చెబుతుంది. నేరం చేసిన భర్త మరియు అత్తింటివారు కానీ విచారణకు గురి కాకుండా ఉండే విధంగా 498A చట్టం ప్రభావాన్ని పూర్తిగా తగ్గించే విధంగా ఈ పిటిషన్‌లోని ప్రయత్నాలు ఉన్నాయి. మహిళా సంఘాలు మరియు ఇతరుల సుదీర్ఘ పోరాటాల ద్వారానే IPCలో 498A చట్టాన్ని పొందుపరచడం జరిగిందని మేము ఈ సందర్భంగా చెప్పదలచుకున్నాము. సెక్షన్ 498A మరియు వరకట్న చావులకు సంబంధించిన 304B సెక్షన్‌లను చట్టంలో పొందుపరచినప్పటికీ వరకట్న సంబంధిత వేధింపులు మరియు గృహహింస పెరుగుతూనే ఉన్నాయి. తాజాగా NCRB లెక్కల ప్రకారం దేశ వ్యాప్తంగా 498A సెక్షన్ క్రింద ప్రతి సంవత్సరం 80,000 కేసులు నమోదవుతున్నాయి. ప్రతి కొన్ని నిమిషాలకు ఒక మహిళ వరకట్నం కారణంగా హత్యకు గురవుతుంది. కాని కొన్ని ఫిర్యాదులలో మాత్రమే నిందుతులకు శిక్ష పడుతుంది. చట్టాన్ని పోలీసులు మరియు అధికారులు సరిగా అమలు చేయకపోవడం వలననూ మరియు వరకట్న నిరోధ చట్టంలోని లొసుగుల వలననూ ఈ విధంగా జరుగుతుంది. 498A సెక్షన్‌ను నీరుగార్చే ఏ చర్య అయినా అది సమస్యలను పరిష్కరించడానికి ఉన్న చట్టం ప్రభావాన్ని మరింత బలహీన పరుస్తుందని మేము చెప్పదల్చుకున్నాము.

కోర్టులకున్న అధికారాల పరిధినుండి 498A సెక్షన్‌ను మినహాయించడమంటే బాధలో ఉన్న ఏ మహిళ అయినా చేసిన ఫిర్యాదు పట్ల పోలీసులు స్పందించరనీ మరియు 498A సెక్షన్‌లో నిర్వచించిన విధంగా మానసిక శారీరక హింసకు గురైన మహిళ చేసిన ఫిర్యాదుపై పరిశోధన జరపరనీ, వరకట్న వేధింపులపై, హింస పై స్పందించరనీ అర్థం. ఈ విధంగా 498A



సెక్షన్‌కు మినహాయింపులు ఇవ్వడం వలన మహిళలు ఈ సెక్షన్ క్రింద కేసులు నమోదు చేసే అవకాశం కోల్పోవడం జరుగుతుంది. ఎవరైనా బాధిత మహిళ కేసు నమోదు చేయాలంటే కోర్టుకు వెళ్ళి ఒక మెజిస్ట్రేట్ ముందు తన ఫిర్యాదు దాఖలు చేయాల్సి వస్తుంది. మన దేశంలో కొద్దిమంది మహిళలకు మాత్రమే ఈ విధమైన అవకాశం, సామర్థ్యం ఉంటాయి.

ఈ కేసులలో బెయిలుకు అవకాశం కల్పించడమంటే మెజిస్ట్రేటు ఆదేశం వుంటేనే తప్ప పోలీసులు ఏ వ్యక్తినీ ఎట్టి పరిస్థితుల్లోనూ అరెస్టు చేయలేరు. భారతీయ శిక్షాస్మృతి (IPC) ప్రకారం తీవ్రమైన నేరాలుగా పరిగణించని కేసులలో మాత్రమే అంటే సాధారణంగా 2సంవత్సరాల జైలు శిక్ష పడే కేసుల విషయంలో మాత్రమే బెయిలు పొందే అవకాశం వుంటుందని ఈ సందర్భంగా గుర్తుచేసుకోవడం మంచిది.

498A సెక్షన్‌లో బెయిలుకు అవకాశం కల్పించడమంటే మహిళలపై జరిగే గృహహింసను తీవ్రమైన విషయంగా పరిగణించక పోవడమే కాక హింసకు గురవుతున్న మహిళను హింసాత్మక భర్తనుండి తప్పించే ఏ విధమైన చర్యను పోలీసులు చేపట్టకుండా చేయడమే. ఒక చట్టబద్ధమైన పరిపాలనలో ఇలాంటివి జరగడానికి వీలులేదని మేము భావిస్తున్నాము. మరియు వేధింపులు, హింసకు గురవుతున్న మహిళకు చట్టబద్ధమైన రక్షణ కల్పించాల్సిన అవసరం ఉంది.

సెక్షన్ 498A ప్రభావాన్ని తగ్గించడం వలన మహిళలు పై కేసులలో రాజీ పడే విధంగా మరింత వత్తిడి పెరుగుతుంది. ఈ కేసులలో ఏ సందర్భంలోనైనా రాజీ కనుక కుదిరితే దానిని హైకోర్టుతో సహా ఏ కోర్టు అయినా దానిని గుర్తించి నేర పరిశోధనను వెంటనే ఆపివేస్తున్నాయి. చట్టం ఆసరాతో తప్పుడు కేసులు బనాయిస్తున్నారని పిటిషన్‌దారుడు చేసిన ఆరోపణలకు ఆధారాలేవీ లేవు. ఇవి చట్టాన్ని నీరు గార్చడానికి చేసిన ప్రతి పాదనలు మాత్రమే ఈ సెక్షన్ పట్ల భయంలేకుండా పెద్ద యెత్తున దీనిని దుర్వినియోగం చేస్తున్నారనీ, పెద్దయెత్తున ప్రజలు నీతి నిజాయితీలు లేకుండా మరియు దురుద్దేశాలతో దీనిని దురుపయోగం చేస్తున్నారనీ పిటిషన్‌లో పేర్కొన్నారు.

పిటిషన్‌లో పేర్కొన్న విధంగా విశృంఖల స్వభావం గల మహిళలు మరియు వివాహబంధాన్ని వదిలించుకొని డబ్బు గుంజడానికి ప్రయత్నించే మహిళలు ఈ సెక్షన్ క్రింద కేసులు నమోదు చేస్తున్నారన్న ఆరోపణలకు లెక్కలతో కూడిన ఎటువంటి ఆధారాలూ ఈ పిటిషన్‌లో లేవు. కనుక ఈ పిటిషన్ పూర్తిగా నిరాధారమైనదే కాక తప్పుడు ఊహాగానాలతో కూడి వుంది. కనుక దీనిని ఎంతమాత్రమూ ఆమోదించరాదు. ఏది ఏమైనా ఇక్కడ మేమొక విషయాన్ని ప్రస్తావించదలచుకున్నాము. అది ఏమిటంటే

2009లో క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ (IPC) కి సవరణలు చేసిన సందర్భంగా అరెస్టుల విషయంలో పోలీసుల అధికారాల విషయంలో కూడా సవరణలు జరిగాయి. ఒకవ్యక్తిని అరెస్టు చేసే ముందు ఆవ్యక్తికి సంబంధించిన కేసు 7సంవత్సరాల జైలు శిక్షార్హమైన నేరమైతే పోలీసులు ఆకేసుకు సంబంధించిన పూర్తి పరిశోధన జరపాల్సి వుంటుందనేది ఆ సవరణ. దానిలోనే ఇంకొక అంశం కూడా వున్నది. నేరస్థులు పోలీసులతో సహకరించి సాక్ష్యాధారాలను రూపు మాపకుండా వున్న పక్షంలో మామూలుగా అరెస్టులు జరగవని కూడా పేర్కొన్నారు.

వరకట్న వేధింపులు, వరకట్న చావులు మరియు గృహహింసకు సంబంధించిన అనేక వేలకేసులను మా సంఘం గతంలోనూ ఇప్పుడూ రోజూవారీ చేపడుతున్నది. మహిళలు అత్తింటిలో ఎంతో సుదీర్ఘకాలంగా హింస మరియు వేధింపులు ఎదుర్కొన్న తరువాత బాధ భరించలేని స్థితిలో మాత్రమే సాధారణంగా ఈ సెక్షన్ క్రింద ఫిర్యాదులు నమోదు చేస్తున్నారనేది మా అనుభవం. రోజూ పదే పదే పెట్టే హింసను భరించలేని వారు మాత్రమే ఫిర్యాదు చేస్తున్నారు. అయినప్పటికీ ఈ 498A సెక్షన్ క్రింద కేసు నమోదు చేసిన మహిళ పురుషాధిక్యత యొక్క ఆగ్రహాన్ని, న్యాయవ్యవస్థలో నెలకొనివున్న అవినీతి, అసమర్థత లాంటివాటిని ఎదుర్కోవాల్సి వస్తుంది. న్యాయవ్యవస్థను ఉపయోగించుకొనే క్రమంలో మహిళలు ఈ క్రింద తెలిపిన విధంగా అడ్డంకులు ఎదుర్కొంటున్నారు.

- ఈకేసులలో ఫిర్యాదులను స్వీకరించడానికే పోలీసులు చాలా దీర్ఘకాలం తీసుకుంటున్నారనీ ఒకవేళ స్వీకరించినా FIR దాఖలు చేయడానికి అనేక సార్లు బాధితులను పోలీస్ స్టేషన్ల చుట్టూ తిప్పుతున్నారనీ ఈ కేసులను చేపట్టిన సందర్భంగా మా అనుభవంలోకి వచ్చింది.
- ఢిల్లీ మరియు ఇతర మెట్రో పాలిటన్ నగరాలైన ముంబయి లాంటి చోట్ల ఈ కేసుల విషయంలో కొన్ని ప్రత్యేక పద్ధతులను పాటిస్తున్నారు. ఢిల్లీలో మహిళలపై జరుగుతున్న నేరాలను చేపట్టడానికి పోలీసులు కొన్ని ప్రత్యేక (cells) సెల్స్ ఏర్పాటు చేశారు. వీటిలో వరకట్న వేధింపులు మరియు ఐపిసి లోని సెక్షన్ 406కు సంబంధించిన కేసులను మాత్రమే చేపడతారు. ఈ కేసుల విషయంలో సెక్షన్ 498(A) క్రింద FIR నమోదు చేయడంకానీ, 406 IPC (స్త్రీ ధనాన్ని తిరిగి ఇచ్చేయడం విషయంలో నమ్మించి మోసం చేయడం) క్రింద కానీ లేదా వరకట్న నిరోధ చట్టం క్రిందకానీ FIR నమోదు చేయకుండా మహిళలపై నేరాలకు సంబంధించిన ఈ సెల్స్‌కు కేసులను మొదటిగా పంపుతున్నారు. ఈ సెల్స్‌లో కేసులను పెండింగ్‌లో పెట్టి మహిళలు రాజీకుదుర్చుకొనే విధంగా బలవంతపెడుతున్నారు. ఈమధ్య కాలంలో స్త్రీ ధనంకానీ వరకట్నం కానీ తిరిగి ఇప్పించడం జరగడంలేదు. అంతేకాక కొంత కాలయాపన జరగడం కారణంగా అత్తింటి వారికి సమయం దొరకడంతో ముఖ్యమైన సాక్ష్యాలను రూపుమాపడమే కాక స్త్రీ ధనం, విలువైన వస్తువులు, ఆభరణాలులాంటి వాటిని దాచివేయడం చేస్తున్నారు. రాజీకుదరని పక్షంలో మాత్రమే కేసును రిజిస్టర్ చేస్తున్నారు. ఈ ప్రక్రియకు తరచుగా చాలా సమయం పడుతుంది.
- ఒకవేళ వారికేసులను నమోదు చేసుకున్నాకాని పోలీసులు సరైన విచారణ జరపడం లేదు. బాధితురాలి వాంగ్మూలాన్ని కాని, ఇతర కుటుంబ సభ్యుల, బంధువుల ఆరోపణలను కానీ, ఇతర సాక్షులు చెప్పే విషయాలను కానీ రికార్డు చేయడం లేదు. ఒకవేళ చేసినా అవి పూర్తిగా అర్థం కాని రీతిలో రికార్డు చేస్తున్నారు. కేసులో ముఖ్యమైన ఇతర సాక్ష్యాలను సేకరించే పనిచేయడం లేదు.

పోలీసులు, కొన్ని సార్లు కోర్టులు కూడా బాధితుల ఫిర్యాదులను ఇంటి సమస్యలుగా మాత్రమే చూస్తున్నారని బాధితులు మరియు వారికుటుంబ సభ్యులు చెబుతున్నారు.

పోలీసులు లంచాలు కానీ ఇతర ప్రభావాలు కానీ వుంటేనే సమస్యలపై స్పందిస్తున్నారనీ, తరచుగా బాధితుల భర్తలే లంచాల ద్వారా పోలీసులను లొంగదీసు కుంటున్నారనీ బాధితులు చెబుతున్నారు.

ఫిర్యాదు చేయడానికి వెళ్ళే మహిళలకు కోర్టులద్వారా న్యాయం జరగదనీ, వారికి మనోవర్తి దొరకడం కూడా జరగదని చెప్పి చాలామంది మహిళలను రాజీపడే విధంగా బలవంత పెట్టడం జరుగుతుందని ఈ సందర్భంగా చెప్పదలచుకున్నాము.

ఈ సవరణలను బలపరుస్తున్నాయి. చట్టాన్ని బలహీనపరచాలనే ఉద్దేశ్యంతో వున్న వారు మరియు వరకట్న వేధింపులు ఒకనేరం కాదనే ఉద్దేశ్యంతో వున్నారు ఈ ప్రతిపాదనలు మాత్రమే అమలు చేస్తే మొత్తం చట్టం నీరుగార్చబడడమే కాక నిరుపయోగమౌతుందని మేము భావిస్తున్నాము.

ఈ కేసుల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలని పోలీసులకు ఎటువంటి ఆదేశాలు వుండటంలేదు. ఎందుకంటే ఒక ఎఫ్ఐఆర్ నమోదు చేయడానికి కానీ కేసును పరిశోధించడానికి కానీ వారు ముందే చాలా కాలయాపన చేస్తున్నారు.

తీవ్రమైన నేరాలను పరిగణించిన విధంగానే 498ఎ సెక్షన్ క్రింద నమోదైన కేసులను కూడా పరిగణించాల్సివుంది. ఈ సెక్షన్ క్రింద వచ్చిన తీర్పులను ఒకసారి పరిశీలిస్తే 498ఎ సెక్షన్ ఆధారంగానే నేరస్తులకు శిక్షలు పడిన సందర్భాలు చాలా అరుదు. చనిపోయిన కేసులలో మాత్రమే 498ఎ సెక్షన్ క్రింద నిందితునిపై క్రూరత్వం మరియు వేధింపుల క్రింద శిక్షలు పడుతున్నాయి. దీనినిబట్టి 498ఎ చట్టంను దుర్వినియోగం చేయడం కాదు ఉపయోగించు కోవలసినంత ఉపయోగించు కోలేక పోతున్నారని అర్థమవుతుంది.

ఏవైనా తప్పుడు కేసులు ఉన్నట్లయితే చట్ట ప్రకారం ఆయా కేసులను పరిశీలించాల్సివుంది. భారతదేశంలోని చాలా చట్టాలు సమాజంలోని కొన్ని తరగతుల వారిచే నిరుపయోగమవుతున్నాయని ఈ సందర్భంగా చెప్పదలచుకున్నాము. అయినా ఏ ఒక్కరూ ఈ చట్టాలలో మార్పులు చేయాలని మాట్లాడడంలేదు.

అందువలన ఈ పిటిషన్ విషయంలో ముందుకు పోరాదని మేము భావిస్తూ మా అభ్యంతరాలను దాఖలు చేస్తున్నాము. ఈ పిటిషన్ పూర్తిగా మహిళలను కించపరిచే విధంగానూ మహిళల స్థాయిని దిగజార్చే అభ్యంతరకరమైన భాషతోను కూడుకొని వుందని మేము చెప్పదలచుకొన్నాము. మరియు బాధిత మహిళలకు హింస నుండి విముక్తి కలిగించాలంటే వరకట్న నిరోధ చట్టాన్ని మరింత బలోపేతం చేయడం సముచితంగా వుంటుంది.

– అనువాదం : కె. నాగలక్ష్మి

# శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ

-వకుళాభరణం లలిత.



ఆంధ్రదేశ చరిత్రలో శ్రీ కంభంపాటి సత్యనారాయణ గారి గూర్చి తెలియని వారుండరు. చరిత్రలో ఎంతో గొప్ప పరిశోధకుడు ఆయన. ఆయన సతీమణి కంభంపాటి మాణిక్యాంబ. ఉన్నత విద్యనభ్యసించగల అవకాశాలు కరువైనా, భర్త సంస్కార భావాలను మనస్ఫూర్తిగా స్వీకరించి, సేవా తత్పరతతో, జాతీయాభిమానంతో శక్తి వంచన లేకుండా పనిచేశారు. స్త్రీ జనాభ్యుదయానికి ఆమె చేసిన కృషి మరువలేనిది, మరుపురానిది.

14-16 సంవత్సరాల మధ్య గల ముగ్గురు అమ్మాయిలు ఏలూరు సబ్ జైలు నుంచి విడుదలై, తాము ఎక్కడికి పోవాలో తోచక కన్యకాపరమేశ్వరి ఆలయం అరుగుల మీద కూర్చుంటే పోలీసులు వచ్చి వాళ్ళను వెళ్ళిపొమ్మన్నారు. కాంగ్రెసు వాలంటీర్లు "తెల్ల గుర్రం కట్టిన బండి వస్తుంది, అందులో ఎక్కి మీ స్థానాలకు చేరుకోండి" అని హెచ్చరించారు. బండి రానే వచ్చింది. ఊరంతా తిప్పినా వాళ్ళ ఇళ్ళు ఎక్కడో తెలియలేదు ఎవరికి. వాళ్ళు నిజంగా కాంగ్రెసు కార్యకర్తలు కారు. ఆ వేషంలో ఉన్న పోలీసులు. ఆ ముగ్గురు అమ్మాయిలు కంభంపాటి మాణిక్యాంబ, ఉద్దరాజు మాణిక్యాంబ, గుజ్జు నాగరత్నమ్మలు, వాళ్ళు ముగ్గురు ఉంగుటూరులో అనాధాశ్రమం నిర్వహిస్తున్న శ్రీతల్లాప్రగడ లక్ష్మీనర సింహ శర్మ, విశ్వసుందరమ్మ గుర్తుకు వచ్చి అక్కడికి వెళ్ళారు.

1917లో జన్మించిన కంభంపాటి మాణిక్యాంబ తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకాలో తొండవరంలో పుట్టింది. అదొక పల్లెటూరు. ఆమె తల్లితండ్రులు పరమనిష్ఠాగరిష్టులు, యజ్ఞం చేసి శ్రీమతి సుభద్రమ్మ, శ్రీ వెంపరాల సుబ్రహ్మణ్యశాస్త్రి కీర్తి ప్రతిష్టలు సంపాదించుకున్నారు.

ఆమెకు చిన్నతనంలోనే కంభంపాటి సత్యనారాయణతో వివాహమైంది. ఆంధ్ర ప్రచారిణీ గ్రంధాలయం, విజ్ఞాన చంద్రికా మండలి వారి ప్రచురణలను చదివేటట్లు ప్రోత్సహించాడు. రాణీ అహల్యాబాయి, ఆంధ్రచరిత్ర అబలా సచ్చరిత్ర రత్నమాల, విజయనగర సామ్రాజ్యం వంటి గ్రంధాలు ఆమె పసి హృదయంలో దేశాభిమానాన్ని, జాతిపట్ల గౌరవాన్ని కలిగించాయి.

సత్యనారాయణ ఎం.ఎ చదువుతూనే గాంధీ మహాత్ముని స్వాతంత్ర్య శంఖా రావాన్ని విని 1930లో స్వాతంత్ర్య సమర రంగంలోకి ఉరకడం, ఆమె ఆవేశపూరి తురాలై, దేశసేవ కోసం కంకణం కట్టుకొంది. పికెటింగ్‌లో పాల్గొన్నారు. పైన చెప్పిన ముగ్గురు అమ్మాయిలు చివరకు అరెస్టు అయ్యారు. ఇంత చిన్నపిల్లల్లో అంత జాతీయాభిమానం కలగటానికి కారణ మేమిటా అని పాలుపోక వీళ్ళను తెల్లగుర్రపు బండి ఎక్కించారు పోలీసులు.

అరెస్టుల అయినంత మాత్రం చేత ఆ ముగ్గురు అమ్మాయిలు ఉద్యమం పట్ల తమ పట్టువీడలేదు. పికెటింగ్‌లు మానలేదు. ఫలితంగా మాణిక్యాంబను మరో 15 రోజులు కొవ్వూరు సబ్ జైల్లో పెట్టారు. సభలు, సమావేశాల్లో పాల్గొనటం, ప్రచారం చేయటం యధావిధిగా కొనసాగించారు.

1932లో జరిగిన రాజకీయ మహాసభలకు హాజరైనారు. కూచిపూడి గ్రామంలో ఒక సభకు అధ్యక్షత వహించి రాజకీయ మహాసభను జరిపించారు. మరల ఆమె 6 నెలల పాటు శిక్షపొంది, ఖైదీ అయ్యారు.

రాయవేలూరు జైలుకు చేరుకున్నారు. అక్కడే ఆమెను సుప్రసిద్ధులైన మిసెస్ కజిన్స్, మిసెస్ ప్రభు, శ్రీమతులు కుట్టిమాలు అమ్మా, తల్లాప్రగడ విశ్వ సుందరమ్మ, ఆదుర్తి లక్ష్మీబాయమ్మగార్లతో కలిసి జైలు జీవితంలో పాలుపంచుకోటం ఆమెకు ఓ గొప్ప అనుభవం, వరం కూడా.

మాణిక్యాంబను అవమాన పర్చాలని ఆమె మాంగల్యాన్ని తొలగించారు పోలీసులు. దానిపై పార్లమెంటులో చర్చకూడా జరిగింది. అయినా దేనికీ మాణిక్యాంబ జంకలేదు, పట్టు వీడలేదు.

భార్యా భర్తలిర్వురూ కాంగ్రెసు కార్యక్రమంలో ఎన్నికల ప్రచారంలో పూర్తిగా మునిగిపొయ్యారు. కాంగ్రెసు ఘన విజయం ఆ దంపతులకు ఎంతో సంతృప్తినిచ్చింది. అప్పుడే ఆమెకు దుర్గాబాయమ్మతో పరిచయం.

ఆ తర్వాత కొంత కాలం సోషలిస్టు పార్టీ, తర్వాత కమ్యూనిస్టు పార్టీలో చేరినా, ఆ దంపతులిద్దరూ నిస్వార్ధంగా ఆయా పార్టీల కోసం, తాము నమ్మిన సిద్ధాంతాల కోసం కృషి చేశారు. శ్రీమతి అచ్చమాంబ ఆధ్వర్యంలో ఏర్పడ్డ ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘంలో చేరి స్త్రీ జనాభ్యుదయానికి కృషి చెయ్యటమే గాక, కేంద్ర శాసనసభలో స్త్రీల హక్కులు, వివాహాలు, విడాకులపై జరిగిన చర్చలను విపులీకరించి చెప్పే బాధ్యతను కూడా మాణిక్యాంబ వహించారు. అయ్యదేవర కాళేశ్వరరావు గారి "బహు భార్యా నిషేధ చట్టాన్ని గూర్చి, మద్రాసు రాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టిన దేవదాసీ విధాన నిర్మూలనా చట్టం గురించి ఆమె మహిళలకు విపులీకరించారు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలో తలెత్తిన ఫాసిస్టు విధానానికి వ్యతిరేకంగా ప్రచారం చేసి, స్త్రీల బాధ్యతను గూర్చి చెప్పారు.

ఏ పదవులను ఆశించక, జీవితంలో నిరాశ చెందక జాతీయాభి మానంతో, సేవాతత్పరతతో పనిచేసిన శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ వంటి త్యాగధనుల సేవలు మనకెప్పటికీ శిరోధార్యాలే.



# కౌమార వయస్సులో ప్రేమలు

-పి.ఎ.దేవి

ఎనిమిది తొమ్మిది తరగతుల్లోనూ ఇంకా కింది తరగతుల్లోనూ కూడా అమ్మాయిలూ అబ్బాయిలు ప్రేమల్లో పడుతున్నారు."ఎంత కలికాలం. ఇదంతా పాశ్చాత్య నాగరికత ప్రభావమే. దీన్ని అరికట్టాలంటే మనం తిరిగి సనాతన ధర్మాన్ని నెలకొల్పుకోవాలి. దైవభక్తి పెంచాలి. నైతిక విలువలు బోధించాలి. మన దేశపు కుటుంబ వ్యవస్థ పవిత్రత గురించి, ఆచారాల గురించి, వర్ణధర్మాల గురించి పిల్లలకు నూరి పోయాలి. వారిని అదుపులో వుంచాలి. సమాజంలో ఎవరిస్థానంలో వారు ఉండాలి''

ఇదీ ఈనాటి ప్రేమ వ్యవహారాలుగా ప్రచారంలోకి వస్తున్న వాటి గురించి ఆందోళన పడిన వారికి వచ్చే ప్రామాణికమయిన జవాబు. విద్యావంతు లయిన ఆధునిక మధ్యతరగతి ఉన్నత తరగతులతోపాటు దిగువ మధ్యతరగతికి కూడా ఆమోద యోగ్యంగా ఉంటున్న జవాబు. కాని వారు హేతుబద్ధంగా తార్కి కంగా ఆలోచించడానికి నిరాకరిస్తున్నారు.

మొదటిది కౌమార వయస్సులో ప్రేమపట్ల తీవ్ర వ్యతిరేకత. కౌమార వయస్సులో బాల బాలికల శరీరంలో అనేక మార్పులు చోటు చేసుకుంటాయి. వారు యవ్వన ప్రారంభదశలో ఉంటారు వారి శరీరంలో బిడ్డల్ని కనడానికి అవసరం అయిన ఎదుగుదల జరుగుతుంది. బిడ్డల్ని కనడం ద్వారా తన జాతిని కొనసాగిం చాలనుకోవటం ఏ ప్రాణికయినా ప్రకృతి ధర్మం. దానికనుగుణంగానే మానవ శరీరం కూడా ఎదుగుతుంది. కాని శరీరం ఎదగగానే సరిపోదు. ఆడ మగల సంయోగం జరగడానికి అవసరం అయిన రకరకాల ఆకర్షణలను కూడా ప్రకృతి యిచ్చింది. ఉదాహరణకు ఆడనెమలిని తనవైపుకు ఆకర్షించడానికి మగనెమలికి అందమయిన పింఛం, కోయిలకు మృదువయిన కంఠం, మగ సింహానికి జూలు, కోడి పుంజుకి ఆకర్షణీయమైన రంగుల ఈకలు వుంటాయి. కొన్ని జాతుల మగ పక్షులయితే ఏకంగా నృత్యం చేయటం, గూటిని పళ్ళతో పూలతో అలంకరించడం, కొన్ని జంతువులయితే రకరకాల సువాసనలు వెదజల్లడం లేదా ప్రత్యేక మయిన అరుపులు అరవటం వంటి అనేకానేక చర్యలు చేస్తాయి.



మొత్తంమ్మీద చూస్తే సంతానాన్నికనే ఆడ జీవితో కలవడం కోసం దానిని ఆకర్షించడానికి మగజీవికి అనేక ఆకర్షణలు హంగులు సమకూర్చింది. బిడ్డల్ని కనగలిగే శక్తి ఆడజీవికే ఉంటుంది. కాబట్టి ఆడజీవులు సాదాసీదాగా ఉంటాయి. మానవ శరీరం కూడా సంతానాన్ని కనడానికి సమాయత్తం అవుతున్నపుడు అది ఆకర్షణీయంగా మారుతుంది "వయస్సు వంద వంకల్ని కొట్టేస్తుంది'' అనే పాత నానుడి. అంటే సంతానాన్ని కనేకాలం లేదా కనగలిగే కాలం మాత్రమే శరీరం ఆకర్షణీయంగా ఉంటుంది. అందుకే పిల్లలు ముద్దుగా వృద్ధులు హుందాగా ఉంటే యవ్వనం మాత్రం అందంగా విరబూస్తుంది

శరీరంలో మాత్రమే మార్పులు జరిగితే సరిపోతుందా? మానసికంగా సిద్ధపడాలి కదా అంటే ఆడమగల మధ్య శారీరక ఆకర్షణకు అవసరం అయిన మానసిక సంచలనం కలగాలి కదా! ఈ పనిని హార్మోనులు చేస్తాయి. హార్మోనులు విడుదల వలన శారీరక మానసిక మార్పులు రెండూ జరుగుతాయి. ఇది కౌమార దశ.. అంటే రాబోయే కాలంలో సంతానం కనడానికి ప్రాతిపదిక ప్రారంభం అయ్యింది. ఈ సహజ ప్రక్రియ వల్లనే అమ్మాయిలు అబ్బాయిలు తమ అందం గురించీ శరీరం గురించీ బాగా ఆలోచించడం, ఆందోళన పడటం, శ్రద్ధతీసుకోవటం, కులుకులు వయ్యారాలు పోవటం ఎదుటి వారిని ఆకర్షించడానికి ప్రయత్నించడం వంటివి చేస్తుంటారు.

"ఈ లైంగిక ప్రేరణ నైతికమూ కాదు అనైతికమూ కాదు. అది ఆకలి దాహం లాగే ఒక సహజ శరీరధర్మం. ప్రకృతికి నైతికత ఏమాత్రం తెలియదు" లైపిక్. ఇది ప్రకృతి ధర్మం కాబట్టి మనిషి చాలకాలం జంతువుల్లాగే వావి వరుసలు లేకుండా కోరికలు తీర్చుకుని సంతానోత్పత్తి చేసాడు. కాని మానవ సమాజం కాలక్రమంలో అనేక నియమనిబంధనలు ఏర్పాటు చేసుకుంది. ఒక మానవ సమూహంలో ఆరోగ్యకరమైన సంతానం జన్మించడానికి, ఘర్షణలు నివారించడానికి, ఆరోగ్యకరం అయిన లైంగిక సంబంధాల ద్వారా సహజసిద్ధమయిన కోరికలు తీర్చుకునే విధంగా లైంగిక సంబంధాలతో 'జంట' పద్ధతి వచ్చింది. జంట కట్టడానికి పరస్పర ఆకర్షణ మాత్రమే పునాదిగా వున్నంత కాలం అగి ఆహ్లాదకరంగా అభివృద్ధికారకంగా వుంది. కాని వ్యక్తిగత ఆస్తి సంతానం, వారసత్వం పై ఆధిపత్యం సంపాదించడంతోనూ దానికి మతపరమయిన పవిత్రత ఆపాదించి క్రతువుగా అనుమతించడంతో స్త్రీ పురుష సంబంధాలలో అణచివేత మొదలయ్యింది. అది స్త్రీలపై లైంగిక దోపిడీగా తయారవడం,

వారి శరీరాన్ని లైంగికతను సంతానేచ్ఛను నియంత్రించేదిగా మారడం వారి స్వేచ్ఛను అరికట్టడం జరిగింది.

సహజ ఆకర్షణల వలన ఏర్పడాల్సిన 'జంట'లు వ్యాపారంగా మారడం వలన మొత్తం సమాజంలోని వివిధ దశల్లో స్త్రీ పురుష ఆకర్షణలు, సంబంధాలు అనేక రకాలయిన అసహజత్వాలకు, వికారాలకు వక్రీకరణకు లోనయ్యి ''పాపం'' గా జుగుప్సగా వికృతంగా తయారయ్యాయి. కనుకనే కౌమార వయస్సులోని వారి ఈ సహజ వ్యామోహం ఆందోళన కలిగించేదిగా.. అణిచి వేయాల్సిందిగా కనబడుతున్నది. "మరేం చేయాలి? వారిని విచ్చలవిడిగా వదిలేయాలా?" అని నిగ్గదీస్తారు నైతిక బాష్యకారులు.

అక్కరలేదు.. చదువులో నిమగ్నం అయినా ఆటల్లో శక్తిని ఖర్చు చేసినా ఇతర కళల్లో సృజనాత్మకత చూపే అవకాశాలున్నా, వీటన్నింటి కంటే ముఖ్యంగా కామాన్ని రెచ్చగొట్టే బూతు సినిమాలు (సినిమాలన్ని బూతుగానే తయారయ్యాయనేది అట్లాఉంచితే) నీలి చిత్రాలు సంభోగం ముందు జరిగే ఫోర్‌ప్లే మల్లే రూపొందించే డాన్సులు, బూతు సాహిత్యం, రోజు వారీ జీవితంలో ప్రత్యక్షంగా చూసే లైంగిక దృశ్యాలు వారికి దూరంగా ఉంచగలిగితే కౌమార వయస్సు వారు రెచ్చిపోయే అవకాశం లేదు.

మన రాష్ట్రంలో ఒక అంచనా ప్రకారం దాదాపు 60శాతం మంది పిల్లలు 14 సంవత్సరాల లోపే లైంగిక అనుభవాలు పొందుతున్నారు. ఇందులో అధికభాగం కుటుంబాలలో బంధువులలో ఇరుగు పొరుగు వారిలో ఎవరో ఒకరు వారిని లైంగికంగా ఉపయోగించుకోవటం వల్ల జరుగుతున్నాయి. మిగిలినవి కుతూహలం తోనో, బలమయిన వ్యామోహంతోనో లేదా నీలి చిత్రాలు చూసిన తాత్కాలిక ఉద్రేకంతోనో జరుగుతున్నాయి. వీటిని అరికట్టకుండా పిల్లలకు నీతులు బోధించడం వలన ఉపయోగం ఏమిటి?

ఇళ్లు పెద్దసమస్య. ఒక గదిలో బతికే వారు 55శాతం పైగా ఉన్న దేశంలో పెద్దవాళ్ల సాన్నిహిత్యం లైంగిక చర్యలు పిల్లల కంట బడటం అనివార్యం. ఇది కూడా తెలిసీ తెలియని వయస్సులో ఉద్రేకం కలిగిస్తుంది. పైగా వివాహేతర సంబంధాలు, వ్యభిచారం విపరీతంగా పెరుగుతున్నాయి. అదేం తప్పు కాదనే వాదన ఆచరణలో కనబడుతున్నది. కారణాలు ఏమయినా పెద్దలు ఇట్లావుంటే పిల్లలు మాత్రం బుద్ధిగా వుండాలని ఆవేశ పడితే అది సాధ్యమా?

ప్రేమ తప్పుకాదని చెప్పడం కాదు అసలు ప్రేమ తప్పుజీవితం లేదు. ఆప్రేమ పసితనంలోనూ గర్భంలోనూ పూర్వజన్మ లోనూ ఏర్పడే ఒక గొప్ప విషయంగా పరమ అబద్ధాల్ని మోసాల్ని సినిమాలుగా బిడ్డలపై రుద్ది వారిని మాత్రం ప్రేమకు దూరంగా వుండమంటే అది ఏరకమైన వాస్తవదృష్టి?

పిల్లలకు పెద్దలప్రవర్తనే అనుకరణ, పెద్దలు జారత్వంలో, మద్యంలో, అబద్ధంలో బతుకుతూ బిడ్డలకు నీతులు బోధిస్తే వారు స్వీకరిస్తారా?

పేదలకు బతకడం కోసం కూలికి పోవటంతో బిడ్డల్ని ప్రేమించే సమయం లేదు. ఆ జ్ఞానం కూడా తక్కువే . వారికి చేతనైనంత ముద్దు చేసినా బిడ్డల అవసరాలు పట్టించుకునే తెలివి ఆ పరిస్థితి లేదు. పెద్దలకు డబ్బు సంపాదనలో విలాసాల్లో తీరిక లేదు. వారి పిల్లలకు రెసిడెన్షియల్స్ ఉన్నాయి. ప్రేమా ఆప్యాయతలంటే వారు కోరిందల్లా కొనివ్వడమే. మరి మధ్య తరగతి వారికి తెల్సుకొనే జ్ఞానం ఉంది. ఆందోళన వుంది. కాని పైకి ఎగబాకటం మాత్రమే లక్ష్యంగా మారి వీరికి బిడ్డలంటే ఎగబాక టానికి జరిగే పోటీలో నిచ్చెనలే తప్ప వారి కోరికలు పరిగణనలోకి రావు..... ఇంతటి ప్రేమ రాహిత్యం మధ్యన మగ్గే కౌమార వయస్కులు ప్రేమకి తపించిపోవటం వ్యామోహంలో విచక్షణ కోల్పోవటంలో ఆశ్చర్యం ఏమున్నావుందా?

కాబట్టి ముందు ఈ సామాజిక సంబంధాలు మెరుగుపడాలి. పిల్లలకు అందరికీ చదువు, ఆటపాటలు, కళలు నేర్చుకునే పూర్తి అవకాశాలుండాలి. రెచ్చగొట్టే వాతావరణాన్ని నియంత్రించాలి. వీటితోపాటే ఈ శారీరక మానసిక ప్రేరణలు సహజం అని అంగీకరించాలి. వాటిని తగిన వ్యక్తి దొరికేదాకా అదుపులో వుంచుకోవటం ఎట్లా అనేది నేర్పించాలి. వీటిని రహస్యంగా లజ్జాకరమయినవిగా పట్టించుకోకూడనివిగా కాకుండా ఎదుగుదలకు సంబంధించిన జ్ఞానం ఇవ్వాలి.

బిడ్డలపై భక్తి, మూఢత్వాలు రుద్దకుండా "పాపం" అని భయపెట్టకుండా తార్కికంగా హేతుబద్ధంగా ఆలోచించడం నేర్పించాలి. భయం వల్లా అణిచివేత వలనా



కాకుండా పిల్లలు సామాజిక నియమాల అవసరం అర్థం చేసుకుని అనుసరించాలి. అది స్వచ్ఛందంగా జరగకపోతే మళ్ళీ పైకి కనబడేది ఒకటి చేసేది ఒకటిగా వుండే కపటం అలవర్చుకుంటారు.

సహజత్వాన్ని సహజంగానే పరిగణిం చడం ద్వారా మాత్రమే వికృత పెడ వ్యామోహాల్ని, హింసనూ అరికట్టడం సాధ్యం అవుతుంది.



# ఒక వసుంధర

- పి. సత్యవతి

నిద్ర లేస్తూనే వీధి గుమ్మానికి వేలాడ దీసిన ప్లాస్టిక్ కవరులో పాల పాకెట్ల కోసం చూసి, అవి లేకపోవటంతో, ముందు జాగ్రత్తగా ఫ్రిజ్‌లో దాచిన నిన్నటి ప్యాకెట్ కాగడానికి పెట్టి బ్రష్ చేసుకోవడానికి వెళ్ళింది లలిత.

కాలింగ్ బెల్ మోగింది. విసుక్కుంటూ తలుపు తీస్తున్నాడు రమేష్. అవతల చిన్నపిల్ల గొంతు.....

"మరేవో మా తాత రేతిరి సచ్చిపోనాడండి. ఇంగ పదిరోజుల దాకా పాలు తేడం కుదర్దని మాయమ్మ సెప్పిరమ్మంది".

"సర్లేపో"

అదేమిటీ! రాత్రి బాగానే వున్నాడు. అప్పుడే ఎట్లా పోయాడు? అయినా చావు వార్తని కూడా ఇంత తేలిగ్గా తీసుకుంటాడేమిటి రమేష్?

'అయ్యో పాపం'అని కూడా అనకుండా.

ఈ మధ్య రమేష్‌కి విసుగెక్కువైంది.

'రంగయ్య పోయాట్ట. పది రోజుల దాకా పాలు రావుట. ఇంకెవరన్నా గుండెజబ్బున్న ముసలాడుంటే చూసి పాలు తెప్పిచ్చుకో. అన్నట్లు నీ 'పని వృద్ధురాలు" కూడా రాలేదల్లే వుంది. అది కూడా పోయిందేమో కనుక్కో" అని విసురుగా బ్రష్ చేసుకోవడానికి వెళ్ళాడు.

ఆయాసపడుతూ, కర్రపోటు వేసుకుంటూ మనవరాల్ని వెంటబెట్టుకుని నిన్న సాయంత్రం పాల డబ్బులకి వచ్చాడు. అతనికి గుండె జబ్బు వుండే వుంటుంది. సంపాదించకపోతే తిండి లేదు. ఎవరూ అతనికేం పని చెప్పకపోతే బ్రతికే దారి మూసేసినట్లే. పక్క అపార్ట్‌మెంట్స్‌లో పదిహేను కుటుంబాలకి, చుట్టపక్కల నాలుగైదు ఇళ్ళకి పాలు తెస్తాడు. వీళ్ళంతా ముసలివాడిచేత పని చేయించుకోవడం ఏమిటని అనుకుంటే అతనికొచ్చే ఆ నాలుగయిదు వందలూ రావు. ముసలివాడని కూడా చూడకుండా మెట్లెక్కి వెళ్ళమంటాడు ఆపార్ట్‌మెంట్స్ వాచ్‌మెన్. యాంజియో గ్రామ్‌లకి, బైపాస్‌లకే కాదు కనీసం ఈసీజీ కూడా తీయించుకోలేనివాడు. ఆత్మహత్య మహాపాపం అని నమ్మినవాడు. బ్రతికినన్నాళ్ళు ఎట్లాగో సంపాదించాలని, ఎవరిమీదా ఆధారపడకూడదని అనుకున్నవాడు. సంపాదించిన నాలుగు వందలూ కూతురు చేతిలో పెట్టి ఆ పిల్ల పెట్టింది తింటాడు. అల్లుడు మంచివాడే పాపం. 'నీ అన్న వొదిలేసిపోతే నువ్వెందుకు చూడాలి?' అని నిగ్గదియ్యడు. రంగయ్య పోవడం రంగయ్యకి మంచిదే, కూతురుకీ మంచిదేనేమో. ఈ కాస్త ఓపికా పోయి మంచం ఎక్కి ఈ నాలుగువందలూ లేకపోతే ఆ కూతురు అతనికి అన్నం పెట్టగలదా?

రాములమ్మ రాలేదు. ఆమె కథా యింతే. తను పని మాన్పించితే ఆమెనెవరూ పెట్టుకోరు. ముసల్ది కదా అని గట్టిగా పని చెప్పలేదు. తన ఇంట్లో పని చేస్తే కాస్త కాఫీ, టిఫినూ, ఒకపూటకి సరిపడా తిండి దొరుకుతాయి. సాయంత్రం ఆమె కోడలు తిట్టుకుంటూ ఇంత ముద్ద పడేస్తుంది. కోడల్దేం తప్పు. కొడుకు సంపాయించిందంతా ఇంటికి ఇవ్వడు అదీ కష్టపడుతుంది. దాని బాధ దానిది.

"లోకం బాధలన్నీ నీవే" అని రమేష్ విసుక్కుంటాడు. ఈ విసుగులో తన పట్ల కాస్త గౌరవం వుందనుకుంటుంది లలిత.

"ఎవరన్నా కుదిరేదాకా పాలు తెస్తాలే లలితా. ఇప్పుడు తెమ్మంటావా"? అన్నాడు రామారావు వంటగదిలోకొచ్చి.

"కాఫీ త్రాగి వెళుదురులెండి. తొందరలేదు". అంది లలిత.

వంటింటి గుమ్మంలో అడుగు పెట్టడం పాపపంకిలంలో అడుగుపెట్టడంలాగా ఫీలయిపోయే మామగారు తనంతతాను ఇట్లా పాలుతెస్తానని ముందుకురావడం ఒక వింతే. 'స్థానబలిమి లాగా భార్య బలిమి' కూడా ఉంటుంది మగవాళ్ళకి, 'తక్కువేమి మనకు భార్య ఇక్కడుండువరకూ ' అని మీసాలు మెలేస్తారు. ఆవిడ లేకపోతే కాస్త భూమి కనిపిస్తుందనుకుంటా. నిన్న సాయంత్రం తను ఇంటికొచ్చేసరికి వరండాలో చాపలు వేసి కూడా వుంచాడు.

ఇంతలో వచ్చింది రాములమ్మ.

ఏమిటో వసుంధర వెళ్ళిపోయిం దగ్గర్నుంచీ దిగులు. ఎంత దాచుకుందా మన్నా కుదరడం లేదు. ఆ దిగుల్ని చిరాకుగా, విసుగ్గా మార్చేసుకున్నాడు రమేష్. రామారావు బింకంగా వున్నాడు. తనకసలేం అర్థం కావడంలేదు.

ఆవిడ బ్రతికి వుందా? చని పోయిందా? చనిపోవాల్సినంత కష్టం ఏం కలిగింది? ఇక్కడున్న ఆరు నెలలూ తను ఆవిడకేం ఇబ్బంది కలిగించదు. అమ్మలాగే ఆవిడ కూడా అడక్కుండానే తనకి అన్నీ అమరుస్తుంది. సాయంత్రం స్కూల్ నుంచి వచ్చేసరికి, అల్లం వేసిన ఘుమఘుమలాడే వేడివేడి టీ కప్పుతో పలకరించడంలో ఆవిడ కళ్ళల్లో ప్రేమే కనపడుతుంది గానీ "విధి లేక చేయడం" కనిపించదు.

"ఆవిడ పోయిందేమో' అని తనకి అనిపిస్తుందిగానీ రమేష్ మాత్రం అట్లా జరిగి ఉండదంటాడు.

అవును చనిపోయే మనిషికి యాభై ఏళ్లనాటి ఎస్సెల్సీ రిజిష్టరూ, రోజూ ఆమె పూజ చేసే అమ్మవారి పటం, పూజ పుస్తకాలూ, రెండు మంచి జరీ చీరెలే ఎందుకూ? బ్రతికి ఉండడానికి అవి మాత్రం సరిపోతాయా?

ఈ వయస్సులో ఏం ఉద్యోగం దొరుకుతుంది?

ఈ మిస్టరీ ఛేదించగలది ఒక్క 'ముత్యమే'.

ఆమె వెళ్లిన రెండవరోజు పోలీస్ రిపోర్ట్ ఇద్దామంటే వద్దంటే వద్దంది. పదిరోజులు చూడమంది. వసుంధర అట్లాంటి పని చెయ్యదని తన అంతరాత్మ చెబుతోందంది. ఆవిడేదో దాస్తోందని, వసుంధర ఎక్కడికెళ్ళిందో ఆవిడకి ఖచ్చితంగా తెలుసుననీ అనిపించింది లలితకి.

ఇవ్వాల్టికి పదిరోజులూ అయి పోయాయి. సాయంత్రం వెళ్లి అసలు సంగతి తేల్చుకురావాలి. ఆ మధ్య ఇట్లాగే ముత్యం తనకి తోడు రావాలని మావగార్ని ఒప్పించి పదిరోజులు ఎక్కడికో తీసుకెళ్లింది వసుంధరని. వచ్చాక ఆయన ఆవిణ్ణి తిట్టిన తిట్లకి తనకి చాలా కోపం వచ్చింది.

ఆవిడుంటే తనకెంతో సహాయంగా వుండేది.

ఎనిమిదింటికల్లా పిల్లలకి లంచ్ బాక్సులు, తొమ్మిదింటికి తనూ రమేష్ వెళ్ళిపోవడం, సాయంత్రం వచ్చేసరికి వరండా నిండా ట్యూషన్ పిల్లలు.

ఆవిడ ఇల్లు విడిచివెళ్ళిన మూడో రోజున అనుకుంటా రమేష్ అన్నాడు. "నేనిట్లా ఆరునెలల చొప్పున వాటాలేసి తప్పు చేశాను లలితా. అమ్మ తిరిగొచ్చాక ఇంక వాళ్లని పంపను. కేరింగ్ అండ్ షేరింగ్ అంటే అమ్మా నాన్నల్ని పంచుకోవడం కాదు. ఏదో ఆయన మీద కోపం వచ్చి అట్లా చేశానుగానీ, అమ్మేం చేసింది పాపం. నేను చాలా తప్పు చేశాను".

"అవును రమేష్. వాళ్ళని అక్కడింకా రెండు నెలలు ఉంచుకోమని కల్పనకి ఉత్తరం రాసి నేనూ తప్పు చేశాను" అంది లలిత.

ఇద్దరికీ కన్నీళ్ళొచ్చాయి.

❧ ❧ ❧ ❧

రమేష్, లలితా ఇప్పుడున్న ఇంట్లో పదేళ్లుగా వుంటున్నారు. మూడు గదులు, వరండా, చిమ్మి ముగ్గు పెట్టడానికి కాస్త వాకిలీ, బట్టలారేసుకోవడానికి కాస్త పెరడూ వాళ్లిద్దరికీ, ఇద్దరు పిల్లలకీ సరిపోతూనే వుంది. పిల్లలిద్దరూ ఇప్పుడు 'ఇంటర్ లోకి వచ్చారు. ఇంటర్ అంటే మహా గొప్ప చదువు కదా! దాని తరువాత ఎంసెట్. అదింకా జీవితాన్ని నిర్ణయించే పరీక్ష. అందుకని ఒక గది పూర్తిగా పిల్లలకి కేటాయించింది లలిత.

రామారావు రెండేళ్ల క్రిందట రిటైరయ్యే వరకూ వాళ్ళిద్దరూ వైజాగ్‌లో వుండేవాళ్లు. అతను చేసిన ఉద్యోగానికి పెన్షనంటూ ఏమీ లేదు. ఉద్యోగం చేసే రోజుల్లో ఏమీ దాచుకోలేదు. అతనికి కాస్త స్వంత ఖర్చు ఎక్కువే. పిల్లల చదువులు, ఆడపిల్ల పెళ్ళి కోసం కాస్త అప్పు కూడా చేశాడు. రిటైరైనాక వచ్చిన బెనిఫిట్స్‌తో అప్పులు తీర్చగా మూడు లక్షలు మిగిలాయి.

అదే సమయంలో లలితావాళ్ళు అద్దెకుంటున్న ఇంటి ప్రక్కనుండే ఇల్లు పడగొట్టి అపార్ట్‌మెంట్స్ వేస్తున్నారు. ముందుగా రెండు లక్షలు కడితే తక్కింది తనే బ్యాంకులో లోన్ ఇప్పిస్తానని బిల్డర్ చెప్పాడు. తనకో రెండు లక్షలిస్తే అపార్ట్‌మెంట్ బుక్ చేసుకుంటానని అడిగాడు రమేష్ తండ్రిని. ఆయన భార్యని తప్ప తక్కిన చాలామందిని సలహా అడిగాడు. అడిగినవాళ్లల్లో సగానికి పైగా అట్లా ఇవ్వవద్దని, ఇస్తే ఇబ్బంది పడతావని చెప్పారు. ఎక్కువ వడ్డీ ఇచ్చే బ్యాంకులో పెట్టుకుంటే నెలకింత అని వస్తుందనీ, అది పెన్షన్‌లా వుంటుందని చెప్పారు. "రమేష్ కివ్వండి' అని అడుగకపోయినా సలహా ఇచ్చింది వసుంధర.

'నీ బోడి సలహాకి సంతోషించాలే' అన్నాడు రామారావు.

ఒక లక్ష మాత్రం గవర్నమెంటు బ్యాంకులో దాచి తక్కిన రెండూ వేరే బ్యాంకులో పెట్టాడు. కొన్ని సామాన్లు అమ్మేసి, కొన్ని కొడుకులిద్దరికీ సర్దేసి, రమేష్ దగ్గర కొచ్చేశాడు. పిల్లలకి చదువులు చెప్పించి పెద్ద చేయటం ఎలాగో, రిటైరైనాక తనని చూడటం వాళ్ళ బాధ్యత అని ఆయన ఉద్దేశ్యం.

తండ్రి తను అడిగిన డబ్బివ్వలేదని రమేష్‌కి కోపం వచ్చింది.

"పిల్లల చదువులయ్యే వరకూ మనకి అపార్ట్‌మెంటూ వద్దు, ఏం వద్దు. కార్పొరేట్ కాలేజీ ఫీజులు, ఆపైన ఓపెన్ సీటు రాకపోతే పేమెంటు సీటు చాలా అవుతుంది. లోన్లు తీసుకుని కట్టడం కష్టం" అంది లలిత.

"రోగీ, వైద్యుడూ కూడా పాలే కోరార్లే. ఆయన తన డబ్బు బ్యాంకులో ఫిక్సడ్ వేసేశాడు" అన్నాడు రమేష్.

వాళ్ళని తనొక్కడే ఎందుకు భరించాలి. తమ్ముడు మాత్రం చూడొద్దా. అసలు తనకంటే వాడిదే పెద్ద ఉద్యోగం. జీతమూ ఎక్కువే అనేసి అతన్ని పిలిపించి వంతులు వేశాడు. చెరి ఆర్నెల్లు భరించేలాగా.

మొదట్లో ప్రైవేటు బ్యాంకు ఠంచనుగా వడ్డీ ఇచ్చింది. ఆ వడ్డీ అయినా దాచుకోమని వసుంధర చెబితే రామారావు విన్లేదు. ఎవరింట్లో ఉంటే వాళ్లకోసం ఖర్చు పెట్టేవాడు. సంవత్సరం దాటేసరికి బ్యాంకు వడ్డీ ఆపేసింది. మరో రెండు నెల్లకి మూతపడిపోయింది. రెండు లక్షలు ఎటుపోయాయోగాని బి.పి మాత్రం పెరిగింది.

మామగారి డబ్బు పోగానే సురేష్ భార్య కల్పనకి అత్తగారి వంట నచ్చడం మానేసింది. ఆవిడకి శుభ్రం లేదనిపించింది. పని అసలు చేతగాదనిపించింది. తన తల్లిలా రకరకాల వంటలు రావనిపించింది. తనంత శుభ్రంగా వుండదనిపించింది. ఎప్పుడెప్పుడు ఆరు నెలలు అవుతాయా, ఎప్పుడు వీళ్ల నుంచి విముక్తా అనిపించింది.

రామారావుకిప్పుడొచ్చేది నెలకి ఏడువందల యాభై. అందులో తనకీ భార్యకీ మందులు కొనుక్కోవాలి. కనపడకుండా చాలా ఖర్చులుంటాయి. వాటన్నింటికి పిల్లల్ని అడగడం అతనికి నామోషీగా వుంది. అవమానంగా వుంది. ఈ నామోషీని, అవమానాన్ని భార్య మీద తప్ప ఎవరి మీద చూపించగలడు. ఆ బ్లాటింగ్ పేపర్ అన్నీ పీల్చుకుంటుంది. ఈసారి వాళ్ళు రాబోయే ముందు లలిత కల్పనకి ఉత్తరం రాసింది. "వాళ్లనక్కడే ఇంకో రెండునెలలుంచుకో మా పిల్లల పరీక్షలయ్యేదాకా. తరువాత నేను వాళ్లని రెండు నెలలెక్కువ ఉంచుకుంటాను అని.

❧ ❧ ❧ ❧

ఈ ఉత్తరం చూడగానే కల్పన వాళ్లకి ట్రెయిన్ టికెట్స్ రిజర్వ్ చేయించి పంపించేసింది.

అయినా లలితేం విసుక్కోలేదు. పిల్లల గది వాళ్ళకిచ్చి పిల్లల్ని స్నేహితుల ఇంట్లో చదువుకోవడానికి ఏర్పాటు చేసింది. తమ కోసం కొడుకు కాస్త పెద్ద ఇల్లు తీసుకోలేదని కినుకగా ఉండేది రామారావుకి. ఇంటద్దెలు, తక్కిన ఖర్చులు అన్నీ పెరిగిపోయిన ఈ రోజుల్లో ఆరు నెలల కోసం పెద్ద ఇల్లు తీసుకోవడం అనవసరం అంది లలిత. సాయంత్రం వరండాలో కూర్చొడానికి వీల్లేకుండా ట్యూషన్ పిల్లలుండడం రామారావుకి చిరాకు. అందుకోసం రెండు బజార్లు నడిచివస్తాడు.

❧ ❧ ❧ ❧

పెరట్లో చీరలు ఆరేసుకుంటున్న వసుంధరని పక్క అపార్ట్‌మెంటు బాల్కనీలో నుంచి ఎవరో పేరు పెట్టి పిలిచారు. తల ఎత్తి చూస్తే తనతోపాటు కొలకలూరు హైస్కూల్లో ఎసెసెల్సీ వరకూ చదివిన సుజాత. ఆమెని చూసి పాతికేళ్ళ పైన అయింది.

"మధ్యాహ్నం మా ఇంటికి రా" అని అరిచింది.

ఆ సంగతి లలితతో చెప్పింది వసుంధర.

ఎప్పుడూ మడత నలగని ఇస్త్రీ చీరెలు కట్టి ముఖం తళతళా తోమి పౌడరువేసి కత్తిరించిన జుత్తుకి చీర రంగు హెయిర్

బాండ్ వేసి భర్తతో సాయంత్రం బయటికి బయల్దేరే ఆమెకి 'కడిగిన ముత్యం' అనీ, పచ్చగా బొద్దుగా, బట్టతలతో ఉండే ఆయనకి 'గజనిమ్మ పండు' అని తను పేరు పెట్టానని చెప్పింది లలిత. అప్పట్నించీ సుజాతని ముత్యం అనడం అలవాటైందంది సుజాత. భర్త ఏదో మంచి ఉద్యోగమే చేసి బాగా పెన్షన్ తెచ్చుకుంటున్నాడనీ, పిల్లలు విదేశాల్లో స్థిరపడ్డారనీ వీళ్లకి మాత్రం అక్కడికి వెళ్ళడం నచ్చక అపార్ట్‌మెంట్ కొనుక్కుని ఉండిపోయారనీ చెప్పింది లలిత.

"అట్లాంటి వాళ్లకే బ్రతికే అర్హత వుంది రిటైరైనాక " అన్నాడు రామారావు.

"మనదేశంలో అట్లాంటి వాళ్లెంతమంది మావయ్యగారూ! రంగయ్యలాంటి వాళ్ళు బ్రతకడంలేదా! "కౌంట్ యువర్ బ్లెస్సింగ్స్ అనే సామెత మనం మర్చిపోకూడదు" అంది లలిత.

"అవునమ్మా చెరొక ఆర్నెల్లు అటూ ఇటూ తరిమినా ఇంట్లో వుంచుకుని ఇంత తిండి పెట్టే కొడుకులుండడం మాత్రం బ్లెస్సింగే కదా" అనేసి అక్కడినుంచి వెళ్లిపోయాడు రామారావు. ఆయనన్న మాటలకి బాధపడ్డానికి, ఆయనకి జవాబివ్వటానికి లలిత దగ్గర సమయమూ, ఓపికా లేవు. వసుంధర కూడా ఆయనతో మాటలు పొడిగించదు. ప్రశ్నలకి జవాబులే గాని, వ్యాఖ్యలకి జవాబులేం వుంటాయి. డబ్బు పోగొట్టుకున్న బాధ, ఇతరుల మీద ఆధారపడ్డానన్న బాధ-అతన్నిట్లా మాట్లాడిస్తాయనుకున్నది లలిత.

❧ ❧ ❧ ❧

ఒక ఆదివారం లలిత ఇంట్లో వున్నపుడు రామారావు, వసుంధరా గట్టిగా వాదించుకున్నారు. ఆ సాయంత్రం నడవడానికి వెళ్లిన ఆయన తిరిగిరాలేదు. రాత్రంతా మేలుకుని ఎదురు చూసింది ఆవిడ. ప్రొద్దున్న పేపర్లో లలిత చదివి వినిపించిన వార్త మరీ మరీ గుర్తొచ్చింది. విజయవాడలో వృద్ధ దంపతులు ఆత్మహత్య చేసుకుందామని వంతెన మీదకు వెళ్ళారుట. ఆవిణ్ణి నదిలోకి తోసేసి, ఆయన దూకబోతుండగా పోలీస్ కానిస్టేబుల్ వన్తా ఆయన్ని రక్షించి పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళాడట. హత్యానేరం క్రింద జైల్లో పెట్టారు. కుమిలి కుమిలి ఏడుస్తున్న ఆ వృద్ధుడికి జాలిగుండెల పోరులు ఎవరో బెయిలు ఇప్పించారు.

'పోలీసు తప్పు చేశాడు. ఆయన్ని చావనిస్తే పోయేది. ఇప్పుడు చూడు భార్యని చంపానని పశ్చాత్తాపం, పిల్లల చేత తిట్లు" అంది వసుంధర.

"బెయిలిచ్చాక మళ్ళీ ఎవరూ చూడకుండా వెళ్లి దూకి చస్తాళ్లే బాధపడకు" అన్నాడు రామారావు.

అది గుర్తొచ్చిన వసుంధర ఉలిక్కిపడింది. ఇటీవల ఎక్కువగా సంభవిస్తున్న వృద్ధుల ఆత్మహత్యల వార్తలన్నీ ఒక్కొక్కటీ గుర్తుకొచ్చి ఆందోళన పడింది.

ఆవిడతోపాటు తనూ రమేష్ పిల్లలు కూడా రాత్రంతా మేలుకుని కూర్చున్నారు. వసుంధర అన్నం తినకుండా గుమ్మంలోనే కూర్చుంది. ఊరి బయట వృద్ధాశ్రమంలో



ఉన్న స్నేహితుడి దగ్గర రాత్రి వుండి తెల్లవారి వచ్చాడు రామారావు.

"ఓల్డేజి హోం చాలా బావుంది. కానీ నెలకి మనిషికి రెండువేలు కట్టాలట. కొంత డిపాజిట్ కూడా. బాగా డబ్బు సంపాదించినవాళ్ళూ, మంచి పెన్షన్లున్నవాళ్ళూ, ఎన్నారైల తల్లితండ్రులూ, ఇట్టాంటి వాళ్ళకే అన్ని సౌకర్యాలూ" అని నిట్టూర్చాడు.

"అట్లా చెప్పకుండా వెళ్లితే మేం ఎంత కంగారుపడ్డాం. అమ్మ అయితే అన్నం కూడా తిన్లేదు" అన్నాడు రమేష్. "ఏం చచ్చిపోయాననుకున్నారా?" అన్నాడు రామారావు.

❧ ❧ ❧ ❧

" మీ కోసం భోజనం టేబుల్ మీద పెట్టాను. నేను స్కూల్‌కి వెళుతున్నాను". అంది లలిత.

"సాయంత్రం ముత్యం ఇంటికి వెళ్లి ఖచ్చితంగా అడిగిరా. రేపు పోలీస్‌రిపోర్ట్ ఇద్దాం" అన్నాడు.

"తప్పకుండా వెళతాను" అంది లలిత.

అత్తగారి పొడ గిట్టని కల్పన కూడా రెండు రోజుల కొకసారి స్కూల్‌కి ఫోన్ చేసి చాలా శ్రద్ధగా అడుగుతోంది. "అత్తయ్యగారి గురించి ఏమైనా తెలిసిందా?" అని.

పాపం రామారావు. ఆవిడుండగా, ఆవిడని ఒక ఆట ఆడించేవాడేగానీ, మనిషి డీలా పడిపోయాడు. సేవకురాలే గాదు. తోడూనీడా కూడా కదా. ఎప్పుడూ తన నీడగానే భావించాడుగానీ 'తోడు'గా గుర్తించలేదు. ఇప్పుడు ఆ విషయం స్ఫురిస్తున్నట్లుంది.

❧ ❧ ❧ ❧

"నాకు టీ తాగాలనిపించింది. నీక్కూడా కలిపాను. ఎలా వుందో చూడు. బావుంటే తాగు. లేకపోతే మళ్ళీ కలుపుకో" స్కూల్ నుంచి రాగానే టీకప్పు అందించాడు రామారావు. నిజానికి ఆ టీ బాగాలేదు. కానీ ఎందుకో ఆయన్ని చూసి జాలేసి మందులాగా మింగేసింది. వసుంధర వెళ్ళిన దగ్గర్నుంచీ తను సాయంత్రం టీ తాగడం మానేసింది. తాగబుద్ధి కావడంలేదు.

"ట్యూషన్ పిల్లల దగ్గర నేను కాసేపు కూర్చుంటాను. వెళ్ళొస్తావా ముత్యం ఇంటికి" అన్నాడు.

లలిత బయలుదేరబోతుంటే "అన్నట్లు మర్చిపోయానమ్మా. నీ కెక్కడ్నించో ఉత్తరం వచ్చింది. అమెరికా నుంచనుకుంటా" అని ఒక కవరు ఇచ్చాడు. అమెరికా నుంచే. తన ఎడ్రస్‌కే. 'అమెరికాలో నాకెవరూ లేరే" అనుకుంటూ కవరు విప్పింది.

ప్రియమైన లలితకి,

మీకెవరికీ ఒక్కమాట కూడా చెప్పకుండా, మిమ్మల్ని ఇంత ఆందోళన పెట్టి వెళ్ళినందుకు ఏమీ అనుకోకండి. నేనెందుకు వెళ్ళానో, ఎక్కడికి వెళ్ళానో చెబితే నువ్వు అర్థం చేసుకుంటావని నీకు వ్రాస్తున్నాను.

ఆ రోజు మధ్యాహ్నం నాతో పోట్లాడి రాత్రంతా ఎక్కడో ఉండొచ్చారాయన గుర్తుందా. ఆ మధ్యాహ్నం ఆయన ఏమన్నారో తెలుసా? ఆయన సమస్త బాధలకీ, కష్టాలకీ, తల మీద ఆచ్ఛాదన లేకపోవడానికీ, చేతిలో డబ్బులేకపోవడానికి కారణం నేనేనట. నేను ఒక్క రూపాయి సంపాదించకపోగా ఆయన సంపాదనంతా ఖర్చు చేసేశానట. అసలు నేను ఎస్సెల్సీ అవగానే చదువుకుంటానని ఎంత గోల పెట్టినా మా నాన్న చదివించలేదు. టీచర్ ట్రైనింగ్, నర్స్ ట్రైనింగ్, ఆఖరికి టైపూ, షార్ట్‌హాండ్ ఏదైనా చేస్తానని బ్రతిమిలాడినా వినక పెళ్లి చేశాడు. పెళ్ళయిన్నాటి నుండి సంసార సాగరంలో పడి ఈదాను. అంతంత మాత్రం సంపాదనలో కూడా ఆయన స్వంత ఖర్చులు బాగానే పెట్టుకునేవారు. పైసా దాచుకోవాలని వుండేదికాదు. నాకు వీలైనంత కష్టం నేనూ పడ్డాను. ఎంత చాకిరీ చేశాను. పిల్లల చదువులు, ఆడపిల్ల పెళ్ళి ఇవ్వన్నీ ఆయనొక్కడివల్లే అయ్యాయట. నావల్ల ఏం కాలేదట. సరే, ఆయన డబ్బుపోయిన కష్టంలో అట్లా మాట్లాడారని సరిపెట్టుకున్నాను. మర్నాడు సుజాత ఇంటికి వెళ్ళినప్పుడు ఈ సంగతులన్నీ చెప్పాను. తను సానుభూతితో విని పిల్లలు చదువుకోడానికి వాళ్ళింట్లో ఉన్న మూడు బెడ్‌రూమ్స్‌లో ఒకటి ఊర్కెనే ఇచ్చింది. నువ్వూ, ఆయనా కూడా సంతోషించారు. తరువాత నాకేం తోచక మధ్యాహ్నం పూట రోజూ వాళ్ళింటికి కాసేపు వెళ్ళి తనకి చిన్నచిన్న పన్లు చేసి పెట్టేదాన్ని. తనకి మోకాళ్ళ నెప్పులు, బిపి, షుగరు లాంటివన్నీ వున్నాయి. వంటమనిషి, పనమ్మాయి వున్నా నేను చేసిపెట్టిన చిన్నచిన్న పన్లకే చాలా సంతోషపడేది. ఈరోజుల్లో ఉద్యోగాలు చేసే ఆడవాళ్ళు చాలామందికి నాలాంటి మనిషి దొరికితే పొంగిపోతారంది. తన మోకాళ్ళ నెప్పుల మూలంగా, తన కూతురు ప్రసవించినప్పుడు అమెరికా వెళ్ళలేకపోయిందట. అప్పుడు అక్కడ వున్న ఒక గుజరాతీ ఆవిడ్ని ఏడాది వుంచుకుని నెలకి ఎనిమిది వందల డాలర్లు ఇచ్చిందట. అలా ఆవిడ పదివేల డాలర్లు పుచ్చుకుని వెళ్ళిందట.

"అట్లా నాకెవరన్నా ఇస్తే నేనూ వెడుదును. నా జన్మలో నాదంటూ ఒక రూపాయి సంపాదించి ఎరుగను. నలభై ఏళ్ళ కష్టానికి రూపాయి విలువ లేదు" అన్నాను.

"నిజంగా నువ్వు వెడతావా"? అంది సుజాత.

వెడతానన్నాను.

అప్పుడు చెప్పింది. తన కూతురికి ఇప్పుడు కూడా మనిషి అవసరమేనట. తన కూతురు బావగారు అమెరికాలో వున్న ఇండియన్ ఎంబెసీకి ట్రాన్స్‌ఫర్ అయ్యారట. ఆయన తలచుకుంటే పాస్‌పోర్ట్, వీసాలు ఇప్పించగలడు. ఆయన పదిరోజుల్లో హైదరాబాద్ వస్తాడు. వచ్చినప్పుడు మనం వెళ్లి కలుద్దాం అంది. అట్లా నన్ను తనకి తోడుగా రమ్మనట్లు మీ మావగార్ని ఒప్పించి తీసుకువెళ్ళింది. పదిరోజులు హైదరాబాద్‌లో వుండి వచ్చాను. ఆ తరువాత నాకొచ్చే కాగితాలన్నీ సుజాత కేరాఫ్‌కే వచ్చేవి. నాకు పాస్‌పోర్ట్ వచ్చింది. మళ్ళీ వీసా కోసం రెండురోజులు మద్రాసు వెళ్ళాల్సొచ్చింది. దానికి కూడా అబద్ధాలు చెప్పి ఆమెతో వెళ్ళాను. చివరికిప్పుడు టికెట్టు కూడా వచ్చింది. నాకు రానూపోనూ టికెట్లు కొనిచ్చి నెలకి ఆరువందల డాలర్లు ఇచ్చేలా మాట్లాడింది. ఆరునెలలకి ఆమె చదువు అయిపోతుంది. ఆమె చదువుకుంటుంటే పాపని చూసి. వంట చేసి పెట్టాలి. నేను కూడా వచ్చేటప్పుడు కొన్నివేల డాలర్లతో వస్తానంటే నేనెంత ఆనందించానో నీకు తెలీదు. డబ్బు సంపాదించడంలో ఎంత శక్తి వుందో నాకర్థం అయ్యింది.

సుజాత నన్ను మద్రాసు తీసుకువచ్చి విమానం ఎక్కించింది. అక్కడ నాకవసరం అయ్యే చీరలవీ కొనిచ్చింది. ఒక పల్లెటూర్లో పుట్టి పెరిగి, ఒక చిన్న పట్నంలో కాపురం వుండి, ఇండియాలోనే ఏ ప్రదేశమూ ఎరగని నేను లాస్ ఏంజిలిస్‌లో విమానం దిగాను. మన రాష్ట్రంలో చాలా మంది గల్ఫ్ దేశాలకి పనివాళ్ళుగా వెళ్ళి డబ్బు సంపాదించుకొస్తారని నాకు తెలుసు. అసలు "కువైట్ సావిత్రమ్మ' అనే కథ నువ్వే నాకు చెప్పావు. ఇది అంత కష్టమైన ఉద్యోగం కూడా కాదు. పనిమనిషి కన్నా కాస్త మెరుగ్గా చూసే కల్పన దగ్గర వుండగలినప్పుడు, డబ్బిచ్చిన వాళ్ళ దగ్గర అణుకువగా వుండడంలో తప్పేం లేదు గదా! నేనెక్కడైనా వుండగలను అనుకున్నాను. తిరిగి వచ్చాక కూడా ఏదో ఒక పని చేస్తాను. నా చేత ఏదో ఒకటి చేయిస్తానని సుజాత చెప్పింది. నేనొచ్చేవరకూ నా జీతంలో మినహాయించుకుని నెలకొక రెండువేలు మీ మామగారికివ్వమని సుజాతకి చెప్పాను. ఆయన తీసుకోరు. నువ్వు తీసుకో. నా మాట నువ్వు తప్పకుండా వింటావనే ఆశతో రాస్తున్నాను. నువ్వు తప్పకుండా ఆ డబ్బు తీసుకుని ఆయనకేం కావాలో చూడు. నేనొచ్చేవరకూ ఆయన్ని కల్పన దగ్గరకు పంపకు. పిల్లలకు మంచి మార్కులు, ర్యాంకులు రావాలని అమ్మవారికి పూజచేస్తాను. రమేష్‌కి నచ్చజెప్పు. ప్రతి ఆదివారం ఉదయం సుజాతకి వాళ్ళమ్మాయి ఫోన్ చేస్తుంది. నాతో మాట్లాడాలనుకుంటే సుజాత పిలుస్తుంది. నాకు తప్పకుండా ఉత్తరం రాస్తావని నమ్ముతూ....

ప్రేమతో
వసుంధర.

('మంత్రనగరి' సౌజన్యంతో)

# స్ఫూర్తిదాయకం పాపా ఉమానాథ్ జీవితం

-బృందాకరత్

పాపా ఉమానాథ్ భయమెరుగని కమ్యూనిస్టు యోధురాలు. స్ఫూర్తిదాయని, ఐద్వా కేంద్ర కమిటీ సభ్యురాలు, అఖిల భారత మహిళా సంఘం స్థాపకుల్లో ఒకరు. 81 ఏళ్ళ పండు వయసులో గత డిసెంబరు 17న తిరుచిలోని ఆసుపత్రిలో కన్నుమూశారు. ఐద్వా కేంద్ర కమిటీ ఆమెకు ఘన నివాళి అర్పించింది. పదకొండేళ్ళ వయసులో రైల్వే కార్మికుల మధ్య తన రాజకీయ జీవితానికి అంకురార్పణ చేసిన గోల్డెన్ రాక్ వద్దనే ఆమెను సమాధి చేయటం జరిగింది. 1946 నాటి చారిత్రాత్మకమైన రైల్వే కార్మికుల ఆందోళనపై పోలీసులు జరిపిన కాల్పుల్లో అమరులైన ఐదుగురి సమాధులు ఆ సమీపంలోనే ఉన్నాయి. ఇక్కడనే ఆమె మొట్టమొదటిసారిగా అరెస్టయింది, ఇక్కడనే ఆమె తొలిసారిగా లాఠీ దెబ్బలు తిన్నది.

శ్రమ జీవుల కుటుంబం నుంచి వచ్చిన పప్పా చివరివరకు వర్గ దృక్పథాన్ని వీడలేదు. ముఖ్యంగా పెట్టుబడిదారీ దోపిడీకి, సామాజిక అణచివేతకూ గురవుతున్న శ్రామిక మహిళల తరపున పోరాడారు. మహిళా ఉద్యమ నాయకురాలిగా, తమిళనాడు శాసనసభలో ప్రజాప్రతినిధిగా ఆమె అనుక్షణం విప్లవ లక్ష్యాల కోసమే పనిచేశారు. సుదీర్ఘమైన ఆమె రాజకీయ జీవితంలో అనేక ఒడుదుడుకులు ఉన్నాయి. మహాత్ముని నాయకత్వంలో సాగిన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని తదనంతర కాలంలో కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొన్న నాయకులవలె కాకుండా ఆమె కార్మికోద్యమంలో నుంచి నేరుగా కమ్యూనిస్టు పోరాటంలోకి అడుగుపెట్టారు. తొలినుంచీ శ్రామిక పక్షపాతి గానే ఉన్నారు., దాదాపు ఇదే సమయంలో అహల్యా రంగ్నేకర్, విమలా రణదివే, కనక ముఖర్జీ, జానకి అమ్మాళ్ వంటి ధృవతారలు స్వాతంత్ర్య పోరాటంలో తలమునకలుగా ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమాన్ని శ్రామిక విముక్తి పోరాటాలతో జతచేయాలన్న ఆలోచన వారిది. వీరికన్నా పిన్నవయస్కురాలైన పప్పా నేరుగా శ్రామిక ఉద్యమాలలోకి ప్రవేశించింది. యుక్త వయసులో ఉండి పుస్తకాలు అమ్మటం, సభలలో ప్రసంగించటం చూసి అప్పటి సంప్రదాయకులు ఆగ్రహించారు. అయినా ఆమె వీటిని పట్టించుకోకుండా ముందుకు సాగిపోయారు. అప్పటి సాంఘిక వాతావరణం ఆమెపై తీవ్రమైన ప్రభావాన్నే నెరపింది. స్త్రీలకు స్వాతంత్ర్యం ఉండాలన్న వాదనతో నాటి సమాజం విధించిన కట్టుబాట్లను ఎదిరించారు. చిన్నతనంలో ఎదురైన కష్టాలు ఆమెను రాటుదేల్చాయేగాని ఏమాత్రం నిరాశకు గురిచేయలేదు. పరిస్థితిని అంచనా వేయటంలో గానీ, ఎదుటి వారిని గుర్తించటంలోగానీ చాలా మెలకువగా ఉండేవారు.



05-08-1931 17-12-2010

వప్పాది మొక్కవోని సాహసం. స్వాతంత్ర్యానికి పూర్వమూ, తరువాత ఆమె పలుమార్లు జైలుకెళ్ళారు. భారత- చైనా యుద్ధ సమయంలోనూ, ఈ తరువాత మార్క్సిస్టు పార్టీ ఏర్పడినపుడూ, అనంతరం పాకిస్థాన్ యుద్ధమప్పుడూ ప్రభుత్వం ఆమెను అరెస్టు చేసింది. పన్నెండేళ్ళ వయసులోనే ఆమె మొదటిసారి అరెస్టు అయింది. శ్రామికుల పక్షాన పొనమలైలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రదర్శనలో పాల్గొన్నందుకు పోలీసులు అరెస్టు చేశారు. అయితే ఆమె వయసును దృష్టిలో ఉంచుకుని కోర్టు విడుదల చేసింది. మరో సందర్భంలో పోలీసులు అరెస్టు చేయడానికి వచ్చినపుడు సహచర కామ్రేడ్స్ తప్పుకు పోవడానికి వీలుగా పోలీసు కానిస్టేబుల్ చేతిని కొరికింది. దానితో పోలీసులు ఆమెను దారుణంగా కొట్టారు. 1946లో పెద్ద ఎత్తున జరిగిన శ్రామికుల సమ్మెలో ఆమె పాల్గొన్నారు. ఈ సందర్భంగా పోలీసులు జరిపిన కాల్పుల్లో ఐదుగురు మరణించారు. 1948లో పార్టీపై నిషేధం వచ్చినప్పుడు విపరీతమైన దమనకాండ సాగింది. అప్పటిలో పార్టీ, పప్పాను ఆమె తల్లినీ మద్రాసుకు పంపింది. వారక్కడ కామ్రేడ్స్ కోసం రహస్య స్థావరాన్ని నడిపారు. ఇక్కడనే కామ్రేడ్ ఉమానాథ్‌ను కలుసుకున్నది. కొంతకాలం తరువాత వారిరువురూ వివాహం చేసుకున్నారు. ఈ కాలంలోనే పప్పా అగ్ని పరీక్షలను ఎదుర్కొన్నది. పోలీసులు ఇంటిపై దాడిచేసి ఆమెనూ, తల్లినీ ఇతర కామ్రేడ్స్‌నూ అరెస్టు చేసారు. తప్పించుకు పోయినవారి ఆచూకీ కోసం పోలీసులు ఆమెను చితకబాదారు. జైలులో పారిశుద్ధ్య పనిని అప్పచెప్పినపుడు ఆమె దానికి తిరస్కరిస్తూ తాను రాజకీయ ఖైదీనని చెప్పారు. అంతేకాక మలమూత్రాలున్న కుండను ఒక అధికారిపై విసరివేసింది. దానితో పోలీసులు ఆమెను విపరీతంగా కొట్టారు. ఈ దెబ్బల తాలూకూ మచ్చలు చాలాకాలంపాటు ఆమె దేహంపై ఉండిపోయాయి. తల్లితో కలిసి ఆమె జైలులోనే నిరాహార దీక్ష చేసింది. పోలీసులు ఆమెను, తల్లినీ వేరు చేశారు. ఆ సమయంలోనే తల్లి మరణించింది. తల్లి శవాన్ని చూడాలంటే పార్టీకి రాజీనామా ఇవ్వాలంటూ పోలీసులు షరతు విధించారు. దానికామె తిరస్కరించారు. తల్లి శవాన్ని జైలు గదిలో నుంచి బయటకు తీసుకువస్తున్నపుడు కటకటాల వెనక నిల్చుని చూడగలిగింది. తన తల్లి శవాన్ని ఏమి చేశారో ఆమెకు తెలియదు. తల్లి మృతదేహానికి ఎర్రజెండాను కప్పాలన్న ఆమె కోరిక తీరనేలేదు.

అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడటం ఆమెకున్న మరో లక్షణం, తంజావూరులోని వ్యవసాయ కార్మికులతో, ముఖ్యంగా మహిళలతో పప్పా మమేకమయ్యేది. వారే స్వయంగా డిమాండ్లు తయారు చేసేలా ప్రోత్సహించేది. తదనంతర కాలంలో శాసన

(తరువాయి 20వ పేజీలో)

# మాలెగామ్ నివేదికతో మహిళలకు చిక్కులెన్నో!

-అర్చనా ప్రసాద్, ఫ్రాంకో

సూక్ష్మ రుణాల (మైక్రో ఫైనాన్స్) రంగానికి సంబంధించిన అంశాలు, సమస్యలను అధ్యయనం చేసిన మాలెగామ్ కమిటీ 2011 జనవరి 20న రిపోర్టు సమర్పించింది. ఇందులో చేసిన కొన్ని ముఖ్యమైన సిఫారసులు ఈ రంగంబారిన ఎక్కువగా పడే మహిళా రుణగ్రహీతలు, స్వయం సహాయక బృందాల(ఎస్‌హెచ్‌జిలు) భవిష్యత్తుపై ప్రభావం చూపనున్నాయి. కేంద్ర ప్రభుత్వం మైక్రో ఫైనాన్స్ రంగం నుంచి నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలను, మైక్రో ఫైనాన్స్ సంస్థలను ఈ బిల్లు పరిధి నుంచి మినహాయించడాన్ని ప్రజాతంత్ర, అభ్యుదయ సంఘాలు ఎండగట్టాయి. ఇది కేవలం నియంత్రణకు పరిమితమైన అంశం మాత్రమే కాదని, ఈ సంస్థల నుంచి రుణాలు తీసుకునే మహిళల జీవితాలపై అది చూపే ప్రభావంపై కూడా దృష్టి పెట్టాలని వారు కోరారు. మైక్రో ఫైనాన్స్ రంగంలో రుణం తీసుకున్నవారిలో అత్యధిక భాగం మహిళలే. ఈ రుణాలపై వసూలు చేసే వడ్డీరేటుపై పరిమితి విధించాలని, రుణ బకాయిల వసూళ్ల పర్యవేక్షణకు జవాబుదారీతో కూడిన ఒక యంత్రాంగం ఏర్పాటు చేసే అంశాన్ని ఈ బిల్లులో చేర్చాలని సంఘాలు కోరాయి. ఈ డిమాండ్‌కు ఆనాడు యుపిఎ ప్రభుత్వానికి వెలుపలి నుండి మద్దతునిచ్చిన వామపక్షాలు గట్టిగా సమర్థించాయి. దాంతో కేంద్ర ప్రభుత్వం ఆ బిల్లును పక్కన పెట్టింది. అంతేకానీ, మైక్రో ఫైనాన్స్‌లో అంతిమ వినియోగదారుల (పట్టణ,గ్రామీణ పేదల) ప్రయోజనాలను కాపాడడానికి ప్రభుత్వానికి చేతులు రాలేదు. ప్రభుత్వం ఇచ్చిన ఈ అలుసుతో మైక్రో ఫైనాన్స్ సంస్థలు తమ పట్టును మరింత బిగించాయి. మైక్రో ఫైనాన్స్ రంగంపై ఈ సంస్థల పట్టు ఇంతగా పెరిగిపోవడానికి ప్రభుత్వం అనుసరించిన వివిధ విధానపరమైన నిర్ణయాలే కారణం. స్వయం సహాయక గ్రూపుల ప్రయోజనాలకు, రుణ సంస్థల ప్రయోజనాలకు మధ్య దీర్ఘకాలికంగా సాగుతున్న ఈ వైరుధ్యాన్ని పరిష్కరించే పేరుతో ప్రభుత్వం అనుసరించిన విధానాలు మహిళల్ని, స్వయం సహాయక బృందాల్ని మరింతగా మైక్రో ఫైనాన్స్ సంస్థలపై ఆధారపడే స్థితివైపు నెట్టాయి. చివరికి అప్పుల ఊబిలో కూరుకు పోయిన మహిళలు గత్యంతరం లేని పరిస్థితుల్లో ఆత్మహత్యలకు పూనుకున్నారు. ఆంధ్ర ప్రదేశ్ ఇందుకు తిరుగులేని ఉదాహరణ. ఇటువంటి పరిస్థితుల్లో మాలెగావ్ కమిటీ కానివ్వండి, మరొకటి కానివ్వండి చేసే సూచనలేవిధంగా ఉండాలి? మహిళలకు తక్కువ వడ్డీపై బ్యాంకుల ద్వారా రుణాలందించేందుకు అవకాశాలు పెంచి, లాభార్జన కోసం పనిచేసే ప్రైవేటు సంస్థలపై వారు ఆధారపడడాన్ని తగ్గించే విధంగా ఉండాలి.



ప్రయివేటు రుణ సంస్థల బలవంతపు వసూళ్లను నిరోధించాలన్న ఆ కమిటీ సిఫారసు స్వాగతించ దగినదే. అయితే, ఆ కమిటీ చేసిన మిగతా ప్రతిపాదనలు పేద రుణగ్రహీతల తక్షణ, దీర్ఘకాలిక ప్రయోజనాలపై ప్రభావం చూపేవిగా ఉన్నాయి. సూటిగా చెప్పాలంటే ఎవరి ఆందోళనపై దృష్టి పెట్టాలో దానిపై పెట్టలేదు.

## నియంత్రణా పరిధి నిర్ణయం

నియంత్రణపై చర్చలో మహిళా రుణగ్రహీతలు గొంతెత్తి కోరినది అన్ని రకాల మైక్రో రుణ సంస్థలను నియంత్రణ పరిధిలోకి తీసుకురావాలని, మహిళలకు రుణాలు అందజేసే సంస్థలను స్థూలంగా మూడు కేటగిరీలుగా వర్గీకరించవచ్చు. అందులో మొదటివి బ్యాంకులు (ప్రభుత్వ, సహకార, గ్రామీణ, ప్రైవేట్ రంగం) రెండవ కేటగిరిలో మైక్రో ఫైనాన్స్ సంస్థలు, మూడవ కేటగిరీలో లాభాన్ని ఆశించకుండా చిన్న చిన్న రుణాలను అందించే ట్రస్టులు, సొసైటీలు, కో-ఆపరేటివ్స్ వంటి రకరకాల సంస్థలు వుంటాయి. అలాంటప్పుడు వీటిలో కమిటీ వేటిపై ప్రధానంగా దృష్టి పెట్టాలి అన్నప్పుడు రెండవ కేటగిరీపైనే అని ఎవరైనా ఠక్కున సమాధానం చెబుతారు. కానీ, ఈ కమిటీ వీటిని నాన్ బ్యాంకింగ్ ఫైనాన్షియల్ కంపెనీ (ఎన్‌బిఎఫ్‌సి-ఎంఎన్‌ఐ) అనే నూతన కేటగిరీగా పేర్కొంది. బ్యాంకింగ్ యేతర ఫైనాన్స్ రంగంలో ఇదొక ప్రత్యేక కేటగిరీగా పరిగణించింది. ఈ కేటగిరీ ఎందుకు ఏర్పాటు చేయాల్సివచ్చిందో ఆ నివేదిక వివరిస్తూ అణగారిన వర్గాల గ్రూపులతో ఇవి లావాదేవీలు సాగిస్తున్నాయి. గనుక వీటికి ఆ ప్రతిపత్తి అవసరమంది. వాటి భవిష్యత్తు కోసం బ్యాంకు లింకేజి కార్యక్రమంతో వీటికి అనుసంధానం ఉండాలన్నది.

మైక్రో ఫైనాన్స్ సంస్థలను ఈ కమిటీ ఒక కంపెనీగా (కంపెనీయాక్టులో 25వ సెక్షన్ కింద ఒకరికన్నా ఎక్కువ మందికి లైసెన్సులివ్వబడినది) నిర్వచిస్తూ

ఇవి అల్పాదాయ రుణ గ్రహీతలకు చిన్న మొత్తంలో రుణాలను స్వల్పకాలిక ప్రాతిపదికన, అంతంతమాత్రమైన భరోసాతో ఉత్పాదక కార్యక్రమాలకే ప్రధానంగా ఇస్తాయి. రుణాల పున:చెల్లింపుల షెడ్యూళ్ళ వాణిజ్య బ్యాంకులు సాధారణంగా నిర్దేశించే షెడ్యూళ్ల కన్నా తక్కువగాను, తరచుగాను ఉంటాయి" అని పేర్కొంది. ఆ నిర్వచనం ప్రకారమే అయితే వార్షిక ఆదాయం రూ॥50వేలకు మించనివారికి మైక్రో ఫైనాన్స్ సంస్థలు రుణాలు ఇవ్వాలి. వ్యక్తిగత రుణాలకింద ఒకరికి గరిష్టంగా రూ॥25వేల పరిమితికి మించరాదు. కమిటీ చెప్పిన ప్రకారమే సంస్థల ఆస్తుల్లో 90 శాతం దాకా లోన్ పోర్టుఫోలియో(దీనినే కమిటీ క్వాలిఫయింగ్ ఆస్తులుగా పేర్కొంది) కింద ఉండాలి.

ఈ నిర్వచనంలో మనం గమనించాల్సిన మరో ముఖ్యమైన అంశమేమిటంటే ఇది వదిలేసిన అనేకసంస్థలు (ట్రస్టులు, సొసైటీలు, సమాఖ్యలు, సెన్ 25 పరిధిలోని కంపెనీలు) విద్య, ఆరోగ్య సేవల రంగాలపై ప్రధానంగా దృష్టి సారించాల్సినవి మైక్రో ఫైనాన్స్ కార్యకలాపాల్లో మునిగితేలుతున్నాయి. వీటిలో కొన్ని స్వయం సహాయక బృందాలు-బ్యాంకు లింకేజి కార్యక్రమంలో పాల్గొంటూ తమకు ఇందులో ఎలాంటి లాభార్జనాదృష్టి లేదంటున్నాయి. తమకు లాభ దృష్టి లేదనే పేరుతో బ్యాంకు లింకేజి కార్యక్రమాలను వినియోగించుకుని పెద్ద ఎత్తున సంపద పోగేసుకుంటున్నాయి. తరువాత మైక్రో ఫైనాన్స్ సంస్థలుగా అవతారమెత్తుతున్నాయి. పేదలు ప్రత్యేకించి పట్టణ పేదల అనుభవాలను చూస్తే ఇటువంటి సంస్థలపై నియంత్రణ ఎంత అవసరమో తెలుస్తుంది. ఎన్‌జివో పేరుతో మైక్రో ఫైనాన్స్ కార్యకలాపాల్లో పాల్గొంటున్న వాటిని నియంత్రించేందుకు ఎలాంటి నియమ నిబంధనలు లేవు. అవి పైకి ఏమి చెప్పినప్పటికీ వాటిలో కొన్ని సంస్థల కార్యకలాపాలు దోపిడీ స్వభావంతో కూడుకున్నాయన్నది కాదనలేని నిజం. కాబట్టి లాభ దృష్టిలేదని చెప్పే సంస్థలను కూడా నియంత్రణా పరిధిలోకి తీసుకురావాల్సిన అవసరం ఉన్నది. దీనిని సాధించేందుకు కింది స్థాయి నుంచి పర్యవేక్షణ అవసరం ఆ విధంగా చూసినప్పుడు ఆర్‌బిఐ, నాబార్డు, ఆ జిల్లాల్లో ప్రధానంగా వుండే బ్యాంకులు, రుణ సంస్థల కమిటీలను జిల్లా స్థాయి బ్యాంకర్స్ కమిటీ కింద ఏర్పాటుచేయాలి. కమిటీ సూచనలు ఈ దిశలో ఉండాలి. కానీ, అలా లేవు కమిటీ చేసిన సిఫారసును ఇప్పుడున్న రూపంలో గనుక అమలు చేసినట్లయితే అది ఎన్‌జివోలుగా నమోదు చేసుకున్న చిన్న మైక్రో రుణ సంస్థలను ప్రోత్సహించేందుకు మాత్రమే తోడ్పడుతుంది. ఎన్‌జివోలుగా వున్న వీటిపై ఎలాంటి నియంత్రణ ఉండదు.

**నిరుపేద మహిళల పాలిట శాపం :**

మాలెగావ్ కమిటీ నివేదికలోని ముఖ్యమైన సిఫారసుల్లో ఒకటి ఏమిటంటే బ్యాంకుల, మైక్రో ఫైనాన్స్ సంస్థల వడ్డీ రేట్లు ఒక దానికొకటి తోడ్పడేవిగా వుండాలనేది. మైక్రో ఫైనాన్స్ సంస్థలు సమకూర్చుకున్న నిధుల్లో 75 శాతం దాకా సిడ్బి (భారతీయ చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి బ్యాంకు), బ్యాంకింగ్ రంగం ద్వారా చేకూరినవే. అలాగే మైక్రో ఫైనాన్స్ సంస్థలు ఇచ్చిన హామీ ప్రకారం సిడ్బికి 13,800 కోట్లు, బ్యాంకులకు 4,200 కోట్లమేర బకాయిలను మైక్రో ఫైనాన్స్ సంస్థలు చెల్లించాల్సి వుంది. ఇలా మైక్రో ఫైనాన్స్ రంగం, బ్యాంకింగ్ రంగం ఒకదానిపై ఒకటి ఆధారపడి నడుస్తున్నాయని, వాటి మధ్య వున్న ఈ బంధమే మైక్రో ఫైనాన్స్ రంగానికి రాచబాట వేస్తున్నదనే విషయాన్ని గుర్తించాలి. ఇక రుణాలకు సంబంధించి కమిటీ చేసిన ముఖ్యమైన సిఫారసు విషయానికి వస్తే మైక్రో ఫైనాన్స్ సంస్థలకు బ్యాంకులు నేరుగా అందించే రుణసాయం, స్వయం సహాయక బృందాలు (ఎస్‌హెచ్‌జి)-బ్యాంకు లింకేజి కార్యక్రమం ఈ రెండింటి ద్వారా అందించే సాయం గణనీయంగా పెరగాలన్నది. అంతేకాదు, మైక్రో ఫైనాన్స్ సంస్థలకు బ్యాంకులిచ్చే రుణ సాయాన్ని ప్రాధాన్యతా రంగంగా గుర్తించాలని కమిటీ చెప్పింది. మైక్రో ఫైనాన్స్ సంస్థలకు రుణాలిచ్చే బ్యాంకుల మధ్యపోటీ చివరికి మైక్రో ఫైనాన్స్ వడ్డీ రేట్ల తగ్గుదలకు దారితీస్తుందని కమిటీ చెబుతోంది. ఈ వాదనలో హేతుబద్ధత ఏమిటో బోధ పడడం లేదు. బ్యాంకులు తమ నిర్వహణా వ్యయాన్ని, రుణాలలో రిస్కులను తగ్గించుకోవడానికి దీనినొక దగ్గరి దారిలా భావిస్తున్నాయి. బ్యాంకులు తమ రుణాలను మహిళా స్వయం సహాయక బృందాలకు తక్కువ వడ్డీకి రుణాలు అందించే దానికన్నా, మైక్రో ఫైనాన్స్ సంస్థలు- ఎస్‌హెచ్‌జిల లింకేజి ద్వారా ఎంఎఫ్‌ఐలకే ఇవ్వడం వల్ల ఎక్కువ మేలు జరుగుతుందని అవి భావిస్తున్నట్లుంది. మైక్రో ఫైనాన్స్ రంగాన్ని 'ప్రాధాన్యతా రంగం' గా నొక్కి చెప్పడంలో ఉద్దేశం ఏమైనప్పటికీ దీని వల్ల అంతిమంగా జరిగేది జనం మైక్రోఫైనాన్స్ సంస్థలపై ఆధారపడక తప్పని పరిస్థితిని ఇది కల్పిస్తుంది. సిడ్బి ఇంతకుముందు లాభాపేక్ష లేని ఎన్‌జివోలతో భాగస్వామ్యం పంచుకునేది. ఇప్పుడు తన రుణ సాయంలో సింహ భాగాన్ని మైక్రో ఫైనాన్స్ సంస్థలకు ఇస్తున్నది.

వడ్డీ రేట్లకు సంబంధించి కమిటీ చేసిన సిఫారసులను కూడా ఈ నేపథ్యంలోనే చూడాల్సి ఉంది. కమిటీ దృష్టి తక్కువ వడ్డీ రేట్లపై బొత్తిగా లేదు. వడ్డీ రేటును నిర్ణయించేందుకు అనుసరించాల్సిన మార్గం న్యాయంగా ఉండాలని మాత్రమే పేర్కొంది. ఈ ప్రతిపాదనలను విశ్లేషించగా అర్థమయ్యేదేమిటంటే వడ్డీ రేట్ల తగ్గింపు కోసం రుణ గ్రహీతలు మార్కెట్ మెకానిజం పై ఆధారపడాల్సి రావడం. వడ్డీరేటు నిర్ణయానికి ప్రాతిపదికను రుణాలకయ్యే వాస్తవిక వ్యయమేనని కమిటీ చెప్పింది. ఇక్కడే అది మరో విషయాన్ని కూడా చెప్పింది. మైక్రో ఫైనాన్స్ సంస్థలు ఇచ్చే రుణాల నిర్వహణ వ్యయం లెక్కించేటప్పుడు అవి పది శాతం దాకా లాభాన్ని మినహాయించుకోవచ్చని సూచించింది. ఉదాహరణకు రుణ బకాయిలు 15 కోట్ల నుంచి వంద కోట్లు దాకా వున్నప్పుడు 12 శాతం లాభం మినహాయించుకుని నిర్వహణా వ్యయాన్ని లెక్కించాల్సి వుంటుంది. అంటే ఈ లాభం (మనం రుణ నిర్వహణకయ్యే వాస్తవిక ఖర్చుపై వసూలుచేసే శాతం అని మనం చెప్పవచ్చు) మైక్రో ఫైనాన్స్ సంస్థల వాస్తవిక రుణ నిర్వహణ ఖర్చుకు అదనంగా తోడవుతుందన్నమాట. మైక్రో ఫైనాన్స్ సంస్థల వార్షిక ఆదాయం ఆధారంగా ఈ వాస్తవిక రుణ నిర్వహణ వ్యయం నిర్ణయించబడుతుంది. ఈ చర్యవల్ల బ్యాంకుల మధ్య పోటీ పెరుగుతుందని, చివరికి అది వడ్డీ రేట్ల తగ్గింపునకు దారి తీయగలదన్న ఆశాభావాన్ని కమిటీ వ్యక్తం చేసింది. 'దేశీయ సామాజిక పెట్టుబడి నిధి' ఏర్పాటుకు సంబంధించి కమిటీ ఒక ప్రతిపాదన చేస్తూ 'సామాజిక మదుపరులు' ఇటువంటి నిధిని ఏర్పాటు చేసుకోవడం వల్ల మైక్రో ఫైనాన్స్ సంస్థలకు రుణాలిచ్చే బ్యాంకుల వడ్డీ రేట్లు కూడా తక్కువగా ఉండేట్లు చూడవచ్చు అని చెప్పింది. దీనంతటి సారాంశమేమిటంటే మైక్రో ఫైనాన్స్ సంస్థలకు రెండు విధాలుగా ఇది లాభకరంగా వుంటుంది. ఒకటి తనకు నిధులిచ్చే బ్యాంకులతో బేరమాడే సామర్థ్యాన్ని పెంచుకోవడానికి, అదే సమయంలో తన కార్యకలాపాలను విస్తరించుకోవడానికి ఇవి ఉపయోగపడతాయి. అంతేకాదు బ్యాంకులకు, మహిళా స్వయం సహాయక బృందాలకు మధ్యవర్తులుగా 'మైక్రోఫైనాన్స్' సంస్థల జోక్యం మరింత పెరగనున్నది. అప్పుడు ప్రజలు మైక్రో

ఫైనాన్స్‌పై ఆధారపడడం తగ్గడానికి బదులు మరింత పెరుగుతుంది.

ఇక రుణ గ్రహీత విషయానికొస్తే కమిటీ సూచించినట్లుగా వడ్డీ రేట్ల నిర్ణయంలో లాభం ఎంత ఉండాలో సూచించినందున ఇక రుణాలు ఎస్‌హెచ్‌జి, జెఎల్‌జి (జాయింట్ లయబిలిటీ గ్రూపు) వంటి బృందాలకే లభిస్తాయని కొందరు అదే పనిగా ఊదరగొడుతున్నారు. నిర్ణీత గడువులోగా రుణ బకాయిలను చెల్లించని రుణగ్రహీత నుంచి బలవంతంగా వసూలు చేయడంలో కానీ, రుణాలు ఇప్పించడంలో కానీ సామాజికి ఒత్తిడి, బాధ్యత అనేది ఒక కీలక మెకానిజంగా పనిచేస్తున్నది. అంటే ఎవరికి రుణాలు ఇవ్వాలి, ఎవరికి ఇవ్వకూడదు అనేది ఆ వ్యక్తి అవసరాలను బట్టి కాక, ఈ సామాజిక బృందంలో ఉండే సామాజిక పొందికపై ఆధారపడి జరుగుతుంటాయి. సమాజంలోని అట్టడుగువర్గాలవారికే రుణాలు ఎక్కువగా అవసరమవుతుంటాయి. అటువంటి ఈ గ్రూపు రుణాలపై వడ్డీ రేటుకు సంబంధించి మాలెగామ్ కమిటీ ఎలాంటి పరిమితిని విధించలేదు. ఇది ఖతాలలో మోసాలకు పాల్పడుతూ, ఎస్‌హెచ్‌జి, జెఎల్‌జి లకు ఇచ్చే రుణాలపై ఇష్టానుసారంగా వడ్డీ రేట్లు పెంచుకునేందుకు మైక్రో ఫైనాన్స్ సంస్థలకు లైసెన్సులు ఇవ్వడమే. అనుషంగిక బాధ్యత స్థానే సామాజిక బాధ్యత అన్న పదం తీసుకురావడం వల్ల ఈ గ్రూపులలో ఆర్థికంగా, సామాజికంగా అణగారిన వర్గాల ప్రజలను మరింత నిరాదరణకు గురి చేసినట్లవుతుంది.

దీనికి తోడు వ్యక్తిగత రుణాలపై 24 శాతం వరకు మినహాయించుకోవచ్చని కమిటీ పేర్కొంది. అంటే, ఈ భారీ వడ్డీ రేటు పేద మహిళా రుణగ్రహీతలకు తలకు మించిన భారంగా పరిణమించనుంది. బీమా ప్రీమియం, ప్రాసెసింగ్ ఛార్జీలకు తోడు ఈ 24 శాతం వడ్డీ అంటే ఎంత భారమో వేరే చెప్పనక్కర్లేదు. ప్రభుత్వం కొంత సహాయాన్ని తోడు చేసిన నాలుగు శాతం వడ్డీ రేటుకే ఎస్‌హెచ్‌జి గ్రూపులకు రుణాలు ఇవ్వాలన్న మహిళా సంఘాల డిమాండ్ అసంబద్ధమైనదేమీ కాదు. దీనిని పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపుర ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి. ఎస్‌హెచ్‌జిలకు సబ్సిడీతో కూడిన రుణాలను అందిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ కూడా పాక్షికంగా దీనిని అమలు చేస్తోంది. పేదరిక నిర్మూలనకు మైక్రో ఫైనాన్స్ ఒక సాధనం వంటిదని మాలెగామ్ కమిటీ తన నివేదిక ప్రారంభంలోనే ఉద్ఘాటించింది. మైక్రో ఫైనాన్స్ సంస్థల మొత్తం రుణాలలో 75 శాతం ఆదాయం ఉత్పాదకతకే ఉపయోగపడుతుందని చెప్పింది. మరి అలాంటప్పుడు వ్యక్తిగత రుణపరిమితిని రు. 25వేలుకు ఎందుకు పరిమితం చేసినట్లు? ఈ అరకొర రుణంతో ఆదాయ ఉత్పాదక కార్యక్రమాలను నిర్వహించడం ఎట్లా సాధ్యం? ప్రస్తుత సామాజిక, ఆర్థిక గడ్డు పరిస్థితుల్లో వినిమయదారీ రుణాలు పెరిగిపోయి పరిస్థితిని మరింత దిగజార్చుతున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో మహిళా బృందాలు తమకు ప్రత్యేక ఆదాయ ఉత్పాదక రుణాలివ్వాలని, సమాజంలో అణగారిన, పేద మహిళలతో ఏర్పాటైన ఎస్‌హెచ్‌జిలకు రుణ సదుపాయం కల్పించాలనే డిమాండ్లను గట్టిగా పునరుద్ఘాటించాల్సిన అవసరముంది. మాలెగామ్ కమిటీ ఈ రంగానికి ఆర్‌బిఐనే రెగ్యులేటర్‌గా వ్యవహరించాలని సూచించింది. అలాగే మైక్రోఫైనాన్స్ సంస్థల స్వీయ నియంత్రణ అవసరాన్ని కూడా నొక్కి చెప్పింది. విచిత్రమేమిటంటే ఆంధ్రప్రదేశ్‌లో మైక్రో ఫైనాన్స్ సంక్షోభం తలెత్తినప్పుడు సూక్ష్మ రుణ సంస్థలన్నీ స్వీయ నియంత్రణ పాట పాడాయి. వీటిలో కొన్ని సంస్థలు రుణగ్రహీతలను బలవంతం చేసి బకాయిలను వసూలు చేయడంలో సామర్థ్యం ప్రదర్శించిన సిబ్బందికి బంగారు నాణేలను కానుకగా ఇచ్చాయన్న సంగతి మరచిపోరాదు. ఈ కమిటీ ఇంకో అడుగు ముందుకెళ్ళి మైక్రో ఫైనాన్స్ సంస్థలను రాష్ట్ర ప్రభుత్వం ఎలాంటి నియంత్రణాచట్టాల పరిధిలోకి తేవాల్సిన అవసరం లేదని చెప్పింది. నియంత్రణకు సంబంధించి ఆర్‌బిఐ చట్టంలో స్వల్ప మార్పు తెస్తే చాలు అంది. వడ్డీ వ్యాపారుల చట్టాలు మైక్రో ఫైనాన్స్ సంస్థలకు వర్తింపజేయరాదని, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన చట్టాన్ని రద్దు చేసుకోవాలని ఈ కమిటీ కోరింది. ఈ రంగాన్ని నియంత్రించడానికి ఎలాంటి కొత్త చట్టాలు తేనక్కర్లేదని కూడా వాదించింది. ఈ సిఫారసులను గనుక ఆమోదిస్తే సామాజిక చట్టాలను కాలరాయడమే అవుతుంది. కాబట్టి ఈ నివేదికలోని అంశాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని విస్తృత పరచేందుకు ఎస్‌ఎచ్‌జి, హక్కుల కోసం పోరాడే సంఘాల ప్రతినిధులంతా విస్తృత స్థాయిలో చర్చలు, సంప్రదింపులు జరపాలి. అప్పుడు మాత్రమే ఈ నయా ఉదారవాద నమూనాకు వ్యతిరేకంగా విశాలమైన పోరాటాన్ని సమర్థవంతంగా చేపట్టగలం. మాలెగామ్ కమిటీ ఎవరి ప్రయోజనాల కోసం ఈ సిఫారసులు చేసిందో వాటిని ముందుకు పోనీయకుండా అడ్డుకోగలం.

(17వ పేజీ తరువాయి)

**స్ఫూర్తిదాయకం పాపా ఉమానాథ్ జీవితం**

సభ్యురాలిగా ఎన్నికైన తరువాత నిత్యం ప్రజలకు అందుబాటులో ఉండేది. ప్రజలిచ్చిన దరఖాస్తులతో సంబంధిత మంత్రిని ఆమె కలిసేవారు. ఆమె ఎప్పుడైనా రానట్లయితే ఆరోజు తమిళనాడు ప్రశాంతంగా ఉందికా బోలంటూ మంత్రులు వేళాకోళమాడేవారు. తమిళనాట మహిళా ఉద్యమ నిర్మాణంలో ఆమె ప్రముఖ పాత్ర వహించారు. తమిళ నాడులో వామపక్ష మహిళా ఉద్యమానికి బీజాలు వేసిన జానకీ అమ్మాళ్ ఆమెకు స్ఫూర్తి ప్రదాత. తదనంతర కాలంలో మైథిలీ శివరామన్ వచ్చి కలిశారు. ఆమె రాకతో ఉద్యమానికి మరింత ఊపు వచ్చింది. పప్పాకు బడి చదువులు లేనప్పటికీ స్వయం కృషితో విద్యనభ్యసించారు. కార్మిక సంఘ పత్రిక సంపాదక వర్గంలో బాధ్యతలను నిర్వహించారు. ప్రజాతంత్ర మహిళా సంఘాన్ని ఏర్పాటు చేసినపుడు చర్చల్లో పప్పా కూడా చురుకుగా పాల్గొన్నారు. గృహ హింస, వరకట్న దహనాల వంటి సమస్యలను తీసుకున్నట్లయితే కార్మిక వర్గానికి దూరమవుతామన్న వాదనరాగా దానిని తోసిపుచ్చారు.

నిర్మాణ దక్షతకు పప్పాను ఉదాహరణగా చెప్పవచ్చు. ఆమె పదేపదే జిల్లాలలో పర్యటించేవారు. ఎక్కువగా మహిళలతో గడుపుతూ వారికి ధైర్యం చెపుతుండేవారు. కార్యకర్తల వ్యక్తిగత విషయాల గురించి బాగా తెలిసిన నాయకులు కొద్దిమందే వుంటారు. ఇలాంటి వారిలో ఆమె ఒకరు. మహిళల్లో పార్టీ నిర్మాణం గురించి నిత్యం ఆలోచించేవారు. పప్పా మరణం నాతోపాటు పలువురికి విచారాన్నే కలిగించింది. అదేవిధంగా కామ్రేడ్ ఉమానాథ్, వారి పిల్లలు వాసుకి, నిర్మల ఎంతో ఆవేదనకు గురయ్యారు. పప్పా అలుపెరుగని కార్యకర్త. పార్టీకి ఆమె చేసిన సేవలు విశిష్టమైనవి. మరీ ముఖ్యంగా మహిళా సంఘాన్ని అభివృద్ధి చేయటంలో ఆమె చూపిన శ్రద్ధ అపూర్వమైనది. ఆమె జ్ఞాపకాలు నిరంతర స్ఫూర్తిగా మిగిలి ఉంటాయి.

**జోహార్ కామ్రేడ్ పాపా ఉమానాథ్......**

# మానవత్వం పరిమళించే మధురవాణి

-ఓల్గా

(గత సంచిక తరువాయి)

మొదటి అంకంలో పరిచయమైన ఆమె తత్వం-నీతిని పాటించటం, డబ్బు మాత్రమే ప్రధానం కాదనుకోవటం, ఆత్మగౌరవంతో నిలబడటం ఇవి నాటకమంతా పరుచుకుని నాటకాన్ని కొత్తదారుల వెంట నడిపించాయి. మధురవాణి స్త్రీ జన పక్షపాతాన్ని, సాటి స్త్రీలతో సహానుభూతిని కూడా గురజాడ మనకు హాస్య ధోరణిలో పరిచయం చేస్తాడు. పూటకూళ్ళమ్మకు చురక వేసిన మధురవాణి ఆమెను ఉట్టి చేతులతో వచ్చినవని కానీయకుండా బైటికి పంపదలచుకోలేదు. మాటలతో ఆమెను ఉడికిస్తూనే కనుసన్నలతో గిరీశం రావప్పంతులు దాగివున్నచోటును చూపించింది. పూటకూళ్ళమ్మ తననెలా చూస్తేనేం మధురవాణికేం తక్కువ? పాపం పూటకూళ్ళమ్మ-ఆమెకు ఏదో విధంగా సహాయపడకపోతే మధురవాణిలోని మానవత్వం ఊరుకుంటుందా? సమాజంలో పూటకూళ్ళమ్మకు విలువలేకపోవచ్చు గాక. మధురవాణి మంచి మనసులో పూటకూళ్ళమ్మ పరిస్థితి గురించి సానుభూతి ఉంది. ఆమెను ఈ గతికి లాగిన మర్యాదా పురుషోత్తముల మీద కోపమూ ఉంది. ఆ రెంటినీ సరసంగా నవ్వినవ్వుతూ తీర్చుకోగలిగిన అవకాశమూ వచ్చింది. ఆ అవకాశాన్ని మధురవాణి సద్వినియోగం చేసి నాటకాన్ని రక్తికట్టించింది. మొదటి అంకంలోనే స్త్రీల పరస్పర సహకారం మగవాళ్ళ దుష్టత్వాన్ని దెబ్బకొట్టగలదని మధురవాణి నిరూపించింది. స్త్రీల పరస్పర సహకారం అనేది ఆదర్శమైతే నాటకమంతా ఆచరించి చూపింది మధురవాణి. తోటి స్త్రీలకు, వారు తనకు పరిచితులైనా అపరిచితులైనా, తనను చులకనగా చూసినా, తూలనాడినా సహాయపడటాన్ని తన సహజ గుణంగా చేసుకున్న మధురవాణి ఆ సుగుణంతోనే నాటకాన్ని నడిపించింది.

మళ్ళీ తృతీయాంకంలో గాని మధురవాణి మనకు కనిపించదు. తృతీయాంకం తర్వాత ఆమె విశ్వరూపం మనకు క్రమంగా ఆవిష్కృతమవుతుంది. తృతీయాంక ప్రారంభంలోనే ఆమె రావప్పంతులు టక్కరి, మోసగాడని గ్రహిస్తుంది. వ్యక్తుల గుణగణాలెలా వున్నా ఆమె వృత్తికి అంత సంబంధం లేదుగాని రావప్పంతులు తన దగ్గర ధనం ఉందని చెప్పిన విషయం గురించి కూడా ఆమెకు సందేహం వస్తుంది. అది ఆమె జీవనానికి సంబంధించిన సమస్య. దాని గురించి ఆలోచించకపోతే మొదటికే మోసం. ఐతే



దానితో పాటు మధురవాణి లుబ్ధావధాన్లు పెళ్ళి ఆపాలని ప్రయత్నిస్తుంది. అప్పటికి కరటకశాస్త్రి వచ్చి ఆమెను తన మేనగోడలి పెళ్ళి ఆపటంలో సహాయపడాలని అర్థించలేదు. ఐనా మధురవాణి రావప్పంతులుతో లుబ్ధావధాన్లు పెళ్ళి ఆపించమని పట్టుబడుతుంది. "లుబ్ధావధాన్లకు పెళ్ళెందుకు కుదిర్చారు?" "ఆ ముసలాడికి పెళ్ళెందుకు?" "ఈ పెళ్ళి మాన్పించకపోతే నేను మీతో మాట్లాడను". ఇలా తన వ్యతిరేకతను తెలియచెబుతూ రావప్పంతులు ఎంత కథ అల్లి ఈ పెళ్ళి చేస్తున్నాడో బైటికి లాగుతుంది. మీనాక్షితో మధురవాణికి స్నేహం ఉన్న సంగతి తర్వాతి రంగంలోగాని బైటికి రాదు. బహుశా ఈ పెళ్ళి సంగతి చెప్పి ఎలాగైనా మాన్పించమని మీనాక్షి మధురవాణిని అడిగి ఉండవచ్చు. మధురవాణి స్నేహ ధర్మాన్ని పాటించి వుండవచ్చు.

బ్రాహ్మల జాతకాల్లో మోసం రావప్పంతులు నోటితోనే చెప్పిస్తుంది. "అది మోసం కాదు లౌక్యం"అనీ, "నమ్మిన చోట చేస్తే మోసం, నమ్మని చోట చేస్తే లౌక్యమని" రావప్పంతులు చెప్పినదాన్ని ఒప్పుకోకుండా

"తాను చేస్తే లౌక్యం. మరొకడుచేస్తే మోసం అనరాదా? అబద్ధానికి అర్థమేమిటి?" అని తన వివేకాన్ని, లోకజ్ఞానాన్ని ప్రదర్శిస్తుంది.

రావప్పంతులు దుర్బుద్ధిని ఊహించి అతనెందుకు ఈ పెళ్ళి తలపెట్టి ఉంటాడో చెప్తుంది. "పెళ్ళి కూతుర్ని యిలాకా చేసుకుని దానిద్వారా ముసలాడి మూటాముల్లా లాగేస్తారు. యింత సత్యకాలపు దాన్నయినా ఆ మాత్రం ఊహించుకోగల్ను. లేకపోతే నేయింత బతిమాలుకున్నా ఈ పెళ్ళి తప్పించక పోవడమేమిఁ?" రావప్పంతులు లుబ్ధావధాన్ల మూటాముల్లే లాగేస్తే మధురవాణికి ఆర్థికంగా లాభమేగాని

నష్టంలేదు. ఐన్నా ఆ పెళ్ళి తప్పించమని బతిమాలుకుంటుంది. ఎందుకు? కేవలం మానవత్వంతోనే కదా-

రావప్పంతులు లుబ్ధావధాన్ల కూతురు మీనాక్షిని గురించి చెప్పి మీనాక్షి చెడిపోకుండా కావలా కాయటానికి ఈ పెళ్ళి కూతురుంటుందని చెప్పినపుడు కూడా మీనాక్షిని వెనకేసుకొస్తుంది గానీ, అమ్మలక్కల్లాగా "అలాగా మీనాక్షి అలాంటిదా? నే ఎరగనే"అంటూ మాట్లాడదు.

"మీనాక్షి ప్రవర్తన బాగుంది కాదంటూ మీరే చెప్పాలి? మీ కంటపడ్డ ఏ ఆడదాని ప్రవర్తన తిన్నగా ఉంటుంది?" అంటూ రావప్పంతుల్ని సరసంగా చివాట్లు పెట్టి మీనాక్షిని దగ్గరకు తీసుకుంటుంది. లుబ్ధావధాన్లు పెళ్ళి తప్పించే యత్నం, మీనాక్షిమీద సానుభూతి ఈ రెండూ నాటకం చివరిదాకా మధురవాణి నిలుపుకుంది. ఈ రంగంలో కూడా డబ్బు గురించి మధురవాణి మాట్లాడుతుంది. రావప్పంతుల్ని వదిలి మరో కొమ్మ పట్టుకోవాలని నిర్ణయించుకున్నా కూడా.

"నాకు డబ్బు గడ్డిపరక. మీ భూవుఁలు రుణాక్రాంతవైఁనాయని అప్పట్లో నాకు తెలిసుంటే మీ దగ్గర రెండొందలూ పుచ్చుకుందునా? మీరు ఖర్చు వెచ్చాలు తగ్గించుకుని సంసారం బాగు చేసుకోకపోతే నేను మాత్రం వొప్పేదాన్ని కాదు. ఫలానా పంతులుగారు ఫలానా సాన్నుంచుకుని బాగుపడ్డారంటేనే నాకు ప్రతిష్ట. మా ఇంటి సాంప్రదాయం ఇది పంతులుగారు. అంతేగాని లోకంలో సాన్లమచ్చని ఊహించకండి."అంటూ తాను అందిరిలాంటి దాన్ని కాదని చెప్పింది. తన ఇంటి సాంప్రదాయాన్ని గర్వంగా చెప్పింది.తనకేది ప్రతిష్ఠో స్పష్టత ఉంది మధురవాణికి. ఆ ప్రతిష్టను చివరి దాకా నిలబెట్టుకుంది. అనేక సందర్భాలలో తనకు డబ్బు ప్రధానం కాదని తేల్చి చెప్పింది.

ఆ తర్వాత రంగంలో కరటక శాస్త్రి మధురవాణి దగ్గరకు వస్తాడు. వచ్చీరాగానే బొక్కబోర్లా పడి తలబొప్పి కట్టించుకుంటాడు. మధురవాణిని కొన్నాళ్ళు గిరీశం చేరదీశాడని ఆమె చెబితేనే విని కరటకశాస్త్రులుతన మేనల్లుడికి చదువు చెప్పే నిమిత్తం వచ్చిన గిరీశానికి పెండలాడే ఉద్వాసన చెప్పాలంటాడు.

మధురవాణి "నా దగ్గరకు వచ్చినవాడల్లా చెడిపోయినాడో? నా దగ్గరకు మీరు రాకుండా అవరోధం కలిగిందని ఇప్పుడే డిప్టీ కలెక్టరు గార్ని తిట్టారే. ఆయనకంటే మీ న్యాయం యేం బాగా ఉంది? నా దగ్గరకు వచ్చినందుకు మీ భార్యగారు ముందు మిమ్మల్ని పట్టుకుని తరమ వలసింది. తనకి రొట్టా ఒహడికి ముక్కానా''? అని కరటకశాస్త్రుల్ని కడిగేస్తుంది. చివరకు ఆడవేషంలో వున్న కరటక శాస్త్రులు శిష్యుడు మహేశంతో లుబ్ధావధాన్లు పెళ్ళి జరిపించటానికి ప్లానంతా సిద్ధమయ్యాక, మధురవాణి సిద్ధాంతికి, మీనాక్షికి డబ్బాశ చూపిస్తే సహకరిస్తారని కరటకశాస్త్రులుతో చెబుతుంది. కరటకశాస్త్రి ఉత్యుత్సాహంతో మధురవాణికి కూడా డబ్బాశ చూపించబోతాడు. మధురవాణి వెంటనే కరటకశాస్త్రుల ధోరణి ఆపి డబ్బు గురించి తన ఉద్దేశం చెబుతుంది.

"వృత్తిచేత వేశ్యని గనక చెయవలసినచోట్ల ద్రవ్యాకర్షణ చేస్తాను గాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్నా అని తలచారా? మీ తోడబుట్టుకి ప్రమాదం వచ్చినపుడు నేను డబ్బుకి ఆశిస్తానా?" ప్రతిసారీ తనను తాను నిరూపించుకోవాల్సిరావటం మధురవాణికి బాధగానూ, విసుగ్గానూ ఉండే ఉంటుంది. కానీ సమాజం దున్నపోతైనపుడు అందునా కదలని ముసలి దున్నపోతైనపుడు మధురవాణి దానిని విసుగూ విరామం లేకుండా పదేపదే పొడుస్తూ ఉండవలసిందే. సమాజాన్ని పొడిచే పని మధురవాణి విసుగులేకుండా నాటకం చివరి వరకూ చేస్తూనే ఉంది. ఆ తర్వాత రావప్పంతులు దగ్గర ఈ కరటకశాస్త్రులు, ఆ పెళ్ళి కూతురూ తనకిష్టం లేనట్టు ఎంత బాగానో నటించి దొంగ అలకలన్నీ ప్రదర్శించి రావప్పంతులు ముఖం మీద సిరాపోసి గాని శాంతించదు.

జీవితంలోని కపటత్వాన్ని కర్కశత్వాన్నీ ఎదుర్కొనటానికి మధురవాణి లేదా గురజాడ హాస్యం కంటే మించిన సాధనం లేదనుకున్నారు. రెండేదార్లు, గుండెలు పగిలేలా ఏడ్చి ఎదుటి వాళ్లను చంపటమో తను చావటమో చెయ్యాలి. లేదా 'ఔరా ఈ మనుషులు' అని వారి వెధవాయిత్వానికి నవ్వుకుంటూ వాళ్ళ వెధవాయుత్వాన్ని వాళ్ళకే తెలియజెప్పి నవ్విస్తూ, కీలెరిగి వాతలు పెడుతూ వారితో ఆడుకోవాలి. ఈ రెండు దార్లలో మధురవాణి రెండో దారి ఎంచుకున్నది. మనం గుండె పగిలేలా ఏడవాల్సిన సందర్భాల్లో కూడా పొట్ట చెక్కలయ్యేలా నవ్వించింది. చచ్చి ఏంసాధిస్తావు. నవ్వుతూ బతికి చాతుర్యంతో చెయ్యదలిచింది సాధించుకోమని చెప్పింది. తిట్టవలసిన వాళ్ళను వాళ్ళ ముఖంమీదే తిట్టింది. పైగా వాళ్ళ నీతులు వాళ్ళకే చెప్పి "ఊరందరితో హాస్యవాడితే మీరు ఒప్పరు గాబట్టి అంచేతనే కుక్కన్నా పందన్నా మిమ్మల్నే అనాలిగాని మరొకర్ని అనగూడదే" అంటూ రావప్పంతుల్ని తిట్టడం సరైందని అతని చేతనే ఒప్పిస్తుంది. ఇక ఆ రంగంలో గిరీశం ఉత్తరంతో రావప్పంతుల్ని మధురవాణి ఆడుకున్న తీరు పరమాద్భుతం, మధురవాణి నవ్వు..... ఇంకే రచయితైనా ఏ సాహిత్య ప్రక్రియలోనైనా ఇంత సహజంగా తన కథానాయిక చేత నవ్వించాడా? ఆమె నవ్వు మనకు అంటుకుని మనకు కడుపునొప్పి వచ్చేలా చేయగలిగాడా? మధురవాణి ఒక్కతే ఇంత తెలుగు సాహిత్యంలో పిసరంత కృత్రిమత్వం లేకుండా నవ్వింది. నవ్వించింది. హాస్యరసం ఈ రంగంలో పండినట్టు మరింకోచోట పండిన దాఖలా లేదు. అచ్చమైన అచ్చ తెలుగు హాస్యం. లొట్టిపిట్ట, గాడిదల పేరుతో రావప్పంతుల్ని గిరీశం ప్లెయిన్‌గా తిడితే-దానితో మధురవాణి చేసిన హాస్యం ఎంత మధురమో కదా-గాడిద ప్రస్తావన మళ్ళీ మళ్ళీ తెచ్చి నవ్విస్తుంది. విరగబడి నవ్వుతుంది. బాగా నవ్వితే ఆరోగ్యమంటారు గదా- పొద్దున్నే పార్కుల్లోకి వెళ్ళి నవ్వుతుంటారు గదా- అదేమీ అక్కర్లేదు. కన్యాశుల్కం నాటకం పక్కనుంచుకొని చతుర్థాంకం తీసి చదివితే చాలు శారీరక, మానసిక ఆరోగ్యాలన్నీ చక్కబడతాయి. మధురవాణి మంచి వైద్యురాలు. తియ్యని ముందులిచ్చి రోగాలు కుదిర్చే సొగసైన వైద్యురాలు.

పంచమాంకంలో మధురవాణి రెండు రంగాల్లో ఉంటుంది. ఒక రంగంలో పేకాట ఆడుతూ పెద్దగా మాట్లాడదు. మహేశం పెళ్ళికూతురి పాత్ర చాలించి కంటె మధురవాణికిస్తే, మహేశానికి దాసరి వేషం వేసి పంపుతుంది. ఈ లోపల ఈ కంటె కోసం రావప్పంతులు లుబ్ధావధాన్ల నడిగి, మీనాక్షిని పెళ్ళాడతానని ఆశపెట్టి మరీ కంటె ఆమాకీ ఆరాలు తీస్తాడు. ప్రయోజనం లేక ఇక మధురవాణినే బతిమాలుకుందామని బయల్దేరి వస్తాడు. మీనాక్షి పెళ్ళి చేసుకోమని వెంటపడుతుంది. మధురవాణి రామ

పుంతులు అరిచి గీపెట్టినా తలుపుతియ్యదు. మీనాక్షి గొంతువిని, రావప్పంతులు మీనాక్షిని కిందపడెయ్యటం చూసి మధురవాణి అతన్ని చీవాట్లు పెడుతుంది.

"ఆడదాని మీదనా చేయి జేసుకుంటారు? యేమి పౌరుషం? అబద్ధవాఁడక అన్నమాట నిలబెట్టుకోండి. యేం? కులం తక్కువా? రూపం తక్కువా? ఆమె బ్రతుకు భ్రష్టు చేయ్యనే చేశారు; పెళ్ళాడి తప్పుదిద్దుకోండి. ఆవిణ్ణి పెళ్ళాడి వొస్తేనే నేను తలుపు తీస్తాను".

ఇలా మనిషిని సత్యం కోసం నిలదియ్యగల పాత్ర కన్యాశుల్కంలో మరింకొకటి లేదు మధురవాణి తప్ప.

మీనాక్షి రావప్పంతులు అన్న మాటలు చెబితే ఆమెను సమర్థిస్తూ "అవస్యం పెళ్ళాడవలసిందే. పెళ్ళాడకపోతే నువ్వు మాత్రం ఊరుకుంటావూ? దావా తెస్తావు-పంతులు గారికి దావాలంటే సరదానే" అని మార్గోపదేశం చేస్తుంది. మంగళహారతి తెస్తానని లోపలికి వెళ్తుంది.

ఇక షష్టాంకంలో లుబ్ధావధాన్లను రక్షించటానికి మధురవాణి పూనుకోవాల్సిన ఘట్టం. కరటక శాస్త్రి వచ్చి ఆ పని చెయ్యమని అడుగుతాడు. దానికి మధురవాణి దగ్గరకుచేరిన కంటె ఇవ్వమని అడుగుతాడు. ఈ కంటె సౌజన్యారావు పంతులు గారికి ఇస్తే చిక్కుముడి వీడుతుందని చెబుతాడు. కంటె తిరిగి తనకు వస్తుందా అని మధురవాణి అనుమానపడటం సవహజమే. దానికి కరటక శాస్త్రులు, సౌజన్యారావు పంతులు మంచితనాన్ని గురించి, అతని సహజ స్వభావమైన పరోపకారాన్ని గురించి చెబుతాడు. మధురవాణికి ఆయనను చూడాలనిపిస్తుంది. ఆయన వేశ్యలను చూడరంటాడు కరటకశాస్త్రులు. మధురవాణి కంటె ఇవ్వటానికి సిద్ధపడి తెచ్చి యిస్తూ "వస్తువు జారిపోతేనో"అన్న మాట మీద జరిగే సంభాషణలో కరటక శాస్త్రులు అంటాడు.

"ఎంతసేపూ డబ్బు, డబ్బేనా? స్నేహం, వలపూ అనేవి ఉంటాయా"? అని. ఎన్నిసార్లు మధురవాణి స్నేహధర్మంగా సహాయం చేసినా కరటక శాస్త్రికి బుద్ధిరాదు. -ఐనా ఓపికగా తన పరిస్థితి వివరిస్తుంది మధురవాణి.

"స్నేహం మీలాటి వారి చోట; అందుచేతనే కష్టపడి ఆర్జించిన కంటె మీపాలు చేస్తున్నాను. మా తల్లి చూస్తే భవిష్యం ఉంచునా? యిక వలపో? బతుకనేది వుంటే వలపు వన్నె తెస్తుంది. అంగడివాడికి మిఠాయి మీద ఆశా, సానిదానికి వలపూ మనసులోనే మణగాలి; కొద్దికాలం వుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మా కులానికి వలపు ఒక్కచోటే...."

"బంగారం మీద. శృంగారం వన్నె చెడిన దగ్గిర నుంచి, బంగారం గదా తేటు తేవాలి. ఆ బంగారం మీకు ధారపోస్తూ ఉన్నపుడు నా స్నేహం ఎన్ననేల?" అని సహనంతో, సామరస్యంతో, స్పష్టతతో కరటక శాస్త్రికి బోధించినట్లు చెబుతుంది. ఐనా కరటకశాస్త్రికి బుద్ధిరాలేదు. మధురవాణి మళ్ళీ సౌజన్యారావు పంతులుని చూడాలని వుందంటే ఆ సహాయం మటుకు చెయ్యలేనంటాడు.

మధురవాణిని తీసికెళ్తే "నిన్నూ నన్నూ ఇంట్లోంచి కఱ్ఱపుచ్చుకుంటాడు" అంటాడు.

మధురవాణికి ఇంక సహనం పోతుంది. తన సహేతుకమైన కోపం, ప్రశ్నించే తత్వం బైటికి వస్తాయి. తన సహాయం తీసుకుంటూ తనను నీచంగా చూసే వారిని సహించని ఆత్మగౌరవం ఆమెలోంచి పెల్లుబికి వస్తుంది. కరటక శాస్త్రికి వడ్డించాల్సినవి వడ్డిస్తుంది. ద్వంద్వ నీతిని ప్రశ్నిస్తుంది.

"కొత్త సంగతి వకటి యీనాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నెతెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారి వంటి కుక్కల పొత్తుకే తగివున్నది గాని, సౌజన్యారావు పంతులు వంటి సత్పురుషులను చూడడముకైనా అర్హత కలిగి వుండలేదు.... తమ లాంటి పండితోత్తములు మాత్రం కార్యవసరత కలిగినప్పుడు ఊరూ వాడా వెతికి, మధురవాణి దగ్గర లాచారీ పడవచ్చును".

ఇంత కడిగినా కరటక శాస్త్రి మనసులో మాలిన్యం పోదు. మధురవాణిని వేశ్యగా తప్ప మనిషిగా చూడని అమానుషత్వం వదలడు. డిప్టీ కలెక్టర్ మధురవాణి అంటే మనసు పడుతున్నాడు గాబట్టి అతన్ని వలలో వేసుకుని ఈ కేసు నుంచి తప్పించమంటాడు. మధురవాణి దానికి ఒప్పుకోదు. "యిటుపైని పూరకుక్కలనూ, సీమ కుక్కలనూ దూరంగా ఉంచటానికి ఆలోచిస్తున్నాను" అంటుంది.

ఐనా కరటక శాస్త్రి తన ప్రాణం కాపాడుకోవటానికి మధురవాణిని ఎంత అవమానించటానికైనా సిద్ధంగా ఉన్నాడు. డిప్టీ కలెక్టరు దగ్గరకు తన పని కోసం పోననేసరికి, డిప్టికలెక్టరు "హెడ్డు కనిస్టేబు పాటి చేశాడు కాదా?" అని వంకర మాట మాట్లాడుతాడు. మధురవాణి మండిపోతుంది.

"పట్నం వదిలి పల్లెటూరు రాగానే మీ దృష్టిలో పలచనైతినేమో? హెడ్డును నౌఖరులా తిప్పుకున్నాను గాని అధికం లేదే? ఆ నాలుగు రోజులూ సర్కారు కొలువు మాని అతడు నా కొలువు చేశాడు. అతడి సాయం లేకపోతే, మీరు ఆ ఊరి పొలిమేర దాటుదురా? యీ దాసరి దాటునా? లోకం అంతా యేమి స్వప్రయోజనపరులూ" అని లోకానికీ తనకూ ఉన్న తేడాను చెప్పకుండానే చెబుతుంది. ఇంత చెప్పినా ఎలాగైనా డిప్టీ కలెక్టరుని చూడమనే మాట మానడు కరటకశాస్త్రి. 'సౌజన్యారావు పంతులు ఈ మాట వింటే సంతోషిస్తారు కాబోలన్నా" అతను పట్టించరకోడు. కంటె యిచ్చేసి ఒక్కసారి డిప్టీ కలక్టర్ని చూడమనే పాటే పాడుతాడు. భరించలేని మధురవాణి అతన్నిక వెళ్ళమని అంటుంది.

"ఇక విజయం చెయ్యి"మంటూ వెళ్ళిపొమ్మని చేతితో సంజ్ఞ చేస్తుంది. గెట్ అవుట్ అన్నదన్నమాట.

భార్యల లైంగికత్వాన్ని కంట్రోలు చేసినట్లు వేశ్యల లైంగికత్వాన్ని చెయ్యలేరు గాబట్టి కరటక శాస్త్రికి వెళ్ళక తప్పదు. "గెట్అవుట్" అన్న తర్వాత ఊరుకోవచ్చు గదా-వెళ్ళనివ్వవచ్చుగదా. మధురవాణిలోని మానవత్వ అలా చెయ్యనివ్వదు. వెళ్ళే మనిషిని వెనక్కు పిలిచి చెప్పవలసినవి చెబుతుంది. కరటకశాస్త్రులి శిష్యుడిని గురించి జాగ్రత్తలు చెప్పి కరటక శాస్త్రులకు పెట్టవలసిన వాటిలో మిగిలినవి వుంటే అవి కూడా తినిపించిగాని పంపించదు. అంతకుముందే కరటక శాస్త్రుల్ని పందికొక్కు అననే అన్నది. ఇప్పుడిక "బ్రహ్మలలో ఉపదేశం లావు, ఆచరణ తక్కువా?" బ్రాహ్మలు కాగానే, దేవుడి కంట్లో బుగ్గిపొయ్యలేరు అనుకుంటాను" "చిత్ర గుప్తుడికి లంచం ఇవ్వగలరా? అతడి దగ్గరికి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపు పెట్టించడానికి వీలువుండదు కాబోలు' అనేసరికి ఇక మళ్ళీ గెట్అవుట్ అని చెప్పకుండానే కరటక శాస్త్రులు వెళ్ళొస్తానని చెప్తాడు.

మధురవాణి మళ్ళీ విరగబడి నవ్వుతుంది. ఈ పిచ్చిబ్రాహ్మల అల్పత్వాన్ని చూసి అసహ్యించుకోకుండా నవ్వగలిగిన ధీరత్వం మధురవాణికి ఎక్కడి నుంచి వచ్చింది అని మనం ఆశ్చర్యపోతాం.

కరటక శాస్త్రి "తలవాయగొట్టింది" అనుకుంటూ వెళ్ళిపోతాడు.

అందరి సంగతులూ చూసిన మధుర వాణికి ఇక సౌజన్యారావు పంతులే మిగిలాడు. సాహసానికి, బుద్ధిచాతుర్యానికి తక్కువలేదు. ఇకం ఆగటం దేనికి? సరాసరి సౌజన్యారావు పంతులు ఇంటికి మారువేషంలో వెళ్ళిన మనిషి ఆయన్ని నాటిగా రంగంలోకి దింపింది. ఆయన యాంటీనాచ్ అని స్వయంగా ఆయన చేత చెప్పించాక "వేశ్యలను పాటకు పిలవకపోతే వాళ్ళు బతకటం యెలాగండి" అని అడిగింది. ఎంతమందో ఆ కులపు స్త్రీలు వీరేశలింగం గారినీ, వెంకటరత్నం నాయుడుగారినీ అడగాలను కున్న ప్రశ్నని మధురవాణి అడిగేసింది. బెంగుళూరు నాగరత్నమ్మ, జెట్టి తాయమ్మల వంటి దేవదాసీలు తరువాత కాలంలో రాజకీయ చర్చగా మొదలుపెట్టిన ప్రశ్నను మధురవాణి ముందుగానే అడిగింది. సౌజన్యారావు పంతులు "పెళ్ళి చేసుకుంటే సరి" అన్నాడుగానీ గిరీశం గారి లాంటి వారిని పెళ్ళాడాలా అని మధురవాణి అడిగితే "రేపో నేడో ఆయన ఒక పవిత్రమైన వితంతువును పెళ్ళికానై యున్నారు గదా, వేశ్యను పెళ్ళాడతారా" అని మందలించబోయాడు. పైగా "గిరీశంగారు లాంటి గొప్పవారు అట్టి అపవిత్రమైన పనికి ఇయ్యకొనరు" అని కూడా అని తనంత తాను చిక్కుముడిలో యిరుక్కున్నాడు. ఎవరినైనా ఇరుకున పెట్టి నవ్వుకోందే మధురవాణి ఊరుకుంటుందా?

గొప్పవాళ్లు వేశ్యలను ఛీ అని తిరస్కరిస్తే పెళ్ళి చేసుకోవాలనుకున్న వేశ్యలకు కోరదగిన వరులు దొరకటం ఎలా? ఎవరైనా సరే అని ఏ పనికి మాలినవాడినైనా చేసుకోవాల్సిం దేనా?

వీరేశలింగం గారు చేయించిన వితంతు వివాహాలకే ఈ ఛాయిస్ లేదు. దానిమీద గురజాడ, చలంలు తర్వాతి కాలంలో విమర్శ పెట్టారు. అంతగొప్ప కార్యానికి పూనుకున్న మహానుభావుడి మీద విమర్శ-తప్పదు. విమర్శ లేనిదే ముందుకి పోలేం. వీరేశలింగంగారి మీద ఎంత గౌరవమున్నా గురజాడ విమర్శను తీసుకోలేకపోతే వితంతువులకీ, వేశ్యలకూ మరో రొంపి తప్ప చక్కని బాట దొరకదు.

సౌజన్యారావు పంతులు తన అశక్తతను ఒప్పుకోక తప్పలేదు. "యీ సంగతి ఇంకా నేను బాగా ఆలోచించలేదు- వేశ్యలు విద్యలు నేర్చి ఇతర వృత్తుల వల్ల సత్కాలక్షేపము చెయ్యరాదా? అని తప్పించుకో బొయ్యాడు. మధురవాణి అలా తప్పించుకోనిస్తుందా? "అలా చేస్తే తమ వంటివారు వాళ్ళని వివాహమవుదురా?'' అని నాటిగా అడిగేసింది. డొంకతిరుగుళ్ళు దొంగదారులు సంసారులకు గానీ మధురవాణి వంటి వారికి తెలియవు. ఇంకా సూటిగా వేశ్యజాతి చెడ్డ కావచ్చును, గాని తాము సెలవిచ్చినట్లు చెడ్డలో మంచి వుండకూడదా? మంచి ఎక్కడ వున్నా గ్రాహ్యం కాదా? అని అడిగితే ఏం చెబుతాడు పాపం సౌజన్యారావు పంతులు? మంచి ఎక్కడున్నా గ్రాహ్యమేనని మాట మార్చి ఆమె వచ్చిన పనేమిటని అడిగాడు.

మధురవాణి లుబ్ధావధాన్లు కేసులో సహాయం చెయ్యగలిగిన వ్యక్తి ఒక వేశ్య అనీ, సహాయానికి ప్రతిఫలంగా పంతులుగారినే కోరుతోందని చెప్పింది. సౌజన్యారావు పంతులు పావం చిక్కులో పడ్డాడు. "మన్మధుడిననా నన్ను వలచింది"? అంటే మధురవాణి "మీరు మంచివాళ్ళని" కావచ్చు అంటుంది.

సౌజన్యారావు పంతులు ఈ లోకమంత రూఢీగా చెప్తాడు "సానిదానికి మంచితో పని వుండదు" అని. జీవితాన్ని నలుపు తెలుపులుగా మాత్రమే చూడగలిగిన సంస్కర్తల మాటే ఆయన నోట వచ్చింది.

తర్వాత ఆయనతో కాసేపు మాటలాట ఆడి మధురవాణి తన నిజస్వరూపం చూపిస్తుంది. ఆయన కోపానికి భయపడక "చెడ్డలో కూడా మంచి ఉండొచ్చు- కాక మంచి చెడ్డలు ఎంచెవారెవరు?" అని ఎంతో విలువైన మాట మాట్లాడుతుంది.

రాత్రివేళ వేశ్య తన ఇంట్లో అందునా వడకటింట్లో వుందనే గాభరా తప్ప సౌజన్యారావు పంతులుకు ఈ విలువైన మాటలు మననుకెక్కలేదు. చివరికి తెరిపినపడి లుబ్ధావధాన్లకు సహాయపడమంటే, కనీసం ముద్దన్నా లేనిదే తనవల్ల పని జరగదంటుంది. వెయ్యి రూపాయలిస్తానన్నా కాదని ముద్దు కావాలనే మధురవాణి సౌజన్యారావు పంతులుకి అర్థమే కాదు. బహుచిత్రంగా తోస్తుంది. చేసేదిలేక ఒప్పుకుంటాడు.

మధురవాణి రహస్యం మూట విప్పుతుంది. మహేశమే లుబ్ధావధాన్లు పెళ్ళాడిన పిల్ల అనీ, కరటక శాస్త్రులే గుంటూరు శాస్త్రులనీ-రహస్యం విప్పి పబ్లిగ్గా ఫీజడుగుతుంది.

అప్పటికి సౌజన్యారావు పంతులు కొంచెం మనిషవుతాడు. సంస్కర్తననే అహంభావం- తనకు తెలియకుండానే తనలో వచ్చికూచున్న అహంభావం- మధురవాణి మానవత్వం ముందు తలవంచుతుంది.

"నీవు సొగసరివి. ముద్దు చేదని కాదు. వ్రతభంగం కదా అని దిగులు' అని సాదాసీదా మనిషిలా మాట్లాడతాడు. ముద్దు పెట్టుకోవటానికి ముందుకు వంగి సిద్ధమవుతాడు. అప్పటికే "నువ్వు ఏ తగవెలా తీర్చమంటే అలాగే చేస్తానని భయంగా ఉందని" మధురవాణిలోని సామర్థ్యాన్ని గుర్తించక తప్పలేదాయనకు.

కానీ మధురవాణి ఆత్మగౌరవం ముందు అందరూ తలవంచాల్సిందే. ముద్దు వద్దని తిరస్కరించే ఛాయిస్ తాను తీసుకుని సౌజన్యారావు పంతులు మీద విజయం సాధించింది. అది మన మామూలు దృష్టికి కనిపించే విషయం. మధురవాణి కాక మరొకరైతే ముద్దు పెట్టుకోనిచ్చే వారేమో. మధురవాణి గుండె మరింత గట్టిది. లోతైనది. తనంటే ఇష్టమో, ప్రేమో, గౌరవమో, లేకుండా, తన కుల వృత్తిని అసహ్యించుకునే సౌజన్యారావు పంతులిని ముద్దుపెట్టుకోవటం తనకు మాత్రం ఏం గౌరవం? తన తెలివైన మాటలకూ, తను చేసే సహాయానికీ లొంగాడు గాని సౌజన్యారావు పంతులు తన వృత్తిని గౌరవించడని తెలియనంత అమాయకురాలు కాదు మధురవాణి. అందువల్ల ఆ ముద్దుకు సౌజన్యారావు పంతులు అంగీకరించటమే తన గెలుపుకు గుర్తుగా తలచి తన ఆత్మగౌరవాన్ని కాపాడుకుంది. ఐతే తన ఆత్మ గౌరవాన్ని కాపాడుకునే ప్రయత్నంలో ఇతరులను అవమానించే అహంకారి కాదు మధురవాణి. గిరీశాన్నీ, రామప్పంతుల్నీ కూడా మన్నించిన ఆమె సౌజన్యారావు పంతులు పట్ల తన తిరస్కారాన్ని మోటుగా ప్రదర్శించి ఆయనను అవమానించదు., "చెడని వారిని చెడగొట్టవద్దంది నా తల్లి" అని చెప్పి మంచి తన దగ్గరే ఉంచుకుని సౌజన్యారావు పంతులు విశ్వసించే పవిత్రతను ఆయనకే మిగిల్చింది. సౌజన్యారావు దృష్టిలో ఆయనకు మహోపకారం చేసింది. ఈ సన్నివేశం చదువుతుంటే ఆమె ఔన్నత్యాన్ని చూసి ఆనందంతో, ఆమె ఆత్మగౌరవానికి అబ్బురంతో కళ్ళవెంట నీళ్ళొస్తాయి. మధురవాణి పాదాలకు యావత్తు మానవజాతీ నమస్కరించాల్సిన క్షణాలవి. ఆమె మీద ప్రేమతో హృదయం పులకిస్తుంది. అంత గొప్పగా మధురవాణి పాత్రను తీర్చిదిద్దిన గురజాడపట్ల మన మనస్సుల్లో గొప్ప గౌరవం కలుగుతుంది.

(చివరి భాగం వచ్చే సంచికలో)

# తిరగబడిన తరిగొండ వెంగమాంబ

- వేములపల్లి సత్యవతి

2010వ సంవత్సరంలో కామన్వెల్త్ క్రీడోత్సవాలు జరిగినవి. వివిధ దేశాల క్రీడాకారులు, క్రీడాకారిణులు పాల్గొన్నారు. మనదేశపు క్రీడాకారులు, క్రీడాకారిణులు కూడా పాల్గొన్నారు. స్వర్ణ, రజిత, కాంస్య పతకాలు సాధించి భారతదేశాన్ని (అయిదవ స్థానమని గుర్తు) గుర్తింపుదిశలో నిలబెట్టారు. ఈ క్రీడల్లో హిమాచలప్రదేశ్‌కి చెందిన ముగ్గురు యువతులు (17నుంచి 20సంవత్సరాలలోపువారె) స్వర్ణ పతక విజేతలుగా నిలిచారు. వారిని పలకరించి వారి మనోభావాలను తెలుసుకోవటానికి పత్రికా విలేఖరులు వారి దగ్గరకెళ్ళారు. ఆ యువతులు తమ అభిప్రాయాలను వెల్లడించారు. అన్ని రంగాలలోను చదువులోను, ఉద్యోగాలలోను పురోగతిని సాధించినా పెండ్లి దగ్గరకొచ్చేసరికి తాము అస్వతంత్రులమని తెలియ జేశారు. తండ్రి కుదిర్చిన అతనినే కట్టుకోవలసిన పరిస్థితులు నేటికీ తమ సమాజంలో బలంగా వున్నాయిని నిట్టూర్చారు. అదే విషయాన్ని విలేఖరులు యువతుల తండ్రులను ప్రశ్నించారు. తండ్రులు చెప్పిన సమాధానం - ఎంతచదివినా, కోట్ల రూపాయలు సంపాదించినా సంఘ కట్టుబాట్లను దాటి ప్రేమ వివాహాలని, వర్ణాంతర వివాహాలని అమ్మాయిలు చేసుకుంటామంటే సహించేదిలేదని, ఒకవేళ వాటిని జవదాటితే వారిని కన్న తండ్రే కడతేర్చటానికి ఏమాత్రము సంకోచించమని తెగవేసి చెప్పారు. ఆవిధంగా చేసుకున్న ప్రేమికులను గౌరవహత్యల పేరుతో వెంటాడి కన్నవారు, బంధువులు హతమార్చే వార్తలను మనము పత్రికలలో చదువుతూనే వున్నాము.

21వ శతాబ్దములోనే యువతుల పరిస్థితి ఇలావుంటే భక్త మీరాబాయి కాలంనాటి, 12వ శతాబ్దంనాటి అక్కమహాదేవి, 17వ శతాబ్దికి చెందిన తరిగొండ వెంగమాంబ కాలంలో సమాజంలో స్త్రీల స్థితి గతులు ఎలా వుండేవి? ఊహకందని విషయం. అన్ని కాలాలలోను తమకిష్టములేని వివాహాలు చేసుకోవటాన్ని వ్యతిరేకించిన వారున్నారు. సమాజపు కట్టుబాట్లను అధిగమించటానికి వారికనువైన మార్గాలను ఎంచుకున్నారు. వారిని గురించి తెలుసుకోవటానికి మనం ఆనాటి యుగధర్మాన్ని, దేశకాల పరిస్థితులను, సామాజికి కట్టుబాట్లను, ఆచార వ్యవహారాలను దృష్టిలో వుంచుకోవాలి. భక్తి కవిత్వ సాహిత్య సరస్వతికి కంఠాభరణాలుగా నిలచిన ముగ్గురు కవయిత్రులను గురించి తెలుసుకుందాం.

మీరా రాజవంశీకురాలు. చిన్న నాటినుండి కృష్ణభక్తురాలు. నారాయణుడే నాభర్తయని చాటిచెప్పింది. ఆమెవివాహం రాజవంశానికి చెందిన రాణాతో జరిగింది. అయినా ఆమెలో ఇసుమంత మార్పురాలేదు. రాణా కోపించి జైలులో పెట్టించాడు. కృష్ణునిమీద ఎనలేని భక్తిగీతాలు రచించింది. హిందీ పద్యసాహిత్య జగత్తులో కలికితురాయిగా నేటివరకు నిలచివుంది. అక్కమహాదేవి నేటి కర్నాటక రాష్ట్రంలో జన్మించింది. పన్నెండవ శతాబ్దానికి చెందినామె. శివభక్తులలో శైవులు, వీరశైవులు అనిరెండు రకాలవారున్నారు. అక్కమహాదేవి వీరశైవంలో భక్తి సాహిత్య సృష్టికర్తల్లో ప్రసిద్ధి చెందిన కవయిత్రిగా పేరు చెందింది. మల్లికార్జున స్వామిని భర్తగా భావించింది. శ్రీశైలంవచ్చి జీవితాంతము అక్కడే గడిపింది. శ్రీశైలంలో ఆమె ధ్యానం చేసిన గుహలు అక్కమహాదేవి గుహలుగా నేటికి పిలువబడుచున్నవి. వీరశైవంలో భక్తిసాహిత్యాన్ని ఉన్నతస్థానానికి చేర్చిన ఖ్యాతి ఆమెకు దక్కింది. కన్నడ భాషలో నేటికి అక్కమహాదేవిగీతాలు పాడుకుంటుంటారు.

పైన పేర్కొనిన యిరువురుకన్న తరిగొండ వెంగమాంబ విశిష్టమైన జీవితం. భిన్నమైన భక్తురాలు. 17వ శతాబ్దంలో జన్మించింది. ఆనాటి ముక్కుపచ్చలారని బాలవితంతువుల మీద జరిగే దుష్ట దురాచారాలకు ఎదురు తిరిగింది. ఆకాలంలో కావ్యాలు, కవిత్వాలు రాసేది పురుషులయి నందున (చాలాఎక్కువమంది) అలాంటి మహాభక్తులను గురించి రాసేవారు కాదనుకుంటా. ఇష్టమయిన దానిని పొందాలను కున్న, యిష్టములేనిదానిని వద్దనుకున్న కష్టపడవలసివస్తుంది. ఆమార్గంలో పయనిం చటం వలన అనేకరకాల ఆటంకాలను, అవరోధాలను ఎదుర్కొనవలసి వస్తుంది. వాటన్నింటిని అధిగమించి గమ్యం చేరిన ధీర, వీరవనిత తరిగొండ వెంగమాంబ. 1730లో చిత్తూరు జిల్లాలో తరిగొండ గ్రామంలో పుట్టింది. తండ్రి కృష్ణయార్యుడు, తల్లి మంగమాంబ చిన్నతనం నుంచే ఆమెకు వెంకటేశ్వరస్వామి మీద అచంచలమైన భక్తిభావం ఏర్పడింది. భక్తితో తన్మయత్వంలో మునిగిన తనయను చూచి తల్లితండ్రి కలవరపడ్డారు. కలత చెందారు. పెండ్లి చేస్తే అన్ని సర్దుకుని చక్కబడతవని తలచారు. నారగుంటపాలెం గ్రామవాసి వెంకటాచలపతితో వివాహం జరిగింది. అతవారింట అడుగిడిన వెంగమాంబ తనను జీవిత సహచరిణిగా కాకుండ దైవభక్తురాలుగా మన్నించమని భర్తని వేడుకుంటుంది. ఆతర్వాత కొద్దికాలానికే ఆమె భర్త అకాలమరణానికి గురయ్యాడు. సమాజంలో భర్త చనిపోయినపుడు పరిపాటిగా వస్తూవున్న ఆచారాలు, సాంప్రదాయాల ప్రకారం ఆమెను విధవను చేసేతంతు మొదలయ్యింది. పెండ్లిలో కట్టిన పుస్తె, నల్లపూసలు, కాళ్ల మట్టెలతో పాటు చిన్ననాటినుంచి పెట్టుకుంటున్న బొట్టు, కాళ్లకు పూచుకునే పసుపు, చేతులకు వేసుకొనేగాజులు, తలలోపెట్టుకునే పూలకు ముక్కుపచ్చలారని బాలవితంతువులు దూరం చేయబడతారు. బ్రహ్మణులలో వీటితో పాటు శిరోముండనము కూడా వుండేది. (తలమీద వెంట్రుకలను తొలగించి గుండుచేయటం వుండేది) అవన్ని తీసివేయటానికి, శిరోముండనం చేయించుకోనని వెంగమాంబ ఎదురు తిరిగింది. తల్లితండ్రులు, బంధుజనం నచ్చచెప్ప చూశారు. గ్రామంలోని పెద్దలు ప్రయత్నించారు. ఎవరిమాట వినలేదు. అందరూ విసిగి వేసారి పుష్పగిరి పీఠాధిపతిని రప్పించారు. స్వాములవారు వైధవ్య చిహ్నాలను ధరించటానికి ఎందుకు అంగీకరించవని ప్రశ్నించారు. శిరోముండనం చేయించుకోవటం పాతివ్రత్యం ఎలా అవుతుంది? "తలలు బోడులయితే తలపులు బోడులవుతాయా?" అని ఎదురు ప్రశ్నవేస్తుంది. నాభర్త వెంకటేశ్వరస్వామి. నేనెలా విధవనవుతానని అడుగుతుంది. చేసేది లేక స్వాముల వారు వెనుతిరిగి వెళ్లిపోతారు.

ఆనాటి సమాజంలో ఎవరిముందు తలవంచని ఆమె వ్యక్తిత్వం మేరు పర్వతంలాంటిదని చెప్పవచ్చు. తల్లి దండ్రులు, బంధుజనులు ఆమెను వెలివేస్తారు. ఆ వూరిలోనే వున్న నృసింహస్వామి దేవాలయంలో వుంటూ ధ్యానంలో నిమగ్నమవుతుంది. అక్కడ కూడా ప్రశాంతంగా వుండనీయరు. కన్నవారే కాదని తరిమి వేస్తే మిగతావారు వూరుకుంటారా? సాటి కులం వారి వేధింపులు మొదలయినవి. హేళనలు, ఎత్తిపొడుపులు, తూలనాడటాలు మొదలయినవి. యువకుల అపహాస్యాలు తోడయినవి. తీవ్రమైన మానసిక వ్యధకు, అశాంతికి గురవుతుంది. చివరకు అక్కడ వుండలేక తిరుమలకు చేరుతుంది. వెంటేశ్వరసామిని తన నాధునిగా తలచి జీవితమంతా అక్కడే ధ్యానంలో గడిపింది. తిరుమలలో తాళ్ళపాక పెద్ద తిరుమాలాచార్యుల

వంశస్తులు ఉత్తరమాడ వీధిలో ఆమె వుండటానికి చిన్నపాటి యిల్లు యిచ్చారు. అందులో వుంటూ దగ్గరలో వున్న ఖాళీ స్థలంలో తులసివనాన్ని పెంచింది. నేటికి ఆ వనం తిరుమలలో వెంగమాంబ బృందావనమని, తరిగొండను తోట అని పిలవబడుచున్నది. 1817లో చనిపోయేవరకు అక్కడే వుంది. వెంగమాంబ కవయిత్రి. భక్త మీరా, అక్కడ మహాదేవిలాగ కేవలం భక్తి గీతాలే రాయలేదు. శతకాలు, ద్విపదలు రచించింది. అనేక సాహిత్య ప్రక్రియలను చేపట్టింది. కావ్యం, గీతం, యక్షగానాలకు శ్రీకారం చుట్టింది. చెంచు నాటక యక్షగానాన్ని రాసింది. ఆ నాటకంలో చెంచుల వాస్తవిక జీవన విధానాలను తేటతెల్లంగా తెలియపరిచింది. చెంచు నాయుడి పాత్ర ద్వారా సమాజంలో నిరాఘాటంగా సాగుచున్న పురుషాధిక్యతను చాటిచెప్పింది. ఆమె రచనలలో 'చెంచు నాటక యక్షగానం' బాగా ప్రసిద్ధిపొందింది. ఆమె సృజనాత్మకతకు ఈ నాటకం చక్కని ఉదాహరణగా పేర్కొనబడింది. యోగినిగా, అచంచలమైన భక్తురాలుగా, సాహిత్యవేత్తగా, విదుషీమణిగా తెలుగు కవయిత్రులలో తనకంటూ ఒక ప్రత్యేకమైన విశిష్ట స్థానాన్ని సంపాదించుకుంది. బాల వితంతువయిన వెంగమాంబ వైధవ్య చిహ్నాలను తిరస్కరించి యవ్వనంలోకి అడుగిడిన నాటి నుంచి అనేక రకములైన కష్టాలను చవిచూచింది. యువకుల నుండి వేధింపులకు గురయింది. భక్తురాలయిన తర్వాత కూడా దేవాలయ పూజారుల ఆక్షేపణలు, అపహాస్యాలు అనుక్షణం ఆమెను వెంటాడాయి. పూజారుల వికృత చేష్టలను, యువకుల వేధింపులను, సమాజంలో చెలామణి అయ్యే పురుషాధిక్యతను ఆమె మరిచిపోలేదు. ఇవన్నీ ఆమె మనసుకు మాయని గాయాలయినవి. వాటన్నిటిని ఆమె నిర్భయంగా, నిస్సంకోచంగా చెంచు నాయుడి పాత్రద్వారా ఏకిపారేసింది. ఒక విధంగా ఆకాలంనాటి సంఘ సంస్కర్త వెంగమాంబని చెప్పటంలో అతిశయోక్తి లేదనుకుంటా. గొల్లకలాపం వెంగమాంబ రచనే. పూర్తిగా వేదాంత పరమైనది. గొల్లభామకి, బ్రాహ్మణునికి మధ్య జరిగిన సంవాదమే గొల్లకలాపం. బ్రహ్మ జ్ఞానం పొందాలంటే ఏమి చేయాలో చెప్పటంతోపాటు పిండోత్పత్తి శాస్త్రం కూడా ఈ కాలంలో వుంది. దీనిని అభ్యసించటానికి అయిదు సంవత్సరాలు కఠోర సాధన చేయాలని, దీనిని ఆడటానికి ఎంతో కష్టంతోపాటు సహనం కూడా అవసరమని అంటారు. ఇప్పుడీ కళ కనుమరుగయిందనే చెప్పవచ్చు.



## 2010 డైరీ

**ఇది ఒక కవిత కాదు. 2010వ సంవత్సరంలో జరిగిన కొన్ని ఘట్టాల పునరావలోకనం.**

నా బెడ్ రూంలోని గోడపై ఒక శిశువు అడుగుపెట్టడం నాకింకా గుర్తుంది. అది జనవరిలో 2010 కాలెండరు. అప్పటి నుండి మనం ఎన్నెన్ని సంఘటనలు చూశాము!

రోశయ్య యుఎస్ఎకు సారథ్యం వహించడం చూశాము(యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఆంధ్రాకు)

ప్రతీక్షణం మేడమ్ గారి అంగీకారానికి నిరీక్షించడం చూశాము.

తాత కావాలని ఎదురు చూసిన 'పా'ను వీక్షించాము.

క్రికెట్ వేగుచుక్క ధోనీ మరియు వివేక్‌లు బ్రహ్మచారుల జాబితా నుండి వెళ్ళి పోవడం చూశాము.

కేంద్రం కష్టించి పనిచేసిన కార్మికుల జీతాలు పెంచింది. ధరలు కూడా ఆకాశానికి (ఎన్నో రెట్లు) పెంచింది.

తరువాత రాబోయే కుంభకోణం ఏది? అది ఏ యం.పి.ది

కామ్రేడ్ జ్యోతిబసు అంతిమయాత్రతో వెళ్ళిపోయారు.

రోశయ్య అలసిపోయి విశ్రాంతిలోకి వెళ్ళగా కిరణ్ కుమార్ రెడ్డి అధికారానికి వచ్చారు.

ప్రజలచేత, ప్రజల యొక్క ప్రజల కొరకు ఉన్న దాన్ని ప్రజాస్వామ్యం అంటారు

కానీ, ఈ రాజకీయ వేత్తలు ప్రజలను కొని, ప్రజలకు వ్యతిరేకంగా పనిచేసి, ప్రజలకు దూరంగా ఉండి 2000 రకాల "2జి"లు తొందర్లో చేస్తారని నాకు ఖచ్చితంగా తెలుసు.

సైనా నెహ్వాల్ మూడవ ర్యాంకుకు చేరుకుంది.

మధ్యలో మన దైనందిన అవిశ్రాంత గమనంలో తెలంగాణా యోధుడు కె.సి.ఆర్. మరియు రైతు మిత్రుడు నాయుడుల నటనలు చూశాము. వారాంతాల్లో వాటిల్లోని లొసుగులను చూశాము.

పెట్రోలు మండడం, ఆహార వస్తువుల ధరలు నింగికెగబాకడం చూశాము.

న్యూఏజ్ వాహనాలు రోడ్లెక్కడం, కూరగాయల కనుమరుగవడంచూశాము.

కార్పొరేట్లకు మెరుపులు, రైతులకు రోదనలు.

ఈ మధ్య భారతీయ జలాల్లో షార్క్ జాతులకు సంబంధించిన "మస్టిలస్ మాంగ్‌లో రెన్సిస్" అనే చేప జాతి కనిపించింది.

మహిళా బిల్లు ఎట్టకేలకు రాజ్యసభ ఆమోదం పొందింది.

కామన్‌వెల్త్ గేమ్స్‌కు ఆతిథ్యం ఇవ్వడం ద్వారా తాను స్కాముల్లోనూ గేముల్లోనూ దేనిలోనూ తక్కువ కాదని భారత్ మరోసారి నిరూపించుకుంది.

జనాభా లెక్కలు ఒక బిలియన్ చూపిస్తున్నాయి. కాని భారత్ ఇంకా లెక్కిస్తూనే ఉంది. ఏమిటో ఊహించండి! భారత్-పాకిస్తాన్ సంబంధాలను బలపరచడానికి సానియా షోయబ్‌లు ఒకటయ్యారు. ఎంత ఆనందం!!

ప్రతి వర్ధంతి ముందు మొదలవుతున్న ఓదార్పు యాత్రలు మనకున్నాయి.

లోకేష్(నాయుడి వారసుడు) రాజకీయాల్లోకి అడుగుపెట్టే వరకూ రైతు యాత్రలుంటాయి.

నీరా రాడియా కార్పొరేట్ లాబీయింగ్ మనం రుచి చూశాము.

పెదరర్‌కు కవలలు పుట్టారు

వణికించే చలిని పుట్టించిన చలికాలాన్ని మర్చిపోలేము.

ఒక సామెతలాగా మనం చేసే పనిని బట్టే ప్రతిఫలం వుంటుంది. విత్తును బట్టే పంట వుంటుంది.

ఇది నాకు రాజ్‌కపూర్ సినిమాలోని ప్రముఖ పాటను గుర్తు చేస్తుంది.

ఓ బాబూ! కొంచెం చూసి నడువు

"ఏ భాయ్ జర దేఖ్‌కే చలో"

నాకు కొంతమంది కొత్త స్నేహితులు దొరికారు.

వారు దొరకడం నాకు సంతోషమని నేను చెప్పదలచుకున్నాను.

ఈ రాష్ట్రం విడిపోయినా మన స్నేహం వీడకూడదనేది క్రొత్త సం॥లో నా తీర్మానం. ఖచ్చితంగా ఇది పాటించాల్సినది.

మనం కొన్ని విషయాలను తీర్మానించుకుని వచ్చే సం॥ ఆదే రోజు అదే టైంకు వాటిని తిరిగి చూడాలి. కానీ అవన్నీ నెరవేరి ఉండాలి.

బి. మైత్రి ( కాబోయే డాక్టర్)

# బాలల హక్కులు- అభివృద్ధి, ఆడ శిశువుల మీద విశ్లేషణ

## ఐద్వా 9వ జాతీయ మహాసభల కమిషన్ పేపర్ (కాన్పూర్)



**2001** జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో 18 సం॥ల లోపు పిల్లలు 426 మిలియన్లు ఉన్నారు. దీనిలో 110 మిలియన్లు 5 సం॥ల లోపు వాళ్ళు, 128 మిలియన్లు 5-9 సం॥ల లోపు పిల్లలు, 125 మిలియన్ల మంది 10-14 సం॥ల లోపు పిల్లలు ఉన్నారు. మనదేశ జనాభాలో 1/3వ వంతు కంటే ఎక్కువ మంది పిల్లలే ఉన్నారు. ఈ బాలల అభివృద్ధి దేశాభివృద్ధికి కొలబద్దగా ఉంటుంది. 1991 సం॥ నుండి ప్రభుత్వం అమలు చేస్తున్న నూతన సరళీకృత ఆర్థిక విధానాల వల్ల పేదరికంతో మరింత పేదలుగా మారారు.

ధనిక ప్రజలకు కొమ్ముకాసే విధానాలు అమలు చేయడం వలన దేశ పరిస్థితి అగమ్యగోచరంగా మారింది. ఈ విధానాల అమలు వలన ఎక్కువ శాతం మంది బాలలు ముఖ్యంగా ఆడపిల్లల మీద దీని ప్రభావం ఎక్కువగా ఉన్నది. మన సమాజంలో ఆడపిల్లలే వివక్షతకు, హింసకు గురవుతున్నారు.

మహిళా పోరాటాలు బాలల స్థితిగతుల మీద ముఖ్యంగా ఆడపిల్లల స్థితిగతులు వాటి కారణాలు మరియు వెనుకబాటు తనాన్ని రూపుమాపడానికి కృషి చేయాల్సిన అవసరం ఉంది. పితృస్వామ్య సమాజంలో బాలల బాధ్యత ప్రాథమికంగా మహిళ మీద ఉంటుంది. లింగ వివక్షత, ఆడపిల్లలను ప్రాథమిక విద్య నుండి దూరం చేయడం, ఇంకా అనేక రంగాలలో వారిని వివక్షతకు గురిచేయడం అనేది నూతన ఆర్థిక సరళీకృత విధానాల వలన ఇంకా ఎక్కువగా పెచ్చరిల్లిన పరిస్థితి నేటి సమాజంలో ఉన్నది. ఈ వివక్షతను కూకటివేళ్ళతో పెకిలించాల్సిన బాధ్యత మహిళా సంఘంగా మనమీద ఉన్నది.

### లింగ వివక్షత- గర్భ విచ్ఛిత్తి

ఆడ శిశువుల భ్రూణ హత్యలు 1991 నుండి 2001 లెక్కల ప్రకారం దారుణంగా పెరిగినవి. భ్రూణహత్యలు 3 రాష్ట్రాల నుండి 6 రాష్ట్రాలకు వ్యాపించాయి. బాలల పుట్టుక శాతంలో 0-6 సం॥ల పిల్లల (ఆడ శిశువులు) శాతం పంజాబ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, గుజరాత్, చండీఘర్, మహారాష్ట్రలో గతంలో కంటే అధికంగా పెరిగింది. పంజాబ్‌లో ఆడపిల్లల నిష్పత్తి మగ పిల్లలతో పోల్చుకుంటే వెయ్యికి 798 మందిగా ఉన్నారు. లింగనిర్ధారణ చేసే ప్రైవేటు ఆసుపత్రులు కోకొల్లలుగా ఈ మధ్య కాలంలో వెలిసాయి.

దక్షిణాది రాష్ట్రాలైన కర్నాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లో కూడా గతంలోకంటే మగ, ఆడ శిశువుల నిష్పత్తిలో పెరుగుదల అధికమైనది.

### 2001 ఆడ, మగ పిల్లల నిష్పత్తి ఈ క్రింది విధంగా ఉన్నది

| ప్రతి వెయ్యి మందికి | బాలికల నిష్పత్తి |
|---|---|
| భారతదేశం | 927 |
| జమ్ముకాశ్మీర్ | 941 |
| హిమాచల్ ప్రదేశ్ | 896 |
| పంజాబ్ | 798 |
| చండీఘర్ | 845 |
| ఉత్తరాంచల్ | 908 |
| హర్యానా | 819 |
| ఢిల్లీ | 868 |
| రాజస్థాన్ | 909 |
| ఉత్తరప్రదేశ్ | 916 |
| బీహార్ | 942 |
| సిక్కిం | 963 |
| అరుణాచల్ ప్రదేశ్ | 964 |
| నాగాలాండ్ | 964 |
| మణిపూర్ | 957 |
| అస్సాం | 965 |
| బెంగాల్ | 960 |
| జార్ఖండ్ | 965 |
| ఒరిస్సా | 953 |
| చత్తీస్‌ఘడ్ | 975 |
| మధ్యప్రదేశ్ | 932 |
| గుజరాత్ | 882 |
| దయ్యూ&డామన్ | 926 |
| దాద్రా& నాగర్‌హవేలి | 979 |
| మహారాష్ట్ర | 913 |
| ఆంధ్రప్రదేశ్ | 961 |
| కర్నాటక | 946 |
| గోవా | 938 |
| లక్షద్వీప్ | 959 |
| కేరళ | 960 |
| మిజోరాం | 964 |
| త్రిపుర | 966 |
| మేఘాలయ | 973 |
| తమిళనాడు | 942 |
| పాండిచేరి | 967 |
| అండమాన్& నికోబార్ | 957 |

గ్రామీణ ప్రాంతాల కంటే పట్టణాలలో లింగ నిష్పత్తి తారతమ్యం ఎక్కువగా (29 పాయింట్లు, 15 పాయింట్లు) ఉన్నది. వైద్యరంగంలో ప్రావీణ్యతను సంపాదించి ధన సముపార్జనే ధ్యేయంగా పెట్టుకొని ప్రైవేటు ఆసుపత్రులను నడపటమే దీనికి ముఖ్య కారణం. మరొక కారణం ప్రభుత్వం మహిళల స్థితిగతుల అభివృద్ధి కోసం తోడ్పాటునందించక ఇద్దరు పిల్లలకే జనాభా నియంత్రణ విధానాన్ని అమలు చేయడం. దీనితో ఆడ శిశువుల హత్య, ఇతర కుటుంబ సభ్యుల ఒత్తిడి మేరకు ఒక సంవత్సరంలోపు పిల్లలను చంపివేయడం జరుగుచున్నది. ప్రతి సంవత్సరం 12 మిలియన్ల బాలికలు జన్మిస్తే దానిలో 3 మిలియన్ల మంది పిల్లలు 15 సం॥లోపు బ్రతికి బట్టకట్టే పరిస్థితి లేదు. వివిధ కారణాలు బాలికల హత్యలకు

దోహదపడుతున్నాయి. 1/3 వంతు చావులు 1సం॥లోపే జరుగుతుంటే 1/6వ వంతు చావులు లింగ వివక్షత కారణంగా, హింస, ఆత్మహత్యలు, హత్యల కారణంగా చనిపోతున్నారు.

**పోషకాహారము- ఆడ శిశువులు**

పోషకాహార లోపం నేటి భారతదేశ బాలికలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య. 3 సం॥ల లోపు పిల్లలు 46% మంది పోషకాహారం లోపం బారినపడ్డారు. ఇది ఆఫ్రికా దేశాల కంటే ఎక్కువగా ఉన్నది. 50% మంది బాలలు పోషకాహార లోపం వలననే చనిపోతున్నారు. పరిస్థితిలో మార్పు రాకపోవడానికి మెజార్టీ బాలలు పేద కుటుంబాలకు చెందినవారు కావడమే ముఖ్య కారణం. బాలల అభివృద్ధి సూచికను పరిశీలిస్తే 1991 సం॥ నుండి పడిపోతున్నది. 1990- 94లో 36.53, 1995-99లో 31.22, 2000-06లో 26.62 మంది వున్నారు. పుట్టుకతోనే పోషకాహారలోపంతో 1/3 వంతు పిల్లలు పుడుతున్నారు. 0-6 సం॥లోపు పిల్లల్లో ఈ శాతం ఇంకా పెరుగుతున్నది. వయస్సు పెరిగే కొద్దీ పాఠశాలలకు వెళ్ళే బాలల్లో ఈశాతం ఇంకా పెరుగుతోంది. కౌమారదశలో ఉన్న పిల్లల్లో కూడా పోషకాహార లోపం ఎక్కువగా ఉన్నది. వృద్ధులలో ఈ శాతం కొంత తగ్గుదల ఉన్నది. ఇతర దశలకంటే కూడా కౌమారదశలో పోషకాల అవసరం ఎక్కువగా ఉంటుంది. పోషకాహార లోపం కౌమారదశలో విపరీతమైన ప్రభావం ఉంటుంది. శరీర పెరుగుదల ఆగిపోవడం, రోగ నిరోధకశక్తి తగ్గిపోవడం, ఇతర శారీరక, మానసిక పెరుగుదల మీద కూడా ప్రభావం ఉంటుంది. గర్భస్థ తల్లికి పోషకాహార లోపం వలన తక్కువ బరువుతో పిల్లలు పుట్టడం, రక్తహీనత, గర్భవిచ్ఛిత్తే కాకుండా అనేక రోగాల బారిన పడుతున్నారు. బలహీనంగా ఉండి, పోషకాహార లోపంతో ఉన్న ఆడవారిలో గర్భసంచి చిరిగిపోయిన సందర్భాలు అనేకంగా ఉన్నాయి.

పిల్లలు పోషకాహార లోపంతో అనేక రోగాల బారినపడుతున్నారు. చదువుల్లో కూడా వెనకబడుతున్నారు. జ్ఞాపకశక్తి, గ్రహణశక్తి కూడా బాగా తక్కువగా ఉంటుంది. 5 సం॥ల లోపు ప్రతి 10 మంది పిల్లల్లో 7 మంది రక్తహీనత బారినపడుతున్నారు. 3% మంది ఎక్కువ రక్తహీనతతో, 40% మంది పిల్లలు మధ్యస్తంగా మరియు 26% మంది తక్కువ రక్తహీనతతో బాధపడుతున్నారు.

ఆహార పదార్థాల ధరలు విపరీతంగా పెరగడం వలన కనీస ఆహారాన్ని కూడా తినడానికి నోచుకోలేకపోతున్నారు. పిండి పదార్థాలు, పోషక పదార్థాలు, విటమిన్లు, మాంసకృతులు వారి ఆహారంలో చోటు చేసుకోవడం లేదు. ఆహార భద్రతాలోపం పట్టణ, గ్రామీణ ప్రాంతాలలో ఆదివాసీ, గిరిజన, కరువు పీడిత ప్రాంతాలలో అత్యధికంగా ఉన్నది. తల్లి పిల్లల సంరక్షణ కోసం ఎక్కువ సమయాన్ని కేటాయించాల్సి వుంటుంది. కానీ తల్లి ఆహారం, వంట చెరకు, పశువుల దాణా, మంచినీటి కోసం ఎక్కువ సమయాన్ని కేటాయించాల్సి రావడం వల్ల పిల్లలను పట్టించుకోవడానికి సమయం లేకపోవడం కూడా ఒక కారణం. మహిళలు ముఖ్యంగా అసంఘటిత రంగంలో పనిచేస్తున్న మహిళలు శారీరక శ్రమ దోపిడీ వలన పిల్లల కోసం చాలా తక్కువ సమయం కేటాయిస్తున్నారు. చాలా ప్రాంతాల్లో మహిళలు, బాలికలు కుటుంబంలోని మగవారు భోజనం చేసిన తరువాత మిగిలిన ఆహారాన్ని పంచుకుతినడం అనేది జరుగుచున్నది. భారతదేశంలో ఆడ, మగ పిల్లల మధ్య చూపే వివక్షత పోషకాహారం లోపం వల్ల మనకు అర్థమవుతుంది.

1. 70% బాలలు ( 6-59 నెలల్లోపు)
2. 3 సం॥లోపు పిల్లల ఎదుగుదల (బరువు, ఎత్తు) కొలతలు, అసమానతలు ఎక్కువగా ఉన్నాయి.
3. పిల్లల్లో డయేరియా వలన బాధపడుతున్న వారు ఎక్కువగా ఉన్నారు. 58% మంది పిల్లల్లో ఈ రోగ లక్షణాలు ఎక్కువగా ఉన్నాయి.
4. 12 నెలల నుండి 23 నెలల్లోపు పిల్లలు ఎక్కువగా రక్తహీనత బారిన పడుతున్నారు. ఎక్కువ మంది పిల్లలు ఉన్న కుటుంబాలలో గ్రామీణ ప్రాంతల్లో నిరక్షరాస్యులైన తల్లులు, పిల్లలు, వెనుకబడిన గిరిజన, ఆదివాసీ కుటుంబాల, పేద కుటుంబాలకు చెందిన పిల్లలు ఎక్కువగా రక్తహీనతకు లోనౌవుతున్నారు.
5. 1/4 వంతు పిల్లల్లో రక్తహీనత వారి తల్లుల నుండి సంక్రమిస్తున్నది.
6. హర్యానా, రాజస్థాన్, బీహార్, పంజాబ్ రాష్ట్రాలలో ఎక్కువ మంది పిల్లలు రక్తహీనతతో బాధపడుతున్నారు.

**బాలికల ఆరోగ్య స్థితిగతులు**

5 సం॥ బాలికలు, నెలల శిశువుల మరణం ప్రధానంగా శ్వాసకోశ సంబంధిత వ్యాధులు, డయేరియా, మీజిల్స్, మలేరియా మరీ ముఖ్యంగా పోషకాహార లోపం వల్ల జరుగుతున్నది. ఈ విషవలయంలో చిక్కుకున్న పిల్లలు దీని నుండి బయటపడటం చాలా ఖర్చుతో కూడుకున్న పని. బాలికల మరణ శాతం బాలుర శాతం కంటే ఎక్కువగా ఉన్నది. చాలా తక్కువ మంది ఆడపిల్లలకు మాత్రమే వైద్యం అందజేయబడుతుంది. బాలురకు వైద్య సహాయాన్ని అందించడానికి తల్లి తండ్రులు వెనుకాడటంలేదు. హాస్పిటల్ రికార్డులలో మనం చూస్తే ఆడపిల్లల మరణాల సంఖ్య బాలురకంటే ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా: పోలియో ట్రీట్‌మెంట్ కోసం బాలురను ఆసుపత్రికి తీసుకువచ్చి బాలికలను వారి ఖర్మకు వదిలివేసిన సంఘటనలు చాలా వున్నాయి.

**విద్య**

విద్యతో ఒక్క బాలల అభివృద్ధే కాదు, వారి కుటుంబం, నివసిస్తున్న రాష్ట్రం మరియు దేశాభివృద్ధి ముడిపడి ఉన్నది. బాలల ప్రాథమిక విద్య, స్కూలులో చేర్పించడం, హాజరు, బడిమానేయటం అనేది ఎక్కువగా ఉన్నాయి. 100మంది బాలురకు 55 మంది బాలికలు మాత్రమే స్కూలులో చేరుతున్నారు. బడికిరాని పిల్లల్లో ప్రతి నలుగురిలో ముగ్గురు ఆడపిల్లలే. 10 మంది బాలికలు బడిలో చేరితే దానిలో ఇద్దరు మాత్రమే ప్రాథమిక విద్యను పూర్తిచేస్తున్నారు. సెకండరీ స్కూల్‌కు వెళ్ళే బాలికల శాతం 20 ఉంటే, బాలుర శాతం 39 ఉన్నది. మన దేశంలో 15-35 సం॥లోపువారు 100 మిలియన్లు నిరక్షరాస్యులుగా ఉంటే దానిలో 69% మంది మహిళలే ఉన్నారు. బాలికల్లో డ్రాపౌట్ శాతం పెరగటానికి అనేక కారణాలు ఉన్నాయి. విద్యనభ్యసించటంలో వచ్చే ఖర్చులు, కుటుంబాన్ని పోషించే భారం, కుటుంబ పనులు ముఖ్యంగా నీళ్ళను తీసుకురావటం, పశువుల దాణా, వంట చెరకు సమీకరించడం, తోటి చిన్న తమ్ముళ్ళ, చెల్లెళ్ళ ఆలనా, పాలనా ఇవన్నీ డ్రాపౌట్ శాతాన్ని పెంచుతున్నాయి.

అక్షరాస్యతా శాతం 2001 జనాభా లెక్కల ప్రకారం.

| 2001 | బాలురు | బాలికలు |
|---|---|---|
| గ్రామాలలో | 71.4 | 46.7 |
| పట్టణాలలో | 86.6 | 73.2 |
| మొత్తం | 75.85 | 54.16 |

ఐద్వాగా బాలికల అక్షరాస్యతా శాతాన్ని పెంచడానికి, చైతన్యం తీసుకురావడానికి పోరాటాలు చేయాల్సిన అవసరం ఉన్నది.

### ప్రభుత్వ పథకాలు- బాలికల అభివృద్ధి

(ఐ.సి.డి.ఎస్) స్త్రీ, శిశు సంక్షేమ పథకాలు బాలికల ప్రాథమిక విద్య, వైద్యం కోసం ప్రారంభించబడ్డాయి. ఈ పథకాలు ఆర్థిక ఇబ్బందులతో కుంటుపడుతున్నాయి. నూతన సరళీకృత ఆర్థిక విధానాలు సమర్థతపై అనేక ఆరోపణలు వచ్చిన నెపంతో ప్రభుత్వం ఆ నంస్థలను ప్రైవేటువరంచేనన్తా ఎన్.జి.ఓలకు అప్పజెపుతున్నాయి. అంగన్‌వాడి వర్కర్లు సరియైన జీతాలు లేక పని ఒత్తిడి అధికంగా ఉంటూ తమ విధులను సక్రమంగా నిర్వర్తించలేకపోతున్నారు. బెంగాల్‌లో అంగన్‌వాడీ సెంటర్ల మీద, అంగన్‌వాడీ వర్కర్ల మీద వేధింపులు పెరిగిన విషయం తెలిసినదే. జాతీయస్థాయిలో బాలల హక్కుల కమీషన్ ఏర్పడినప్పటికీ, ప్రభుత్వం ఈ అసమానతలను తొలగించడానికి ప్రత్యేక చర్యలను తీసుకుంటేనే మార్పు సాధ్యం అవుతుంది. మనం ఒక బలమైన ఉద్యమాన్ని ఈ అనమానతలను రూపుమావటానికి చేపట్టాలి. ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకువచ్చి పేద ప్రజలకు మరింత చేరువయ్యే విధంగా విధానాలను రూపొందించాలని కోరాలి. దేశవ్యాప్తంగా కుటుంబాలలో బాలికల అణచివేత పాఠశాలల్లో, పనిచేసే చోట, కులం మరియు సామాజిక వర్గ వివక్షత కొనసాగుతుందన్నట్లు నివేదిక వుంది. ఈ హింసలో అత్యాచారాలు మరియు గృహహింస కూడా సమ్మిళితమై ఉన్నవి. ఎక్కువ సంఖ్యలో జరిగిన కేసుల్లో 16 సం॥ల వయస్సులోపు బాలికల మీదనే జరిగినట్లు రిపోర్టులు చూపిస్తున్నాయి. బాలికల మీద అత్యాచారం చేసిన దుర్మార్గులు కుటుంబాలలోని వారు మరియు చుట్టుప్రక్కల ప్రాంతాల వారు. వెనుకబడిన తరగతులకు చెందిన బాలికలలో ఎక్కువగా అత్యాచారాల బారిన పడుతున్నారు. "నిఠారి" బాలిక హత్యకేసు సమాజంలో జరుగుతున్నటువంటి హింసకు కనువిప్పు కావాలి. ఇండ్లలో పనిచేస్తున్నవంటి బాలికల పనివారిపైన కూడా వేధింపులు అత్యాచారాలు ఎక్కువగా జరుగుతున్న విషయం మనందరికి తెలిసినదే. దీని మీద పెద్ద ఎత్తున ఉద్యమించాల్సిన అవసరం ఉన్నది.

### బాల పనివాళ్ళు

భారత ప్రభుత్వం ఒక మంచి ఉద్దేశ్యంతో బాలల హక్కుల పరిరక్షణ కొరకు జాతీయస్థాయి కమీషన్‌ను ఏర్పాటు చేసి బాల పనివారల చట్టము, బాలల విద్యాహక్కు చట్టాన్ని విశ్లేషించటానికి పూనుకున్నది. ఇన్ని చర్యలను తీసుకున్నప్పటికీ, మిలియన్ల మంది బాలలు తమ బాల్యాన్ని, బాల్య జీవితాన్ని ఆస్వాదించకుండా పనిచేసే పిల్లలుగా (జీతగాళ్ళుగా ) మిగిలిపోతున్నారు. గ్రామీణ ప్రాంతాలలో బాలికలు పొలాలలో పనిచేస్తూ, తక్కువ విలువగల గృహావసర వస్తువుల తయారీలో సహాయపడుతూ, తనకంటే చిన్న వయస్సులో వున్న చెల్లి, తమ్ముళ్ళ ఆలనా పాలనా చూసుకుంటూ, జీవితాన్ని చాలా దుర్భరంగా గడుపుతున్నారు. పట్టణ ప్రాంతాలలో ఇంటి పనివారలుగా, చిత్తు కాగితాలను ఏరుకుంటూ, నిర్మాణపు పనుల్లో పాలుపంచుకుంటూ, అడుక్కునే (బెగ్గర్స్ చైన్) వారిగా వుంటూ హృదయవిదారకమైన పరిస్థితిలో జీవిస్తున్నారు.

### పనివాళ్ళుగా, సెక్స్ వర్కర్లుగా బాలికల రవాణా

మైనర్ బాలికలను, బాలురను ఇతర పనుల కోసం, వ్యభిచార గృహాలకు తరలించడమనే తీవ్రమైన హింస మన సమాజంలో వేళ్ళూనుకుని ఉన్నది. పోలీసుల, అధికారుల, రవాణాదారుల కనుసన్నలలో వారి అండదండలతో ఈ రకమైన రవాణా జరుగుతున్న విషయం సిగ్గుతో తలదించుకునే విధంగా ఉన్నది. దేశంలోనే కాకుండా అంతర్జాతీయంగా మొత్తం గ్లోబును చుట్టబెట్టుకుని ఈ రవాణా ఉన్నదని స్వయంగా ఐక్యరాజ్య సమితి కూడా గుర్తించింది.

### బాల్య వివాహాలు

భారతదేశ సమాజంలో పెళ్ళి వయసు మీద ఒక చర్చ జరిగింది. ప్రస్తుతం బాలికల పెండ్లి వయస్సు 18 సం॥రాలు. బాలుర వయస్సు 21 సం॥రాలుగా చట్టబద్ధం చేయబడినది. మన దేశంలో దాదాపు 1/3 వంతు వివాహాలు చట్టాన్ని ఉల్లంఘిస్తూ 18 సం॥ల లోపు ఉన్న బాలబాలికలకు చేస్తున్నారు. వారిని మహిళలుగా గుర్తిస్తున్నారు. బాలికలు గర్భవంతులైతే వారు బతికి బట్టకట్టే పరిస్థితులు చాలా తక్కువ మరియు చాలా రిస్క్‌తో కూడుకున్న పని. బాల్య వివాహాల వలన వారి చదువు, మానసిక వికాసం, శారీరక పెరుగుదల ఆగిపోతుంది. బాల్య వివాహాలను మహిళలపై హింసగా గుర్తించి ఐద్వాగా ఉద్యమం చేపట్టాలి.

### వదిలిపెట్టబడిన (ఒంటరి) పిల్లలు, వీధి బాలలు మరియు అనాథ బాలలు

వదిలివేయబడిన, అనాథ, వీధిబాలల బాల్యం వీధులలో గడుస్తున్నవి. పెద్దల రక్షణ, పోషణ లేకుండా ఉంటున్నారు. వీరి సంక్షేమం, మానవహక్కుల రక్షణ అనేది మనం ఎదుర్కొంటున్న పెనుసవాలు. ఇటువంటి బాలల సంఖ్య తక్కువ ఏమీకాదు. వారి సంక్షేమం గురించి మరువరాదు. సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థితిగతులపై పోరాటం చేయ్యాలి. వారికి విద్య, వైద్యం, గూడు, గుడ్డ, నీడను ప్రాథమిక హక్కులను, ఆప్యాయత, అనురాగాలను పంచి ఇచ్చే విధంగా చర్యలు తీసుకునేటట్లు పోరాటం చెయ్యాలి.

### అంగవైకల్య బాలలు

అంగవైకల్యంతో బాధపడే పిల్లలను చైతన్యవరచడానికి అనేక చర్యలు తీసుకోవాలి. అంగవైకల్యంతో బాధపడుతున్న పిల్లల తల్లితండ్రుల యొక్క మౌనాన్ని ఛేదించి వారి పిల్లల వెనుకబాటుతనాన్ని గుర్తించి చేదోడువాదోడుగా నిలవాలి. వీరికి తగినన్ని అవకాశాలు కల్పించడానికి వారిలో చైతన్యం తీసుకురావడానికి ఒక ఉద్యమాన్ని చేపట్టాలి. ప్రత్యేక ప్రతిభావంతులైన బాలలతోపాటు వారి తల్లులను కూడా నిర్మాణంలోకి తీసుకువచ్చి చైతన్యపరచి ఇతర బాలల జీవన స్రవంతిలోనికి వారిని కూడా తీసుకువచ్చే విధంగా తీర్చిదిద్దాలి.

భారతదేశ ప్రభుత్వం అంతర్జాతీయ ఒప్పందాలకు సంతకాలు చెయ్యడమే కాకుండా (ఉదా॥ఐక్యరాజ్యసమితి మిలీనియం అభివృద్ధి లక్ష్యం) బాలల స్థితిగతుల మెరుగుదల కోసం చిత్తశుద్ధితో నిధులను కేటాయిస్తూ వివిధ క్రొత్త పథకాలను మరింత పటిష్టంగా అమలుపరుస్తూ ముందుకు కొనసాగాలి. ప్రభుత్వం అవలంభించే విధానాలు, సామాజిక, ఆర్థిక స్థితిగతుల మీదనే బాలల యొక్క వ్యక్తిత్వ వికాసం ఆధారపడి ఉన్నది. ప్రజాస్వామ్య దేశంలో విద్య, వైద్య సౌకర్యాలు బాలికల హక్కుల సంరక్షణ, సరైన పోషకాహారం ఇతర అన్ని సౌకర్యాలు కూడా కల్పించబడి వివక్షరహిత సమాజం స్థాపించడానికి ప్రభుత్వం నడుంకట్టాలి.

-అనువాదం: అఫ్రోజ్ సమీనా

# నీ కాళ్ళు మొక్కుతా నా పేరు రాయి

-కె. రమాదేవి.



భారత సర్కారు చేపట్టిన బి.పి.ఎల్ స్టడీకోసం మెదక్ జిల్లాలో ఒక ఊరు వెళ్ళాము. అప్పటికే అక్కడ ఉన్న స్వచ్ఛంద సంస్థ ప్రతినిధులు, గ్రామ సర్పంచ్ మా రాకకి ఏర్పాట్లు చేశారు. మేం ఆలస్యంగా వెళ్ళినా కూడా చాలామంది మా కోసం ఎదురు చూస్తున్నారు.

పంచాయితీ కార్యాలయంలో అందరం కూర్చున్నాము. మమ్మల్ని మేము పరిచయం చేసుకున్నాము. ఎందుకు వచ్చామో చెప్పాము. దానికి వారిని సహకరించమని అడిగాము. అక్కడితో మా పని అయిపోతుందని కదలబోయాము. అంటే మా ఉద్దేశ్యం మాకు సహాయపడటానికి, మా పని పూర్తి కావడానికే వారు ఉన్నారని మా ఉద్దేశ్యం.

కానీ అక్కడికి వచ్చిన రైతులు, మహిళలు, వృద్ధులు మమ్మల్ని కదలనివ్వలేదు. మీరు చెప్పింది మేము విన్నాము. మేము చెప్పేది మీరు వినరా? కనీసం మా బాధలు వినండి అంటూ అందరూ ఒకేసారి మాట్లాడారు. వాళ్ళు చెప్పింది సబబనిపించింది. అంతకు ముందు మా ప్రవర్తనకు మాకు సిగ్గనిపించింది.

ఒక్కొక్కరు చెబితే బాగుంటుందని చెప్పాము. 50 ఏళ్ళ రైతు ఆరోజు పేపర్లో వచ్చిన ఒక వార్తను చూపించి "మా ఊరికి ఎరువులు ఇచ్చినట్టు రాశారు. ఒక బస్తా ఎరువు కోసం రోజంతా ఎదురు చూసినా ఇవ్వలేదు. ఎరువులు లేకుండా పంటలు ఎలా పండించాలి"? ఈ సంభాషణ ఎటు దారి తీస్తుందో అని సర్పంచ్‌కి అనుమానం వచ్చింది. "వీళ్ళు ఏదో మన గ్రామం గురించి తెలుసుకుందామని వచ్చారు. వాళ్ళకి చెబితే ఏం లాభం? పదండి ఊర్లోకి వెళదాం" అన్నాడు.

అంతలో ఒక మహిళ లేచి నా కార్డు తీసేసారు. నాలుగు నెలల నుంచి బియ్యం ఇవ్వడం లేదు. ఎందుకు తీసేసారో తెలియదు. నా సంగతి ఊర్లో అందరికీ తెలుసు. నా కూలి మీదే కుటుంబం బ్రతుకుతున్నాం. మా ఆయన చనిపోయాడు. ముగ్గురు పిల్లలు. ఎలా బతకాలి? మాకు కనీసం బియ్యం ఇప్పించండి అంటూ ప్రాధేయపడింది.

ఇంకొక ముసలి అవ్వ కాళ్ళ మీద పడి "నీ కాళ్ళు మొక్కుతా నాకు ఎవ్వరూ లేరు. నాకు పింఛను ఇప్పించు" అంటూ కదలక పోతే మిగిలిన మహిళలు లాగారు.

కొంత మంది పురుషులు 'మా గ్రామంలో జాతీయ ఉపాధి పథకం నడవడంలేదు. చుట్టుప్రక్కల గ్రామాల్లో పని చేసుకుంటున్నారు. మా గ్రామ పెద్దలు మాకు ఆ పని ఇప్పించడం లేదు'. కొంతమంది "డ్వాక్రా మహిళలు బ్యాంకులు ఋణాలు ఇవ్వడంలేదు'. గత 2 సంవత్సరాల నుండి కరువు. పంటలు లేవు. అక్కడ ఉన్న వాళ్ళు ఎవరి సమస్య వాళ్ళు ఏకరువు పెడుతున్నారు.

ఏమీ చేయలేని మా చేతగాని తనంపై, ఏమీ చేయకుండా ఉన్నవి లాక్కుంటున్న సర్కారు మీద కోపం వచ్చింది. చేసేదేం లేక వాళ్ళందరినీ బ్రతిమాలాము. "మీరే ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్ళండి. ఒత్తిడి చెయ్యండి. కొంచెం మాకు సహకరించండి" అన్నాము.

ఆ గ్రామం పెద్దది కాబట్టి ఒక భాగం ఎంపిక చేసి అధ్యయనం చెయ్యాలనుకున్నాము. అక్కడున్న వాళ్ళు ప్రధానంగా మహిళలు "మా వీధికి రండి మా వీధికి రండి" అంటూ పోటీ పడ్డారు. మొత్తానికి ఒక నిర్ణయానికి వచ్చి మమ్మల్ని గ్రామంలో ఒకవైపుకు తీసుకెళ్ళారు. ఒకచోట ఆగి ఆ ప్రదేశంలో సాంఘిక పటం గీయాలనుకున్నాము.

గ్రామ సర్పంచ్, స్వచ్ఛంద సంస్థ ప్రతినిధులతోపాటు మహిళలు, యువకులు గ్రామస్థులు మాతోపాటు వున్నారు. అక్కడి మా పని ఏమిటంటే గ్రామ పటం గీసి, పటంలో ఇళ్ళను వేయించి కుటుంబ వివరాలు అందరి సమక్షంలో సేకరించాలి.

ఇటువంటి మ్యాప్‌లు గియ్యడం వాళ్ళకి కొత్తకాదు. గతంలో 2,3 సార్లు వెలుగు, ఎన్.జి.ఓ ఇంకేదో కార్యక్రమాలకి వేశారు. రోడ్లుతో మొదలు పెట్టారు. మహిళలు రంగోళితో సరిహద్దులు గీస్తున్నారు. తరువాత యువకులు ఒక్కొక్క కుటుంబం పేరు కార్డు మీద రాసి వాళ్ళ వివరాలు రాస్తున్నారు. తప్పుల్ని కొంతమంది పెద్దలు సవరిస్తున్నారు. "మా వీధి రావాలని" పట్టుబట్టే వాళ్ళు, "మా ఇల్లు గియ్యలేదని" చెప్పేవాళ్ళు, "నా గురించి చెబుతాను రాసుకో" అనే వాళ్ళు ఇలా సాగుతున్నది.

ఇంతలో మధ్య వయస్కురాలు "ఇవన్నీ ఎందుకు మంచి నీళ్ళు లేక అల్లాడుతున్నాం'. ఇలాగ ఎంతమంది రాస్తారు? మా మాదిగ వీధికి రోడ్డు లేదు. నీళ్ళు లేవు అంది . ఇల్లులు గీసేవాళ్ళు, గీస్తున్నారు. రాసేవాళ్ళు రాస్తున్నారు. ఇంతలో మతి స్థిమితం లేని తన కొడుకుని చూపించి పేరు రాయమంటూ ఒక మహిళ వచ్చింది.

మేం ఏమీ చెయ్యమని చెప్పినా కూడా వీళ్ళేదో రాస్తున్నారు. దాని వలన సమస్య పరిష్కారం అవుతుందేమో అని ఆశకొద్దీ చెబుతున్నారు. ఉదయం కాళ్ళమీద పడి కాళ్ళు మొక్కుతా నాకు కార్డు పింఛను

ఇప్పించు అన్న ఆమె పావుగంటకి ఒకసారి కాళ్ళమీద పడి ఏడుస్తున్నది.

గీసే మ్యాప్ కూడా మా చేతులు దాటి పోయింది. ఎక్కడ వాళ్ళ ఇల్లు గియ్యకపోతే వాళ్లకి రావలసినవేమైనా పోతాయన్న భయమో ఏమో వీధులు పొడిగిస్తూ పోతున్నారు. దాదాపు 3 గంటల పాటు ఆ పని చేస్తున్నంత సేపూ కొంతమంది మహిళలు కదలకుండా అక్కడే కూర్చున్నారు. మధ్య మధ్యలో ప్రభుత్వాన్ని, సర్పంచ్‌ని తిట్టుకుంటున్నారు. మళ్ళీ గుర్తుకు వచ్చినప్పుడల్లా "నా పేరు రాయి నాకు పింఛను లేదు, కార్డు తీసేశారు" అంటున్నారు.

అప్పటికే ఆకలిగా వుండడంతో "అమ్మా మీరు భోజనానికి వెళ్ళండి" అంటే ఉదయం తిన్నాము మళ్ళీ రాత్రికే అన్నారు తప్ప కదలలేదు. మ్యాప్ గీసిన తరువాత ఇక్కడే వుంటాము మళ్ళీ రాత్రికి కలుద్దామని చెప్పి పంచాయితీ ఆఫీసుకి వచ్చేశాం.

నాకయితే అక్కడ మహిళల్ని ముఖ్యంగా ముసలి అవ్వలను, ఒంటరి మహిళలు, వితంతువులను చూశాక పల్లెటూరు తల్లిలాంటిది అన్నమాట ఒకప్పటి మాట అనిపించింది. వీళ్ళందరికీ అనవసరమయిన ఆశలు కల్పిస్తున్నామా? అదే ప్రశ్న మా బృందాన్ని అడిగాను. "ఎవరు వచ్చినా వాళ్ళు అలాగే అడుగుతారు. అది వాళ్ళకి అలవాటు. వాళ్ళ సమస్యలు అలాగే వుంటాయి. మనం చెయ్యవలసిన పని చేసుకుని వెళదాం" అన్నారు.

సరే మనం చేసిన దానినయినా ఉపయోగిస్తుందా ప్రభుత్వం అన్న అనుమానం వచ్చింది. ఆ ప్రశ్న అడగలేదు. ఎందుకంటే దానికి వచ్చే సమాధానం నేను ఊహించగలను.

మా బృందం నాకు గట్టిగా చెప్పారు. "మనకి అవసరమయిన సమాచారం మాత్రమే అడుగు. తొందరగా పూర్తి చేసుకుని వెళ్ళాలి".

సాయంత్రం వాళ్ళకి చెప్పినట్లు రాత్రి 8 గం॥లకి మీటింగ్ పెట్టాము. అక్కడ మేం ఏం చెయ్యాలంటే గ్రామంలో నిరుపేదలు, పేదలు, మధ్యతరగతి, ధనికులుగా కుటుంబాలని విభజించాలి. దానిని గ్రామీణ మంత్రిత్వ శాఖకి అందించాలి. ఇది ప్రజల సమక్షంలో వాళ్ళతోనే కలిసి నిర్ణయించాలి. ఇది మేం చేసిన సర్వేతో సరిపోతుందా లేదా ఇంకేమైనా మార్చాలా అని నిర్ణయిస్తారు.

అందరూ వచ్చారు. పై విషయం వాళ్ళకి చెప్పి సహకరించమన్నాము. అంతే పోటీపడి "నాకు భూమిలేదు, కూలికి వెళ్ళలేను, ముసలి భర్త ఇపుడు పింఛను ఆపేశారు" అంటూ ఒకామె లేచి చెప్పింది. అందరూ ఒకేసారి మాట్లాడటానికి ప్రయత్నించడంతో వారిని కంట్రోల్ చెయ్యలేకపోయాము. ఇలా కాదు మీరు మీ నుండి 5గురు ప్రతినిధులను పంపించండి అన్నాము. వాళ్ళు ఒప్పుకోలేదు. మా అందరి సమక్షంలో రాయండి. వారిని కంట్రోల్ చెయ్యడం కష్టం అవ్వడంతో మీరే నిర్ణయించుకోండి. మేం రేపు ఉదయం వస్తాము అని చెప్పి దగ్గరలో మాకు ఏర్పాటు చేసిన బస దగ్గరికి వెళ్ళిపోయాము.

ఆరోజు రాత్రి కలలో కూడా "నీ కాళ్ళు మొక్కుతా నాకెవరూ లేరు బియ్యం కార్డు ఇప్పించు, నాపేరు రాయి" అదే కలత నిద్ర. ఎందుకో ఇదంతా నచ్చలేదు నాకు. అలా అనేకంటే ఏమీ లేని ఎవరూ పట్టించుకోని ముసలి అవ్వని చూసి తట్టుకోలేకపోయాను. భర్త చనిపోయి భూమి లేని యువత ముగ్గురు పిల్లల్ని సాకే కష్టం నాకు కష్టం వేసింది. మాటి మాటికీ "నా పేరు రాము కాళ్ళు మొక్కుతా రాయి" అన్న అమ్మల బాధ భరించలేనిదిగా వుంది. బ్రతకటానికి వాళ్ళు పడుతున్న ఆరాటం, ఆసరా కోసం వారు పడుతున్న తపన నన్ను నిద్రపోనివ్వలేదు.

ఈ బాధ లేవీ లేని మా బృందం ఉదయాన్నే తయారయ్యింది గ్రామం వెళ్ళడానికి. మేం వెళ్ళేసరికి వాళ్లంతా ఒక నిర్ణయానికి వచ్చి మాకోసం 5గురిని పంపించారు. కావలసిన వివరాలు మేం తీసుకుంటుంటే చాలామంది బయటే కూర్చున్నారు. కొంతమంది పనికి వెళ్లిపోయారు. మేము కేవలం అధ్యయనం కోసం మాత్రమే వచ్చామన్నా వాళ్ళకి నమ్మకం కుదరలేదు. ఏదో రహస్యంగా చూస్తున్నారు. అందులో నా పేరు ఉంటుందో లేదో అని భయం. మధ్య మధ్యలో మాతో ఉన్నవారిని అడుగుతున్నారు. అంతలో 22 సంవత్సరాలు వుంటాయి యువతి బిడ్డచంకలో వుంది. నిన్నటి నుండి నా పేరు రాము అన్న అవ్వ తీసుకొచ్చింది. అమ్మా ఇదిగో దీనికి ఇల్లు లేదు., మొగుడు తాగుతాడు. ఇద్దరు పిల్లలు, రేషను కార్డు లేదు. పసోడికి పాలు కూడా లేవు. దీనిపేరు రాయి నీ కాళ్ళు మొక్కుతా అంటూ క్రిందకి వంగబోతే నేను ముందే ఆపాను. ఇంక అయిపోయింది ఎవరి పేర్లు రాయము అని మా వాళ్ళు అన్నా కూడా ఒక కార్డుమీద ఆ యువతి పేరు రాసేవరకు ఈ అవ్వ కదలలేదు. ఈ యువతి కూడా పేరుతోనే తన జీవితం ఏదో మారిపోతుందన్న ఆతృతతో చూస్తున్నది.

ఇంత తతంగం జరుగుతుంటే మగవారు ఎక్కువగా వచ్చి బ్రతిమాలడం లేదు. పెద్దగా అసక్తి చూపడంలేదు. అదే ఇద్దరు ముగ్గుర్ని అడిగాను. అప్పటికే నువ్వీ పనికి పనికిరావని మా టీం నన్ను పక్కన పెట్టేసింది. "ఈ రాసుడు ఎన్ని చూడలేదు. వస్తారు, రాస్తారు, మళ్ళా కనబడరు. ఏదో వచ్చి ఏం చెప్పినా నమ్మేస్తారు" అని తేలిగ్గా తీసిపడేశారు.

మా బృందం ఏమనుకుందో ఆఖరి ఘట్టానికి నన్ను పిలిచి అందరికీ వివరించమన్నారు. అందరూ కూర్చున్నారు. నిన్నటి నుండి మేం చేసిన కార్యక్రమం వివరించి దాని ద్వారా గ్రామంలో కుటుంబాలను నిరుపేదలను, పేదలు, మధ్యతరగతి, ధనికులు వరుసగా చదవబోతున్నాను. మళ్ళీ ఈ అవ్వే ఒంటిమీద బట్టలు సరిగ్గా లేని ముసలమ్మని తీసుకొచ్చింది. "ఇది మా ఊరిలో ఎవరూ, ఏమీ లేనిది. ఇల్లులేదు. దీని పేరు రాయి. నీ కాళ్ళు మొక్కుతా'' అంటూ క్రిందికి వంగింది.

ఇంక నా వల్ల కాలేదు. నేను ఉంటే ఇలా వస్తుంటారనుకున్నారో ఏమో మా బృందం నన్ను శాశ్వతంగా తప్పించారు. ఏమిటీ ఈ అవ్వకి ఎందుకింత బాధ? ఆ అభాగ్యుల కోసం ఎందుకింత ఆరాటం? ఆమెకి ఏం లాభం? ఏంటి ఇంత అశాంతి? అప్పుడు నన్ను వేధించిన ఈ ప్రశ్నలకి సమాధానం దొరకలేదు???



# వికలాంగ మహిళలపైనా అత్యాచారాలా?

-వి. వెంకటేశ్వర్లు

చట్టానికి కళ్లు లేవు, చెవులే వున్నాయి. రుజువులు చూపిస్తేనే అది శిక్షిస్తుంది. లేకుంటే సాక్ష్యాల్లేవని దోషులను వదిలేస్తుంది. ప్రభుత్వాలనే తల్లకిందులు చేయగల ఘనులున్న మన వ్యవస్థలో సాక్ష్యాలను తల్లకిందులు చేయగల 'సాక్షాసురులకు' (సాక్ష్యాలను తారుమారు చేయగల రాక్షసులు) కొదువలేదు. అందువల్లే అత్యాచారాలకు గురైన మహిళలూ, వైవాహిక జీవితంలో వంచనకు గురైన గృహిణులూ..... చట్టాలతో మోసగాళ్ళ ఆటలు కట్టించలేక పోతున్నారు. అదే ఒకమూగ యువతిపై అత్యాచారం జరిగితే...కాగితంపై రాసి రుజువు చేయవచ్చునంటున్నారు. అంధురాలైన యువతిపై జరిగితే....స్పర్శ ద్వారా గుర్తించాలనీ, కాగితంపై రాసి నిరూపించాలనీ అంటున్నారు. వీరికి చదువు రాదంటే.. సంజ్ఞల ద్వారా నిరూపించవచ్చునంటున్నారు. అన్ని అవయవాలున్న మహిళే కోర్టు ముందు నిరూపించడంలో రాజకీయ, అధికార, ధన పలుకుబడుల ముందు నిర్భలులవుతుంటే చూడలేని, వినలేని, నోరు విప్పలేని వికలాంగ మహిళలెలా రుజువులు తేగలరు? ఏం జరిగిందో గుర్తించలేని మానసిక వికలాంగులే అత్యాచారాలకు గురైతే...పోలీసు సాక్ష్యాలే ఆధారంగా కోర్టులు చూస్తున్నాయి. దూది పింజల్లాంటి వీరి సాక్ష్యాలు అధికార దర్పం, రాజకీయ పలుకుబడి, 'ధన, నీతి' ముందు నిలుస్తాయా? న్యాయకోవిదులు చర్చించాలి. ప్రతి ఒక్కరూ ఆలోచించాలి.

విశాఖ జిల్లా గోపాలపట్నానికి చెందిన రూపాదేవి (27) గత నవంబరులో అత్యాచారానికి గురైంది. ఆమె మానసిక వికలాంగురాలు. ఆమె తల్లి కిళ్ళీకొట్టు పెట్టుకొని కుమార్తెను పోషిస్తుంది. ఆ రోజూ తన కుమార్తెకు అన్ని సపర్యలూ పూర్తిచేసి కిళ్ళీ కొట్టుకెళ్ళింది. కామాంధులైన ఇద్దరు యువకులు ఈ స్థితిని గమనించి పథకం పన్నారు. కళ్యాణ్ అనే యువకుడు వీధిలో కావలా ఉండగా మనోజ్ ఇంట్లోకెళ్ళి అత్యాచారానికి పాల్పడ్డాడు. తనకేం జరిగిందో తెలియని ఆ యువతి తల్లికేమీ చెప్పలేక పోయింది. కనపడ్డ ఆనవాళ్ళను బట్టి తల్లే ఇరుగుపొరుగును విచారించి విషయం తెలుసుకుంది. కళ్యాణ్‌ను గుర్తుపట్టి పట్టుకోవడంతో అసలు విషయం వెలుగు చూసింది. బాధితురాలి తల్లి పెట్టిన కేసు మేరకు నిందితులను అరెస్టు చేశారు. గుంటూరు జిల్లా తాడికొండకు చెందిన మరో మానసిక వికలాంగురాలిపైనా ఇలాంటి అకృత్యానికే ఓ కామాంధుడు యత్నించాడు. వాడి చేష్టలకు భీతిల్లిన ఆమె ప్రతిఘటించింది. ఒప్పుకోమంటూ చేతులపై వాతలు పెట్టాడు. ఆమె కేకలు వేయడంతో వాడు పరారయ్యాడు. వికలాంగుల హక్కుల జాతీయ వేదిక (ఎన్‌పిఆర్‌డి) జోక్యం మేరకు కేసు నమోదు చేశారు.

కర్నూలు జిల్లాలో మరో ఇద్దరు మానసిక వికలాంగ మహిళలపై అత్యాచారాలు జరిగాయి. ముద్దటమాగి గ్రామానికి చెందిన గొల్ల మంగమ్మ ఒంటరిగా ఉన్న సమయంలో కురవ గాదిలింగప్ప ఆమెను మాయమాటలతో తన ఇంట్లోకి తీసుకెళ్ళాడు. అవీ ఇవీ పెడుతూ నమ్మకం కలిగించి అదే రోజు మధ్యాహ్నం అత్యాచారానికి పాల్పడ్డాడు. దీనిపై కేసు నమోదు చేశారు. ఆమె మానసిక స్థితిని గుర్తించిన ఎస్సై డిఎన్ఎ పరీక్షల నిమిత్తం మంగమ్మను కర్నూలుకు పంపించారు. నిజాయితీగా పరీక్షలు నిర్వహిస్తే డిఎన్ఎ పరీక్ష ద్వారా తేలిన వివరాలు బలమైన సాక్ష్యంగా నిలవొచ్చు. కొడుమూరు మండలం వెంకటగిరిలో మరో మానసిక వికలాంగు రాలు ఇలాగే అత్యాచారానికి గురైంది. ఆమె వయస్సు 40 సం॥రాలు ఆ రోజు పీర్ల పండగ. అదే రోజు చిన్న స్థాయి సర్కస్ ఒకటి జరుగుతోంది. మద్యం తాగిన బలిజ రామలింగప్ప, బోయః గిడ్డయ్య బహిర్భూమికి వెళ్ళిన ఆ మానసిక వికలాంగురాలిపై అత్యాచారానికి ఒడిగట్టారు. ఎన్‌పిఆర్‌డి, బంధువుల జోక్యంతో పోలీసులు కేసు నమోదు చేశారు.

ప్రకాశం జిల్లాలో మరో భిన్నమైన కోణం వెలుగు చూసింది. ఒంగోలు జాతీయ రహదారిపై మతిస్థిమితం లేకుండా తిరుగుతున్న ఓ మానసిక వికలాంగురాలిని గుర్తు తెలియని వాహనం ఢీ కొట్టింది. స్వల్పంగా గాయపడిన ఆమెను స్థానికులు 108 వాహనంలో కలెక్టరేట్ ఎదురుగా ఉన్న పాత రిమ్స్ వైద్యశాలకు తరలించారు. ఆరోజు రాత్రి విధి నిర్వహణకొచ్చిన పారిశుధ్య కార్మికుడు పల్లెపు హనుమంతరావు ఆమెపై కన్నేసి మద్యం సేవించి వచ్చాడు. ఆమెను



వీల్‌ఛైర్లో ఎక్కించుకుని ఖాళీ వార్డుకు తీసుకెళ్ళి అత్యాచారానికి పాల్పడ్డాడు. భయంతో ఆమె కేకలు వేయడంతో విధుల్లో ఉన్న డాక్టర్ తలుపులు వగులగొట్టి నిందితుణ్ణి పట్టుకున్నారు. డాక్టర్ నీరజ ఫిర్యాదు మేరకు నిందితుణ్ణి అరెస్టు చేశారు. అత్యాచారానికి గురైన మానసిక వికలాంగురాలు గుజరాతీ కావడం, ఆమె ఎవ్వరితో మాట్లాడే స్థితిలో లేకపోవడంతో పూర్తి వివరాలు తెలియరాలేదు. మతిస్థిమితం లేని ఆమె ఆ రాత్రి ఆ వైద్యశాల నుంచి అదృశ్యమైంది. ఈ సంఘటన 2010 జూన్‌లో జరిగింది. అత్యాచార ఆరోపణకు గురైన హనుమంతరావు బెయిల్‌పై వచ్చి అదే ఆస్పత్రిలో విధుల్లో చేరాడు. మరి వీరి విషయంలో చట్టాలేం చేస్తున్నాయి? ఈ కేసులు ఎప్పటికి విచారణకొస్తాయి? వచ్చేలోపు దొర్లిపోయే కాలచక్రం నిందితులకు శిక్షలేయిస్తుందా?

ఈ ప్రశ్నలపై న్యాయ నిపుణులను అడిగితే పోలీసు ఇన్వెస్టిగేషన్ రిపోర్టు (ఎఫ్ఐఆర్) ప్రధాన ఆధారంగా ఉంటుందంటున్నారు. ఆలిండియా లాయర్స్ యూనియన్ రాష్ట్ర ఉపాధ్యక్షులు బివి రామాంజనేయులును సంప్రదించగా ఇలాంటి కేసుల్లో నిందితులను శిక్షించేందుకు ప్రత్యేక చట్టాల్లేవన్నారు. ఇతర అవయవాలు బాగుండి సామర్థ్యం ఉంటే మూగ, అంధ యువతులు సైగల ద్వారా నిరూపించుకోవచ్చున్నారు. మతి స్థిమితం లేనోళ్ళకు పోలీసు నివేదికే ఆధారమన్నారు.

గృహహింస చట్టంలో సెక్షన్ (బి) కింద లైంగిక దుర్వినియోగం క్లాజు ఉన్నా వికలాంగ మహిళల గురించిన ప్రత్యేక ప్రస్తావన లేకపోవడం గమనార్హం. అదే సెక్షన్ (డి) కింద 'ఆర్థిక దుర్వినియోగం' గురించిన క్లాజు వుంది. బాధితురాలికి అర్హతగల వనరులు అందకుండా చేసినా, అమ్మినా, దానిపై సౌకర్యం పొందకుండా నిలువరించినా 'నేరం'గా గుర్తిస్తోంది. దీనిని కూడా భర్తలొదిలేసిన వికలాంగ మహిళలు వినియోగించుకోలేని స్థితిలో ఉన్నారు.

ఖమ్మం మున్సిపాలిటీ జహీర్‌పుర తండాకు చెందిన కొండా వెంకటరమణ (22) భర్త నిరాదరణకు గురైంది. మూడేళ్ళ క్రితం ఆమెకు పెళ్ళయ్యింది. బాబు పుట్టాడు. పోలియోతో వంకరపోయిన కాలు పనిచేయడానికి ఆటంకంగా మారింది. దీంతో భర్త వదిలేసాడు. ఆమె తల్లి వద్దకు చేరింది. వదిలేసిన భర్త గురించి చెబితే పట్టించుకునేవారు లేరు. బతకలేకపోతున్నా నన్నా ప్రభుత్వమూ స్పందించలేదు. కన్నతల్లే కాయకష్టం చేసి ఆమెనూ, ఆమె బిడ్డనూ పోషిస్తోంది. చిత్తూరు జిల్లా పలమనేరుకు చెందిన గౌరమ్మకు రెండు కాళ్ళూ లేవు. పెద్దల జోక్యంతో సమీప బంధువుకిచ్చి వివాహం జరిపించారు. ఒక బిడ్డ పుట్టాక ఆ భర్త చెప్పాపెట్టకుండా మరో స్త్రీతో పారిపోయాడు. ఎన్‌పిఆర్‌డి కార్యకర్తలు జోక్యం చేసుకుని ఆమె కాపురం నిలబెట్టారు. మళ్ళీ కొన్నాళ్ళకు భర్త పెట్టే హింసలు భరించలేక 70 ఏళ్ళ వయస్సులో వున్న తల్లి తండ్రుల వద్దకు తన పిల్లలను తీసుకుని వెళ్ళింది. తనతోపాటు తన పిల్లల భారమూ తల్లిదండ్రులపై మోపలేకపోయింది. ఆమె ఉన్న శక్తిని కూడదీసుకుని బోండాలు చేస్తోంది. తల్లి అమ్ముకొస్తే వారు పొట్టపోసుకుంటున్నారు. ఇలాగే ఇదే పట్టణంలో భర్త వంచనకు గురైన మరో వికలాంగురాలు గుల్జార్ స్థానిక బట్టలకొట్టులో పనిచేస్తూ నెలకు రూ. 500 సంపాదిస్తూ తల్లి దండ్రుల వద్దే ఉంటోంది. వీరిలో చాలామందికి చట్టమే తెలీదు. తెలిసినా వెళ్ళగలిగే శారీరక, ఆర్థిక స్థితి వారిది కాదు. చార్జీలు భరించి తీసుకెళ్ళ గలిగే స్థితిలో వారి కుటుంబ సభ్యులు లేరు.

ఖమ్మం జిల్లా జహీర్‌పుర తండాలో పాచిపనులతో బతుకుతున్న అంధురాలు సక్కుబాయిని భర్త వదిలేసాడు. తెల్లకార్డుపై అప్పటి వరకు ఆమెకిచ్చే 16 కేజీల బియ్యాన్ని 12 కేజీలకు తగ్గించి ఇచ్చారు. వదిలేసిన భర్తకు శిక్షలేదు. ఒంటరిదైన వికలాంగురాలికే బియ్యం కోతపడింది. ఇదొక భాగమైతే వీరి ఆస్తులనూ కాజేస్తున్నారు. చిత్తూరు రేణిగుంటకు చెందిన పుష్పమాల అనే వికలాంగురాలిని ఒక బిడ్డ పుట్టాక ఆమె భర్త వదిలేసాడు. బెంగుళూరులో మరో స్త్రీతో ఉంటున్నాడు. తననుతాను పోషించుకోవడమే ఆమెకు భారం. పైగా భర్త పట్టించుకోకపోవడంతో పుట్టిన బిడ్డ భారం కూడా ఆమెపైనే పడింది. పైగా పన్నెండేళ్ళుగా ఆమె నివాసముంటున్న పూరింటిని ఆమె బావ, ఆయన భార్య కలిసి ఆక్రమించారు. అయినా ఆ యువతికి గృహహింస చట్టం ద్వారా ఎలా లబ్ధిపొందాలో తెలీలేదు. కనుక్కునేంత పరిజ్ఞానం ఆమెకు లేదు. చివరికి ఎన్‌పిఆర్‌డి ప్రతినిధులను ఆశ్రయించింది. సంఘం తరుపున వారు సర్పంచిని సంప్రదించారు. ఆ యువతికి గ్రామపెద్దగా మీరు న్యాయం చేస్తారా? పోరాటానికి దిగి మీడియాకెక్కమంటారా? అని అడిగారు. సర్పంచ్ స్పందించి ఆమెకు ఇల్లు ఇప్పించారు. భర్త తండ్రికి సంబంధించిన పొలం నుండి సంవత్సరానికి నాలుగు బస్తాల ధాన్యం చేర్చేలా ఒప్పందం కుదిర్చాడు. అంటే ప్రభుత్వం హెల్ప్‌లైన్ ఏర్పాటుచేసి ప్రచారం చేస్తే ఈ మహిళలు చట్టాలను ఉపయోగించుకోగలరు. అలాగే గ్రామస్థాయిలోనే తీర్పులూ పరిష్కారాలు చూపగలిగే న్యాయ సహాయ యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. ఇది అసాధ్యం కాదు. సాధ్యమయ్యేలా ప్రభుత్వంతో ఒప్పించే పోరాటానికి వికలాంగులు దిగాలి.

---

## కొండమల్లె వంటి పాయం సీతమ్మ



అడవిలో అనేక వృక్షాలుంటాయి. వాటి మధ్యనే సుగంధాలు వెదజల్లే కొండమల్లెలు పుడతాయి. మనకు కన్పించకపోయినా సువాసనలు ఆ ప్రాంతమంతా విరజిమ్ముతుంటాయి. పాయం సీతమ్మ జీవితం కూడా ఆ మల్లెల వంటిదే. డిసెంబరు 15వ తేదీ సీతమ్మ అనారోగ్యంతో మరణించింది. సీత ఇక లేదన్న విషయం తట్టుకోలేని నిజం. 1969లో కూనవరం మండలం (ఖమ్మం జిల్లా) పెద్ద ఆతుకూరు గ్రామంలోని నిరుపేద గిరిజన కుటుంబంలో జన్మించిన సీతమ్మ తన 15 సం.ల వయస్సులోనే ప్రజా ఉద్యమాలవట్ల ఆకర్షితురాలైంది. అక్షరం ముక్క రాకపోయినా, మొక్కవోని దీక్షతో ఉద్యమాన్ని నడిపింది. గిరిజన మహిళలకు అండగా భద్రాచలం డివిజన్ మహిళా ఉద్యమ నిర్మాతల్లో సీత రెండవ స్థానంలో నిల్చింది. కొమరం రాజేశ్వర్‌గారు, సీత, నేను ముగ్గురం డివిజన్ అంతటా టీమ్‌గా పనిచేశాము. ఆ కాలంలో గిరిజన మహిళలపై భూస్వామ్య పెత్తందార్లు, గిరిజనేతరులు సాగించే అత్యాచారాలు, దాడులు, వేధింపులకు వ్యతిరేకంగా నడుం బిగించి ఐద్వా నాయకత్వాన సమరశీల పోరాటాలు నడిపాము.

భూస్వాములకు తొత్తులుగా మారిన పోలీసులపై ప్రభుత్వ అధికార యంత్రాంగంపై తిరుగుబాటు ఉద్యమాలు నడిచాయి. అన్యాయానికి బలైన అనేకమంది యువతులకు న్యాయం జరిగేవరకు పోరుబాటను వీడలేదు. ఎక్కడికక్కడ మహిళలకు ఏ సమస్య వచ్చినా, అక్కడ ఐద్వా నాయకురాలుగా వెళ్ళి గర్జించేది సీతమ్మ. ఒక గిరిజన స్త్రీని అత్యాచారం జరిపాడని కానిస్టేబుల్‌ను సైకిల్ మీద నుంచి లాగి గల్లా పట్టింది. సీత ధైర్యసాహసాలు, స్త్రీలకోసం ఆమె చేస్తున్న పోరాటాలు విని సినీనటి శారద ఆమె జీవిత గాథను (మన్యంలో మంగమ్మ) పేరుతో సినిమా తీసింది. ఎల్లప్పుడూ జనం మధ్యలో వుంటూ, స్త్రీల అభివృద్ధికి, యితర ప్రజా సమస్యలపై ఎనలేని కృషి చేసింది. తునికాకు రేటు, వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా, వ్యవసాయ కూలీ మహిళల హక్కుల కోసం జరిగిన అనేక పోరాటాల్లో సీత చురుకైన పాత్ర పోషించింది. గిరిజన ప్రజల్ని నిండా ముంచే పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక ఉద్యమంలో ముందు నిల్చింది. పోలీసు దెబ్బలకు చేయి విరిగింది. ప్రజా పోరాటంలో కేసులు, బెదిరింపులకు ఏనాడూ బెదరలేదు. అడవిలో మన్నెం జిత్తడు చెల్లీ అని నువ్వు తల్లికి, చెల్లెళ్ళకు ధైర్యం చెప్తుండేది. ప్రజా ప్రతినిధి అయిన సీత 1995లో తిరిగి 2001 లోనూ రెండుసార్లు జడ్.పి.టి.సి.గా ఎన్నికై నిస్వార్ధ ప్రజాప్రతినిధిగా పేరొందింది. ఐద్వా నాయకత్వం చేసిన పోరాటాలకు గుర్తింపుగా 1991లో రాష్ట్రస్థాయిలో ప్రతిష్టాత్మకమైన దాసరి అనసూయమ్మ మెమోరియల్ అవార్డు సీతక్కను వరించింది. మహిళా సమస్యలపై ఆమె చేసిన కృషిని 1986లో ఆనాటి కలెక్టర్ అభినందించారు. ప్రజాపోరాటంలో అగ్రభాగాన నిలిచి మహిళలకు స్ఫూర్తినిచ్చిన సీత భావి తరాలకు ఆదర్శం. జనవరి 10, 2011 న కూనవరం, పెద్దఆర్మూరు గ్రామంలో ఆమెకు ప్రజలు ఘనంగా నివాళులర్పించారు.

సీత ఆకస్మిక మరణం మహిళా ఉద్యమానికి తీరనిలోటు. ఆమె మృతికి ఐద్వా రాష్ట్ర కమిటీ ప్రగాఢ సంతాపం తెలియజేస్తోంది.

ఆగస్ట్ బెబెల్ రచన

# స్త్రీలు-సోషలిజం

గ్రంధ పరిచయం

-డా॥ వై. రాధాకృష్ణమూర్తి

అనూహ్యమైన వేగంతో అభివృద్ధి చెందుతున్న భారత్‌లో పెద్దపెద్ద అంగలు వేస్తూ పురోగమిస్తున్న ఆంధ్ర ప్రదేశ్‌లో మనం రోజూ వింటున్న వార్తలూ, చూస్తున్న ఘటనలూ ఇవి:

-గర్భిణికి స్కానింగ్ చేసి ఆడ పిల్ల అని చెబితే గర్భస్రావానికి వెళ్ళడం.. అదుకు అన్ని విధాలుగా సహకరిస్తున్న పవిత్ర వృత్తిలోని వైద్యులు.

-ఆడశిశువు పుడితే అంగడిలో అమ్మడం, లేదా చెత్త కుప్పలో పారవేసి రావడం.

-అభం శుభం తెలియని పసిదానిపై నిత్య అత్యాచారాలు. ప్రేమ పేరుతో కన్నె పిల్లల హత్యలు, ఆత్మహత్యలు, యాసిడ్ దాడులు.

-దజన్ల సంఖ్యలో ఆడపిల్లల్ని దేశంలోని అన్ని నగరాల వేశ్యా వాటికలకు అమ్ముకోవటం, లేదా గల్ఫ్ దేశాలకు పశువుల్లా ఎగుమతి చేయడం.

-అమాయక వధువుల్ని ఎన్నారై వరులు, మేధా సంపన్నులు అమెరికా తీసుకువెళ్ళి పెడుతున్న హింసలు.

-ప్రపంచం విస్తుపోయేట్లు మహిళామణులు రాష్ట్ర పతులుగా, పార్టీ అధ్యక్షులుగా, ముఖ్యమంత్రులుగా అత్యున్నత పదవులు నిర్వహిస్తున్న మన దేశంలో మహిళలపై ఇటువంటి అమానుషాలు జరుగుతున్నాయంటే మనం సిగ్గుపడాలి.

దక్షిణ ఆఫ్రికాలో వెనుకబడ్డ నల్లజాతి మెజారిటీగా వున్న ఆదేశంలో పార్లమెంటు స్థానాల్లో 44 శాతం, మంత్రివర్గంలో 41 శాతం, ఎకడమిక్ పోస్టుల్లో 45 శాతం, న్యాయ మూర్తుల్లో 25శాతం స్త్రీలు, కానీ మన దేశంలో మాత్రం చట్టసభల్లో 33 శాతం రిజర్వేషన్‌కోసం నిత్యపోరాటం.

ఈ నేపథ్యంలో-ఇటీవల అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం-ఐద్వా-ఆంధ్రప్రదేశ్ శాఖ ప్రచురించిన "స్త్రీలు: సోషలిజం" అనే గ్రంథం ప్రాముఖ్యత సంతరించుకుంటుంది. ఈ పుస్తకాన్ని రాసింది ప్రసిద్ధ జర్మన్ విప్లవకారుడు, మార్క్స్-ఎంగెల్స్‌ల సమకాలికుడు అయిన ఆగస్ట్ బెబెల్. ఆయన మొదటి ఇంటర్నేషనల్ సభ్యుడు. జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకడు. 1879నుండి జర్మరీస్టాగ్ (పార్లమెంటు) సభ్యుడు. 'ఫ్రాన్స్-జర్మన్' యుద్ధాన్ని వ్యతిరేకించినందుకు 1992నుండి రెండేళ్ళు కారాగార శిక్ష అనుభవించినవాడు. బెబెల్ రాసిన పుస్తకం ఒక గొప్ప పరిశోధనా గ్రంథం. 1879లో ప్రచురింపబడి - 1910 వరకూ తాజా పరచబడుతూ 50 పునర్ముద్రణలు పొందిన అపురూప గ్రంథం ఇది. ఆసక్తికరమైన అంశమేమంటే, స్త్రీలు, కుటుంబ సమస్యలపై ప్రామాణికంగా ఎంచబడుతున్న ఎంగెల్స్ రచన "కుటుంబం పుట్టక - ప్రైవేట్ ఆస్తి" కంటే ఇది అయిదేళ్ళు ముందే వచ్చింది.




**స్త్రీల స్థితిగతులు** విభిన్న సామాజిక ధశల్లో ఎలా వుండేయో, ఎలా మార్పులకు లోనవుతూ వచ్చాయో, వారికున్న శృంఖలాలేమిటో, అవి సోషలిస్టు సమాజంలో ఎలా తెంచబడి అంతమవుతాయో అనేక దాఖలాలతోనూ, గణాంకాలతోనూ రచయిత ఈ గ్రంథంలో వివరించాడు. ఆదిమ మానవసమాజం, మాతృ స్వామిక వ్యవస్థ నుండి పితృస్వామిక వ్యవస్థలోకి ఎలా మారింది, బానిసత్వ వ్యవస్థ నుండి ఫ్యూడల్ వ్యవస్థకు ఎలా మార్పు చెందింది, సమాజగమనంపై క్రైస్తవ చర్చి ప్రభావం ఏమిటి... అనేటటువంటి అంశాలను రచయిత మొదటి భాగంలో వివరించాడు.

ఈ గ్రంథం ప్రధానంగా ఐరోపా దేశాలకు సంబంధించిన అధ్యయనం అన్న విషయాన్ని మనం గమనంలో వుంచుకోవాలి. కానీ చాలా విషయాల్లో అది మన దేశ అనుభవాలకు కూడా సరిపోతుంది.

ఫ్యూడల్ (రాచరిక) సమాజంలో స్త్రీలు ఎప్పుడు పెళ్ళి చేసుకోవాలో ప్రభువులు నిర్ణయిస్తారు. ఈ సమాజంలో స్త్రీలు సెక్స్ బానిసలుగానూ ఉపయోగపడతారు. కాథలిక్ చర్చి తన మతాచారులకూ, నన్స్‌కూ బలవంతపు బ్రహ్మచర్యం విధిస్తుంది. దాని వల్ల వారికి వచ్చే సమస్యలు, సమాజానికి వచ్చే సమస్యలను ఈ గ్రంథంలో బెబెల్ చర్చించాడు. ఒక ఆసక్తికర అంశం పెళ్ళి అయిన వధువును మొదటి రాత్రి అనుభవించే హక్కు అక్కడ ఫ్యూడల్ అధిపతికి గాని, చర్చి అధిపతికి గాని వుంటుంది. దాని నుండి తప్పించుకోవాలంటే నిర్ణీతమైన పన్ను కట్టాలి. దాన్ని 'బెడ్ టాక్స్' అంటారు. మన పురాణాలలోనూ, స్మృతులలోనూ ఉన్న కొన్ని అంశాలు వీటితో సరిపోలుతాయి.

యూరప్‌లో 12, 13 శతాబ్దాలలో బహుభార్యత్వం వుంది. వేశ్యా వాటికలున్నాయి. అవి ప్రభుత్వ లేక చర్చి ఆధీనంలో ఉండేవి. వాటి నుండి వచ్చే లాభాలు ఆ సంస్థల కోశాగారాలకు కట్టాలి. ఇదంతా వేశ్యాగృహాల కన్యలనూ, వివాహితులనూ పురుషుల నుండి రక్షించడానికేనని చెప్పేవారు.

తరువాత చర్చిలో సంస్కరణలకోసం 16వ శతాబ్దంలో ఉద్యమించిన లూథర్ బ్రహ్మచర్యాన్ని ఖండించాడు. పురుషుడికి స్త్రీ సహచర్యం, స్త్రీకి పురుషుడి సహచర్యం సహజ అవసరం అన్నాడు. పెళ్ళి, విడాకులు వ్యక్తులకున్న ప్రైవేటు హక్కు. దీంతో చర్చికి సంబంధంలేదన్నాడు. భర్త నపుంసకుడైతే స్త్రీకి మరోపెళ్లి చేసుకునే హక్కు వుందని లూథర్ వాదించాడు. దంపతుల్ని చావుతప్ప మరేదీ విడదీయరాదని రోమన్ కాథలిక్కులు చెప్పేవారు. లూథర్ - వ్యభిచారాన్ని వ్యతిరేకించాడు. ఇదంతా సమాజం ఫ్యూడల్ స్థితి నుండి బూర్జువా స్థితికి పరిణామం చెందే క్రమానికి సంకేతం.

18 శతాబ్దంలో వరుస యుద్ధాల వల్ల స్థిరసైనిక వ్యవస్థ (స్టాండింగ్ ఆర్మీ) అవసరమైంది. ప్రజలపై పన్నుల భారం పెరిగింది. దాంతో స్త్రీలు కూడా బయట పని చేసుకోవాల్సి వచ్చింది. పరిశ్రమలు కొద్దికొద్దిగా ప్రారంభం కావడంతో స్త్రీలకు జౌళి, లేసు, ఫ్యాక్టరీలలో పని దొరుకుతున్నది. పిల్లలు కూడా ఆ పనికి వెళుతున్నారు. బొత్తిగా విద్యాగంధంలేకుండా తల్లీ పిల్లలు ఇంటిపనీ, ఫ్యాక్టరీ పనీ, గొడ్డు చాకిరీతో నలిగిపోవాల్సి వచ్చిందని బెబెల్ వివరించాడు.

**సెక్స్** గురించి గ్రంథం ఏడవ అధ్యాయంలో ఆయన రాస్తూ లైంగిక కోరికలు స్త్రీకీ - పురుషుడికి కూడా ఎలా సహజమైనవో చర్చించాడు. ప్రసిద్ధ తత్వ వేత్తలైన - కౌంట్, షోపెన్‌హేవర్, బుద్ధుడు, లూథర్‌ల రచనలను బెబెల్ ఉటంకిస్తాడు. సెక్స్ విషయంలో నైతికత, అనైతికత అనే సమస్యలేదని చెబుతాడు, సెక్స్ కూడా ఆకలి, దప్పిక లాంటి సహజమైన కోర్కె అని చెబుతూ ప్రకృతికి - నీతి సూత్రాలు తెలియవే అంటాడు. బ్రహ్మచర్యం అనేది శరీరానికీ, మనసుకూ కూడా మంచిదికాదని చెబుతాడు. ఇది మానసిక రుగ్మతలకూ, ఆత్మహత్యలకూ, అక్రమ సంతానానికీ దారితీస్తుందని వివరిస్తాడు.

**పెళ్లి** గురించి బెబెల్ రాస్తూ బూర్జువా సమాజంలో పెళ్ళి ఆస్తితో ముడిపడి వుంటుందని చెబుతాడు. ఈ సమాజంలో పెళ్లికి ప్రేమ ప్రాతిపదిక కాదు, ఒక బలవంతపు ప్రక్రియ అని చెబుతాడు. సెక్స్ అనేది కేవలం కోరిక తీర్చడం మాత్రమేకాక ఇద్దరికీ సంతోషాన్ని కూడా ఇవ్వాలి. పరస్పర సమన్వయం వుండాలి. ప్రేమ, అనురాగం, పరస్పర అవగాహన... ఏదీలేని పెళ్ళి చట్టబద్ధవ్యభిచారం అని చెబుతాడు. పెళ్లి అనేది బూర్జువా సమాజంలో వ్యాపార కలాపంగా మారిపోయింది. మ్యారేజ్ బ్యూరోలు వచ్చాయి. మ్యారేజ్ మార్కెట్ వచ్చింది! కట్నం పద్ధతి వచ్చింది.

బూర్జువా వివాహ వ్యవస్థలో డబ్బు పాత్ర గురించి వివరిస్తూ “ఈ పెళ్లిళ్లలో కాబోయే పెళ్లాం వయసులో చిన్నదా, పెద్దదా, అందంగా ఉందా, వికారంగా ఉందా, బలిష్టంగా ఉందా లేక రోగిష్టిగా ఉందా, విద్యావంతురాలా లేక అమాయకురాలా, ఏ మతస్తురాలు అన్న విషయాలన్నీ డబ్బు ముందు బలాదూర్. డబ్బులు అవలక్షణాల్నిటినీ సరిచేసేస్తుంది, ఏ ఒక్క మంచి లక్షణం లేకున్నా దాన్ని డబ్బు పరిపూర్తి చేస్తుంది'' అని ఆయన ఈ గ్రంథం 116పేజీలో వివరిస్తాడు.

నాడు బెబెల్ చెప్పిన విషయాలు 130 సంవత్సరాల తరువాత ఇప్పుడు, ఇక్కడ, మన సమాజంలో జరుగుతున్న వాటికి ఎంత చక్కగా సరిపోతున్నాయో చూడండి! బెబెల్ ఉన్నత వర్గాల్లో రాజకీయ అవసరాల కోసం కుదుర్చుకుంటున్న పెళ్లి సంబంధాలను గురించి కూడా ప్రస్తావిస్తాడు.

**విడాకులను** చర్చి, రాజ్యం కూడా కష్టతరం చేశాయి. కుటుంబ సంబంధాలను నిలబెట్టడానికి ఇలా చేయడం అవసరం అన్నారు. ఆ నిర్బంధం స్త్రీలకు ఎక్కువ ఇబ్బందికరంగా వుంటుంది. మొగుడు హింసపెట్టినా, తిరుగుబోతు అయినా తనకు మార్గం లేదు. అతగాడు ఎన్ని వివాహేతర సంబంధాలు అయినా పెట్టుకోవచ్చు. ఆమెకు మాత్రం అన్ని రకాల నైతిక బంధనాలూ విధించారని బెబెల్ వివరించాడు.

ప్రఖ్యాత రచయిత అలగ్జాండర్ డ్యూమాస్ ఒక సందర్భంగా రాస్తాడు: మనిషి రెండు నైతిక నియమాలు పెట్టాడు. ఒకటి తనకు, ఇంకోటి స్త్రీకి. తను మాత్రం ఎందరు స్త్రీలతో అయినా సంబంధం పెట్టుకోవచ్చు. స్త్రీకి ఆ స్వేచ్ఛ లేదు. ఆమె ఒక్క వ్యక్తికే కట్టుబడి ఉండాలి.

కార్మిక కుటుంబాలలో మరో రకమైన పరిస్థితి ఉంది. ఈ కుటుంబాల్లో స్త్రీ ఇంటా బయటా గొడ్డు చాకిరీ చేస్తుంది. అలిసిపోతుంది. మగవాడు 8లేక 10 గంటలు ఫ్యాక్టరీ శ్రమతో అలిసిపోయి వేరే వినోద సదుపాయం లేక పేకాటకో, మందుకో బానిస అయిపోతాడు. తాగి ఇంటికి వస్తే ఇక ముచ్చట్లకూ, ప్రేమకూ అవకాశం ఎక్కడిది? ఆ రకంగా వారి కుటుంబాలు విచ్ఛిన్నం అయిపోతున్నాయి అని బెబెల్ వివరించాడు.

శిశు హత్యలు, గర్భస్రావం గురించి కూడా బెబెల్ చర్చించాడు. వీటిపై ఆ కాలంలో యూరప్‌లోని వివిధ దేశాలలో వున్న చట్టాలను విశ్లేషిస్తూ, అవన్నీ పురుషుల పక్షపాతిగానే వున్నాయని నిర్ధారిస్తాడు. పై నేరాలకు కారణాలు 1. దారిద్ర్యం వల్ల బిడ్డను పోషించలేమన్న భయం. 2. భర్తలకు త్వరగా అందుబాటులో ఉండటానికి, 3 అక్రమ సంబంధాలు, 4. తమ అందాన్ని కాపాడుకోవడానికి.. ఈ విధంగా వీటి కారణాలను విశ్లేషించాడు బెబెల్.

విద్య గురించి ఈ గ్రంథంలో ఒక అధ్యాయమే ఉంది. స్త్రీలు పురుష టే శారీరకంగా సున్నితంగా, కాస్త బలహీ గా వుంటారు. ఇది జన్యుపరంగా వచ్చే అంశం. మరి కొంత మానసికంగా కూడా వెనుకబడి వుంటున్నారు. దానికి కారణం పురుషులే. పురుషులు తరతరాలుగా వారిని అణచి వుంచేస్తూ వచ్చారు. వారికి సరైన విద్య, నైపుణ్యం అందిస్తే ఆకాశాన్ని అందుకోగలరు. ఈ వాస్తవం బాల్జాక్, గొథే లాంటి మహారచయితలు చెప్పడాన్ని వుటంకిస్తాడు.

స్త్రీలు ఇంకాస్త తక్కువ సెంటిమెంటుతోనూ, కాస్త ఎక్కువ హేతుబద్ధంగా వుండగలిగితే బరువు బాధ్యతలను కాస్త తగ్గించుకుని, ప్రపంచ జ్ఞానాన్ని, జీవిత వాస్తవాన్నీ తెలుసుకునే ప్రయత్నం చేస్తే అది స్త్రీ పురుషులు ఇద్దరికీ ఉపయుక్తంగా వుంటుంది. ఇప్పటివరకు ఆమె యొక్క సర్వతోముఖాభివృద్ధిని తొక్కి పట్టివుంచారు. ఆమె మేధో పరిణితికి అడ్డుకట్టవేస్తూ వచ్చారు. అందుకనే ఆమె అన్ని

రకాల సెంటిమెంట్లకూ, మూఢ విశ్వాసాలకూ, అద్భుతాలకూ, మోసాలకు, మతవిశ్వాసాలకూ తేలికగా వశీభూతులవుతూ ఉంటుంది.

పురుషులు తమ సంకుచిత దృష్టి వల్ల ఈ స్థితిని మార్చే ప్రయత్నం చేయడంలేదు. ఈ రకమైన తప్పుడు విద్య వల్ల ఆమె ఈ ప్రపంచాన్ని పురుషునిలా వాస్తవికంగా చూడలేక పోతున్నది. వారి మధ్యగల అగాధానికి ఇదే కారణం.

పురుషులు అధికంగా సమాజ కార్యక్రమాలలో పాల్గొనడం ద్వారా మానసిక పరిణితి పొందుతున్నారు. స్త్రీలకు ఆ అవకాశం లభ్యం కావడం లేదు.

పురుషుడు తన అభిప్రాయాలు, ఆశయాలు, లక్ష్యాలు స్త్రీకి పట్టవనుకుంటాడు. ఆమె వాటిని అందకోలేకపోతే తెలియజెప్పే ప్రయత్నం చేయడు. "అదంతా నీకు అర్థం కాదులే" అని నోరు మూయిస్తాడు.

ఎంతమంది గృహిణులు జీవితమంతా వంటకూ, ఇంటి శుభ్రతకూ అంకితం చేయడం లేదు? ఎంతమంది తమ ఇంటి చాకిరికీ తమ అందాన్ని, ఆనందాన్ని అర్పించి, చిన్న వయస్సులోనే ముడతలు పడ్డ శరీరంతో, మామ్మలుగా మారిపోవడం లేదు? వారు ప్రతిరోజూ వేసేది ఒక్కటే ప్రశ్న " ఈ రోజు ఏం వండను?" అని.

సరైన విద్యలేక చాలామంది స్త్రీలు తమ అందానికి అలంకారానికి, దుస్తులకూ, నగలూ నాణ్యాలకూ, అంకితమై అదే జీవిత పరమార్థమన్నట్లు వుంటున్నారు. పురుషులు వాటిని స్త్రీల ''సహజ లక్షణాలు''గా అపహాస్యం చేస్తారు. అతివాగుడు, చాడీలు చెప్పటం, చిల్లర విషయాలు పదే పదే చర్చించడం, ఈర్ష్యా, అసూయలూ ఈ లక్షణాలన్నీ నాడున్న సామాజిక పరిస్థితుల నుండి వచ్చినవే.

ఇదీ స్త్రీల పరిస్థితి గురించి బెబెల్ తన గ్రంథంలో చేసిన విశ్లేషణ. నేటికీ ఇది మనకు నూటికి నూరు పాళ్ళు నిజమనిపించే అద్భుతమైన విశ్లేషణ.

వీటిని అర్థం చేసుకోవడానికి జీవశాస్త్రాన్ని అధ్యయనం చేసినట్లు సీరియస్‌గా ఒక శాస్త్రీయ విశ్లేషణ అవసరమంటాడు బెబెల్.

మతం ప్రవేశపెడుతున్న తిరోగమన భావాలు విద్యాలయాల్లో చిన్నప్పటి నుంచి అడ మగ పిల్లల్ని వేరు వేరుగా వుంచడం కూడా స్త్రీల వెనుకబాటు తనానికి కారణం. మగ పిల్లలతో తాము సమానమనీ, పోటీ పడగలమనే భావన రావడానికి కలిసి చదువుకోటం తోడ్పడుతుంది.

**సున్నితత్వం:**స్త్రీలు సహజంగానే ఇంపల్సివ్‌గా ఉంటారు. నిస్వార్థత, సేవా భావం ఎక్కువ. పిల్లల్ని పెంచడంలో తన వారికి ఆరోగ్య సమస్య వస్తే ఓపికగా సేవ చేయడంలో వారి సున్నితత్వం కన్పిస్తుంది. ఏ విషయంలోనైనా కోపం వస్తే నిగ్రహించుకోలేరు అని బెబెల్ స్త్రీల సున్నిత మనస్తత్వాన్ని గురించి వివరిస్తాడు.

స్త్రీలు పురుషుల కన్నా శారీరకంగా బలహీనులు. ఆచార పరంగా, చట్టపరంగా వారికి లోబడి ఉండాలి. ఆమెకున్న ఒకే ఒక ఆయుధం నాలుక! సహజంగానే మగవారికి వ్యతిరేకంగా అవసరమైతే దాన్ని అతిగా ఉపయోగించడం జరుగుతుందని అంటాడు.

ఆమెకు పురుషునికి లేని ప్రత్యేక శారీరక బాధ్యతలున్నాయి. బిడ్డల్ని కనిపెంచాలి. అందుకు తగిన పోషణ అవసరం. కానీ చాలా సందర్భాలలో ఇంట్లో అందర్నీ కనిపెట్టి చేసి ఆమె తన గురించి పట్టించుకోదు. అది తన వైవాహిక బాధ్యత అనుకుంటుంది. ఎక్కువ శాతం మందిలో రక్తహీనత, బలహీనత, రోగగ్రస్తత ఉండటానికి అదే కారణం. తన స్త్రీ అలా వుండటం పురుషునికి మాత్రం ఏమి సంతోషం? ఇంకా 'లోకరీతి' ప్రకారం మొగుడు బయట తిరుగుతున్నా నోరు మూసుకోవాలి. ఆమెను ఇది మరింత కుంగదీస్తుంది అని అంటాడు బెబెల్.

ఒక సంగతిని మనం మరిచి పోకూడదంటాడు. చాలా సందర్భాలలో స్త్రీల ఈ దైన్య స్థితికి పురుషుడే కారణం. పైగా వ్యాధులు తెచ్చి ఆమెకు అంటిస్తూ కూడా వుంటాడు. పిల్లలు పుట్టకపోవడానికి కూడా అది కారణం కావచ్చు. కానీ దీనికోసం మళ్లీనిందలు పడేది స్త్రీయే.

ఆనాటి యూరోపియన్ సమాజంలో తరచుగా వచ్చే యుద్ధాలు వగైరా కారణాలతో పురుషుల సంఖ్య తగ్గిపోవటం వల్లనూ, వారిలో కొందరు పిల్లల్ని పోషించలేమన్న భయంతో బ్రహ్మచారులుగా ఉండి పోవడం వల్లనూ, స్త్రీ పురుష నిష్పత్తిలో తేడా వస్తున్నది. అది స్త్రీలకు అననుకూల పరిస్థితి. ఈ సమస్య గణాంకాల ఆధారంగా చర్చించబడింది.

**వేశ్యా వాటికల సమస్య:** బూర్జువా సమాజంలో పోలీసు, సైన్యం, చర్చి వున్నట్లే వేశ్యా వాటికలు కూడా ఒక అవసరంగా మారాయి. చట్టం దీన్ని నేరం అంటుంది. చర్చి దీన్ని అనైతికం అంటుంది. కానీ ఈ రెంటినీ సహిస్తానే, కాదు రక్షిస్తానే వుంటాయి. ఇక్కడ స్త్రీ, పురుషుల్ని సమానంగా చూడరు. తప్పంతా ఆమెదే అని నిర్ధారిస్తారు. సమాజంలోని అన్ని అంతస్తుల వారూ దీన్ని పోషిస్తూనే ఉంటారు. దీన్ని నిషేధించే చట్టాలపైన చాలా దేశాల్లో ఎడతెగని చర్చలు నడుస్తూనే వుంటాయి. చివరికి, ఆచరణలలో సాధ్యం కాదు అని అసలు విషయాన్ని వివరించాడు బెబెల్.

**జబ్బులూ, గర్భస్రావాలు** గురించి గణాంకాలు చాలా ఉన్నాయి. ఒక ఉదాహరణ: నవ జాత శిశువును చంపి కాలువలో పారేసినందుకు ఒకామెకు శిక్ష పడుతుంది. అలాంటివి ఎంత మోతాదులో వున్నాయో తెలుసుకునేందుకు ఒక కమిటీ వేశారు. కొద్ది రోజుల్లో పోలీసులు రైన్ నది (జర్మనీ)లో 38 మృత శిశు శరీరాల్ని కనుగొన్నారు. తల్లులు ఎవరో తెలియలేదు.

**ఉద్యోగాలు, వృత్తులు:** పారిశ్రామికంగా వేగం పుంజుకున్న యూరోపియన్ దేశాల్లోనూ, అమెరికాలోనూ స్త్రీలను మరింతగా ఉద్యోగాల్లో పెట్టుకుంటున్నారు. ఈ అంశం చాలా లోతుగా పరిశీలించాడు బెబెల్. చాలా గణాంకాలు ఇచ్చాడు. వారిని ప్రమాదకర పరిశ్రమల్లో కూడా కార్మికులుగా నియమిస్తున్నారు. పరిస్థితులు ఘోరంగా వుంటున్నాయి. వివాహితులు మరింత నమ్మకస్తులుగానూ, స్థిమితంగానూ వుంటారన్న అంచనా , పోటీ వల్ల వారికి తక్కువ వేతనాలు ఇస్తారు. సమాన పనికి పురుషులకంటే తక్కువ వేతనం. కార్మిక కుటుంబాలలో భార్యా భర్తలు ఇద్దరూ పనికి

వెళితే తప్ప కుటుంబాన్ని గడపటం కష్టం కనుక వారు లొంగిరాక తప్పటం లేదు. కాస్త అందంగా ఉన్న యువతులను, రెస్టారెంట్ల లోనూ, బార్‌లలోనూ పెట్టుకుని, కస్టమర్లను ఆకర్షించి, అనైతికతను ప్రోత్సహించటం ద్వారా లాభాలు గుంజుకుంటున్నారు అని బెబెల్ రాశారు.

స్త్రీలు, ఉపాధ్యాయులుగా, లాయర్లుగా, డాక్టర్లుగా, సైంటిస్టులుగా క్రమేపీ వస్తున్నారు. కానీ పురుష పుంగవులు అభ్యంతరాలు చెబుతున్నారు. వారిని ఈ వృత్తులకు సహజంగా ఉండవలసిన తెలివి తేటలు వుండవని వాదిస్తున్నారు.

ఈ వాదనలు ఎక్కువ కాలం నిలవవు అని ఘంటాపథంగా చెబుతాడు బెబెల్. స్త్రీలు తిరిగి వెనుకటి జీవితంలోకి పోరు అంటాడు. సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతున్న కొద్దీ పాతకాలపు అభిప్రాయాలు, విశ్వాసాలు, మారక తప్పదంటాడు. అవకాశం ఇస్తే స్త్రీలు నేర్చుకోలేనిది లేదు. అసలు పురుషుల కంటే వారు చాలా త్వరగా, తేలిగ్గా ఏ పనైనా నేర్చుకోగలరు. మారిన పరిస్థితులకు అనువుగా అడ్జెస్టు కావడం వారి స్వభావంలోనే వుందంటారు.

పరిపాలనా సామర్థ్యం తీసుకున్నా చరిత్రలో ఎంతోమంది స్త్రీలు పాలనా దక్షులుగా నిరూపించుకున్నారు. "ఏ విధంగా చూసుకున్నా రాజకీయాల్లో పురుషుల కన్నా స్త్రీలే బాగా రాణిస్తారు. ఇంగ్లండు చరిత్రను చూస్తే రాజులకన్నా రాణులే బాగా పరిపాలించారు"అని గ్రంథంలోని 234వ పేజీలో పేర్కొనాడు.

మన భారత దేశ ప్రాచీన, ఆధునిక చరిత్రలో కూడా అలాంటి అనేక ఉదాహరణలు, అనుభవాలూ లేకపోలేదు.

స్త్రీల మెదడు బరువు, పురుషుల కన్నా తక్కువ అని కొందరు సూచిస్తున్నారు. మెదడు బరువుకూ, మేధాశక్తికి సంబంధం ఉన్నట్లు దాఖలాలు లేవు. ఆ మాటకొస్తే శాస్త్రవేత్తలు కనుగొన్న 3వ అత్యధిక బరువున్న మెదడు ఒక పిచ్చివాడిది. అంతేకాదు చీమలకూ, తేనెటీగలకూ ఉన్న మెదడు బరువెంత? తెలివి గొర్రెలకూ బర్రెలకూ వుందా? మానవుల్లో కూడా భారీ కాయం వున్న వారి కంటే చిన్న సైజువారే ఎక్కువ తెలివైన వారుగా వుంటున్నారు. అంటాడు బెబెల్. ప్రత్యేకించి వైద్య రంగంలో స్త్రీలు పురుషులకన్నా మంచి పాత్ర పోషించగలరని చెబుతాడు. అలాగే కొత్త ఆవిష్కరణల్లోనూ స్త్రీల పాత్ర గురించిన వివరణ ఉంది.

స్త్రీలకు దక్కవలసిన న్యాయపరమైన, పౌర, రాజకీయ పరమైన హక్కుల కోసం యూరప్ దేశాలలో 19వ శతాబ్దంలో జరిగిన ఆందోళనలూ చేసిన చట్టాలూ వాటి అవసరాలు వివరించాడు. స్త్రీలు తమ హక్కులకోసం పోరాడేటప్పుడు మిత్రుల కోసం వెదుక్కోవాలి. సహజంగానే కార్మిక వర్గ ఉద్యమాలలోనే వాటికి కావలసిన మద్దతు లభిస్తుంది అని చెబుతాడు.

సమకాలీన అస్తిత్వవాద మహిళా బృందాలు గమనించవలసిన ఒక ముఖ్యాంశాన్ని బెబెల్ ఇలా చెప్పాడు.

వర్గ సమాజంలో ప్రైవేటు ఆస్తి, ఐశ్వర్యం అధికారాన్ని నిర్ణయిస్తాయి. దాన్ని నిలబెట్టుకునేందుకూ, రక్షించుకునేందుకూ ఆ వర్గం తీవ్రంగా ప్రయత్నిస్తుంది. శ్రామిక వర్గం నూతనంగా ఆవిర్భవిస్తున్న వర్గం. దాని చారిత్రక కర్తవ్యం తన విముక్తి, తనతోపాటే అణచివేతకు గురవుతున్న అన్ని సెక్షన్ల విముక్తి కూడా. వాటిలో ఒక భాగమే స్త్రీ విముక్తి.

**పన్నులు** సంబంధించి పెట్టుబడిదారీ ప్రభుత్వాలు అనుసరించే ప్రత్యక్ష, పరోక్ష పన్నుల విధానాన్ని దానిలోని అన్యాయాన్ని బెబెల్ విపులంగా వివరిస్తాడు. ఇది చదువుతుంటే మనం ఇప్పుడు మన దేశంలోని పన్నుల విధానాన్ని చర్చిస్తున్నట్లు ఉంటుంది.

**యుద్ధాలు** గురించి చెబుతూ పెట్టుబడిదారీ వ్యవస్థ దేశాల మధ్య యుద్ధాలకు దారితీస్తుందంటాడు. ఆ ఖర్చుల వల్ల విద్య, నాగరికత ఎలా పతనమవుతాయో వివరిస్తాడు. ముఖ్యంగా స్త్రీల జీవితంపై యుద్ధాల దుర్భర ప్రభావాన్ని ఎత్తి చూపుతాడు. సుప్రసిద్ధ గ్రీకు తత్వవేత్త ప్లేటో తన 'రాజ్యం' గ్రంథంలో ఏనాడో సూచించాడు. రాజ్యంలో రెండు వర్గాలు వుంటే, పరస్పర ఘర్షణలో వుండే రెండు రాజ్యాలు ఉన్నట్లే. దారిద్ర్యంలో వున్న ప్రజలు, సాయుధులైతే వారి గురించి ప్రభుత్వం శత్రురాజ్యం కంటే ఎక్కువ భయపడుతుంది.

ఈ పుస్తకం చివరిభాగంలో రాబోయే సోషలిస్టు సమాజ రూపురేఖలు ఎలా వుండబోతున్నాయో స్థూలంగా చర్చించాడు బెబెల్. సోషలిస్టు సమాజంలో అందరికీ పనిచేసే అవకాశం లభిస్తుంది. శ్రామికులకు అన్ని హక్కులూ లభిస్తాయి. సంతృప్తి చెందిన కార్మిక శ్రమవల్ల ఉత్పాదకత బాగా పెరుగుతుంది. మేధో శ్రమకూ, శరీర శ్రమకు మధ్య అంతరం తగ్గిపోతుంది. సమాజం వ్యాపారం కోసం కాక మానవ అవసరాల కోసం వస్తువుల్ని ఉత్పత్తి చేస్తుంది. కనుక ఈ రోజుల్లో లాగా వ్యాపారానికి చోటు వుండదు.

భవిష్యత్తు సమాజంలో 'రాజ్యం'(స్టేట్) స్వభావం ఎలా వుండబోతున్నది చెబుతాడు.

బూర్జువా సమాజంలో దేవుడిని, మతాన్నీ పాలకులు తమ స్థానాన్ని సుస్థిరపరంచుకోవడానికి ఉపయోగించుకుంటున్నారు. మన శత్రువులు ప్రచారం చేస్తున్నట్లు సోషలిస్టులు దేవుడినీ, మతాన్నీ, మత విశ్వాసాలనూ బలవంతంగా రద్దు చేయదు. మార్క్సు అన్నట్లు 'మతం అన్నది కష్టాలు ఉన్న మనిషికి ఒక ఓదార్పు ఇస్తుంది. ఒక భ్రమాజనిత సంతోషాన్ని కలిగిస్తుంది.' ఆ కష్టాల్ని, దుఃఖాన్ని తొలగించగలిగితే దేవుడి అవసరం లేక మతం అవసరం ఉండదు. వాటికవే కనుమరుగైపోతాయి. విజ్ఞాన శాస్త్రం ఇప్పటికే 'సృష్టి' (ఆరురోజుల్లో) వాదాన్ని ఒక 'కల్పన'గా తోసిపుచ్చింది. నీతికీ, సత్ప్రవర్తనకూ మతమే అక్కరలేదు.

అలాగే కొత్త సమాజంలో వ్యవసాయం, పరిశ్రమలు, సాహిత్యం, కళలు, వ్యక్తి స్వేచ్ఛ ఎలా వుంటాయో బెబెల్ చర్చిస్తాడు.

కొందరు శాకాహారం గురించి మనం ఎక్కువ చెప్పడం లేదని వాపోతున్నారు. అత్యధిక సంఖ్యాకులకు తమ ఆహారాన్ని తాము ఎంచుకునే వసతి, అవకాశం లేదు. కొందరంటారు శాకాహారం సాత్వికుల్ని చేస్తుందని. కానీ భారతదేశంలో ఇంగ్లీషు వారి పరిపాలన భరించలేని స్థితికి చేరుకున్నాక ప్రధానంగా శాకాహారులైన హిందువులు ఉగ్రమూర్తులై ఎలా తిరుగుబాటు చేశారని ప్రశ్నిస్తాడు బెబెల్. ఏదైనా సమతుల్యమైన పౌష్టికాహారం ముఖ్యమంటాడు.

స్త్రీలకు సంబంధించినంతవరకు ఇప్పుడున్న 'ఇంటింటికీ వంట' పద్ధతి వారిపై భరించలేని భారాన్ని వేస్తున్నది. ఈ 'ప్రైవేటు కిచెన్' పద్ధతి తీసేస్తే అసంఖ్యాక స్త్రీలకు గొప్ప విముక్తి లభిస్తుందని చెబుతాడు.

రాబోయే కాలంలో గృహ జీవనం (డొమెస్టిక్ లైఫ్) చాలా మార్పులు సంతరించు కుంటుంది. సెంట్రల్ హీటింగ్, విద్యుత్ దీపాలు వస్తే రోజూ స్టవ్‌లు, కిరోసిన్ దీపాలు తుడుచుకుంటూ కూర్చునే శ్రమ తగ్గుతుంది. ఇళ్లు, కార్పెట్లు, ఫర్నిచర్ శుభ్రం చేసు కోవడానికి కూడా పనిముట్లు వస్తున్నాయి. బూట్లు పాలిష్ చేసే చిన్న మిషన్లు కూడా వస్తున్నాయట. అయితే అవి పై ఆదాయ వర్గాలకే పరిమితమవుతున్నాయి. ముఖ్యంగా 'ఇంటి పనిమనుషుల' గురించి రాస్తూ ఇప్పుడు వారు ఆ ఇల్లాలికి అన్ని పనులకూ ఉపయోగపడే బానిసలాగా వుంటున్నారు. ఈ పద్ధతి రద్దయితే 'దొరసానితనం' రద్దవుతుంది' అని పేర్కొన్నాడు.

స్త్రీకి పురుషులతోపాటు సమానంగా విద్యావకాశాలు వస్తే ఆమె శారీరక, మానసిక శక్తియుక్తులన్నీ ఉన్నతస్థాయికి అభివృద్ధి అవుతాయి. సామాజికంగా, ఆర్థికంగా ఇతరులపై ఆధారపడవలసిన అవసరం ఉండదు. తను చేసే పనిలో ఆనందం పొంద గలుగుతుంది. సెక్స్, ప్రేమ వ్యవహారాల్లో పురుషునితో సమానమైన స్వేచ్ఛ కలిగి ఉంటుంది. వారి మధ్య ఉండే ప్రేమ మరింత సహజంగా, ఆరోగ్య వంతంగా వుంటుంది. స్త్రీలపై పురుషుల పెత్తనం చలాయించే పరిస్థితి పోతుంది అని బెబెల్ పేర్కొంటాడు.

ఇప్పుడు స్త్రీ పురుష సంబంధాల్ని 'ప్రైవేటు ఆస్తి' నిర్ణయిస్తున్నది. సోషలిజంలో ఆ 'ఆస్తి'కి స్వస్తి పలుకుతాం గనుక సంతానానికి ఆస్తి దాఖలు పడే వారసత్వ సమస్య వుండదు. స్త్రీకి బంధనం ఉండదు. అవసరం అయితే సంతానాన్ని చూడ్డానికి అనేక ప్రత్యామ్నాయాలు వస్తాయి. ఇప్పుడు స్త్రీ కేవలం ఫలానా వారి భార్య కానీ ఇకముందు ఆమెకు పూర్తి వ్యక్తిత్వం వస్తుంది అని ఆయన పేర్కొన్నాడు.

స్త్రీల పూర్తి బంధ విముక్తి అనేది పురుషునితో సమాన స్థాయి, యువ నాగరికతాభివృద్ధికి సూచికలు. వీటిని సాధించడమే సోషలిజం యొక్క ధ్యేయం. మనిషిపై మనిషి పెత్తనం, శ్రామికుడిపై పెట్టుబడిదారుడి పెత్తనం రద్దవుతుంది. దానిలో భాగంగానే స్త్రీపై పురుషుడి పెత్తనం కూడా రద్దవుతుంది. వేల సంవత్సరాలుగా మానవుడు కలలు గంటున్న ఆ 'స్వర్ణయుగం'లో సోషలిజం ద్వారానే మానవులు తమ సర్వతోముఖాభివృద్ధిని సాధించగలుగుతారు అని బెబెల్ స్పష్టం చేశాడు.

బెబెల్ తన గ్రంథంలోని చివరి వందకు పైగా పేజీల్లో, పెట్టుబడిదారీ సమాజంలో వ్యవసాయ, పారిశ్రామిక రంగాల పరిస్థితిని చర్చిస్తాడు. సంపద ఒక చోట పోగుపడటం, వ్యాపారాల్లో మధ్య దళారుల పాత్ర, సహకార సంఘాలకున్న పరిమితులు, పట్టణాలకు గ్రామాలకు వుండే అగాధం మొదలైన వాటిని అనేక గణాంకాలతో వివరిస్తాడు.

చివరగా.. సోషలిజం కోసం జరిగే మహా పోరాటంలో తమతోపాటు స్త్రీలను కూడా తీసుకువెళ్ళవలసిన బాధ్యత పురుషులకే వుందంటాడు. "భవిష్యత్తు సోషలిజానిది- ప్రాథమికంగా శ్రామికుడిది." అని ముగిస్తాడు.

అగస్ట్ బెబెల్ సమకాలిక కమ్యూనిస్టులందరూ వృత్తి విప్లవకారులు. వారి కార్యస్థానం యూరప్. వారి ఆశయం, ధ్యేయం, లక్ష్యం, ఊపిరి సోషలిజం సాధన. యూరప్ అందుకు సిద్ధంగా వుందని వారి అంచనా. చైతన్యవంతులైన స్త్రీలు పాల్గొనకుండా విప్లవం విజయవంతం కావడం కష్టమని భావించాడు బెబెల్. అందుకే " స్త్రీ సమస్య"పై లోతైన అధ్యయనం చేశాడు.

మన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం 50-60 దశకాల్లో విప్లవానికి చైనా మార్గమా- రష్యా మార్గమా అని ఎడతెగని చర్చ చేసింది. చివరికి 1953లో స్టాలిన్ సలహాతో మనది "భారత దేశ మార్గమే" అని నిర్ణయానికి వచ్చింది. ప్రస్తుతం మన విప్లవానికి బ్యాలెట్ మార్గమా, బుల్లెట్ మార్గమా లేక ఈ రెండింటి మేళవింపు మార్గమా అన్నచర్చ నడుస్తున్నది. ఏ మార్గమో చరిత్ర నిర్ణయిస్తుంది. కానీ ఒక విషయం స్పష్టం. మార్గం ఏదైనా స్త్రీల ప్రమేయం లేకుండా, వారి చైతన్యయుత భాగస్వామ్యం లేకుండా విప్లవమే కాదు ఏ మార్పూ సాధ్యం కాదు. వారిని కూడా సన్నద్ధం చేయడానికి ఇలాంటి సాహిత్యం అవసరం.

ఇది ఇంగ్లీషులో 480 పేజీల ఉద్గ్రంథం. జర్మన్ భాష నుండి సులభమైన ఇంగ్లీషులోకి తర్జుమా చేయబడిన 19వ శతాబ్దపు క్లాసిక్.

**(వుమన్ అండ్ సోషలిజం ఇంగ్లిష్ బుక్‌ను ఈ మధ్య కాలంలో ఐద్వా ప్రచురించింది. త్వరలో తెలుగులోకి కూడా తీసుకువచ్చేందుకు ప్రయత్నం జరుగుతుంది.)**




కె.కె. నర్సింగ్ హోమ్
- అనంతపురం
K.K. NURSING HOME
Kamala Nagar, Opp. Annapurna Lodge,
ANANTAPUR
Ph: (08554) 222133
శత వసంతాల
అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో...
Dr. K. KONDAIAH M.S.,
General Surgeon

*With Best Complitments From*

శత వసంతాల

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకంక్షలతో...





# ఎం. గాంధి

ఎం.ఆర్.ఓ.,

చీమకుర్తి మండంలం, ప్రకాశం జిల్లా.



నూరేళ్ళ అంతర్జాతీయ మహిళా దినోత్సవం

సందర్భంగా రాష్ట్ర మహిళలకు శుభాకాంక్షలతో...

# టి. ఆనంద కుమార్

ప్రొహిబిషన్ అసిస్టెంట్ కమిషనర్

అనంతపురం





సదా మీ సేవలో

శత వసంతాల

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో...

నాణ్యతతో కూడిన బంగారం కొనండి

# SYED JEWELLERY

EXCLUSIVE JEWELS (916 KDM, GEMS)
A/C SHOW ROOM

# SYED AMEER HAMZA JEWELLERY

(We Shape Every Passion in Gold)

A JUNCTIION OF FINE, QUALITY ORIENTED
CADMIUM (KDM) 916 Guaranteed Jewellery

# 23/99, Gandi Bazaar, ANANTAPUR
Tel: (08554) 230345

Fax: 230725, email: Syedjewellary@rediff.com

**అవగాహన సందర్భం**

# 'పిల్లలంటే కాగితప్పూలుకాదు'

-డా. శిలాలోలిత

ఈ సమాజంలో భాగస్వామ్యులమైన మనం, రోజువారీ జీవితాలు వెళ్ళదీస్తూనే ఉన్నాం. చాలా వాటికి రాజీపడుతూ, పడుతూ, అప్పుడప్పుడూ ప్రశ్నిస్తూ, ఎప్పుడన్నా ఎదిరిస్తూ, చలన రహితులుగా జీవిస్తూనేవున్నాం. రాజీపడటం, సమాధానపడడం, ప్రశ్నను మర్చిపోవడం, మనమింతేలే అనేసుకోవడం మధ్యతరగతి లక్షణాలే.

ఇలాంటి తరగతిలో ఉన్నవ్యక్తుల ఆలోచనా విధానంలో విద్యావ్యవస్థను గురించి వివరించుకుందాం.

లోపభూయిష్టమైన, లుకలుకలు అనేకమున్న విద్యావ్యవస్థ వల్ల రేపటి తరం కోల్పోతున్న విలువలు, కొల్లగొట్టబడుతున్న జీవితాల గురించిన విహంగవీక్షణం.

ఎక్కడిదాకానో వద్దు, ఒక్క ఇంటర్‌మీడియట్ వ్యవస్థనే తీసుకుందాం. ఇప్పుడు 'చదువుకోవడం' అనేది లేదు. చదువు 'కొనడమే' వుంది. వాళ్ళవాళ్ళ ఆర్థిక స్థితిగతులు ఆలోచించకుండా పెద్దపెద్ద కార్పోరేట్ కాలేజీల్లో చేర్పించడమే స్టేటస్‌సింబల్ ఐంది. నాకు తెలిసిన కొన్ని కుటుంబాల్లో బంగారం తాకట్టుపెట్టి, అమ్మి చేర్పించిన వాళ్ళున్నారు. అదనపు సంపాదన కోసం అడ్డమైన దార్లు తొక్కి జమచేసే వాళ్ళున్నారు. అదనపు ఉద్యోగాలు, ఓవర్‌టైమ్‌లు చేసి, అనారోగ్యంపాలైన వాళ్ళున్నారు. ఎలాగైనా సరే పిల్లల్ని ఆస్థాయివున్న ఎ.సి రూమ్‌లున్న కాలేజీల్లో చేర్పించేస్తే తమ బాధ్యత తీరిపోయిందను కుంటున్నారు. చేర్చడం వరకే మా బాధ్యత ఆ తర్వాతంతా కాలేజ్ వాళ్ళు చూసు కోవాల్సిందే అని కొందరు తల్లిదండ్రులు చేతులు దులిపేసుకుంటున్నారు. మీపిల్లలు ఎక్కడ చదువుతున్నారు అనే ప్రశ్నలకి జవాబు ఫలానా ఫలానా కాలేజీ అని గర్వంగా ప్రకటించు కుంటున్నారు. సొరచేపల్లాంటి, తిమింగలాల్లాంటి ఈ విద్యాసంస్థలేం చేస్తున్నాయి. నీళ్ళపాలు, చిక్కటిపాలు, మీగడ లాంటి పదాల్తో పిల్లల్ని వడబోసి, వడబోసి, వాళ్ళల్లోవాళ్ళకు పోటీలుపెట్టి, చదువవంటే మార్కులే, బట్టీపట్టడమే ఐ.ఐ.టిలు, యం.సెట్లు గట్రా గట్రాలే జీవితలక్ష్యం లాంటివి నూరిపోసి కార్మికులుగా తయారు చేస్తున్నారు. 12,13గంటలపాటు చదవడం, రాయడం, చదవడం రాయడం, ఆలోచించడ మనేది మర్చిపోవాలి. సృజనాత్మకత లేనేలేదు. బండబారిన మనసుల్లాగా వాళ్ళను మలిచి, కుటుంబ సంబంధాలు, ఇతరవిషయాలేవీ పట్టని జడపదార్థాలుగా తయారు చేయబడుతున్నారు. ఈ కాంపిటీషన్ యుగంలో ఎంత శ్రమిస్తే అంత విజయం. కెరీర్ గోలే ప్రధానం అనేవే పాఠ్యాంశాలు.

తల్లిదండ్రులు, విద్యాసంస్థల పనితీరు ఇలా వుందికదా! మరి పిల్లలేమను కుంటున్నారు. అని ఆలోచిస్తే విషాదం మన చుట్టూ వరద గూడులా చుట్టుకుంటుంది.

అమాయకంగా, గొప్ప జీవితాన్ని ఊహించుకుంటున్న రేపటి తరం మొగ్గలోనే పుష్పించకుండా నేలరాలిపోతున్నది. వాళ్ళ మానసిక స్థాయిని బట్టి, ఐక్యూని బట్టి, చదవగలుగుతారు. గ్రూపుల ఎంపిక విషయంలోకూడా తల్లిదండ్రుల పెత్తనమే. కాలేజీలో చేర్పించడంలోకూడా వాళ్ళదే నిర్ణయాధికారం. కాలేజీలో తీవ్రంగా అవమానిస్తున్నారు, పోల్చుతున్నారు, కొడుతున్నారు. కొందరు చాలాబాగా చెప్తున్నా కొందరు తీవ్రమైన పదజాలంతో దూషిస్తున్నారు? మీఅమ్మా బాబులు కని మామీద పడేశారు లాంటి మాటలు సున్నితమైన మనస్సున్న పిల్లల్ని చాలా గాయపరుస్తాయి. వాళ్ళు చెప్పినా పేరెంట్స్ కొందరు అర్థంచేసుకోరు. పైగా ఇంతఫీజుకట్టాము. ఇప్పుడెలామార్తాం? ఎలాగైనా నువ్వక్కడే చదవాలి. రాంక్ సాధించాలి. హాస్టల్స్‌లో తిండి తినలేక పోతున్నామన్నా అదే జవాబు తల్లిదండ్రులకు నువ్విచ్చే గిఫ్ట్ అదే - అనే మాటలే కానీ, వాళ్ళను అర్థంచేసుకోని తల్లిదండ్రులే ఎక్కువ.



కార్లల్లో దిగే, డబ్బు బలిసిన పిల్లలు తమ స్థితినిచాటుకోవడం కోసం చేసే చేష్టలు చూసి, తాము కూడా అంతడబ్బుండే సమాజంలో భోజుగా జీవించొచ్చు అనుకునే వాళ్ళు కొందరు, వాళ్ళచేష్టలకి నత్తగుల్లల్లా ముడుచుకుపోయి, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడేవాళ్ళు కొందరు.

ఇంటర్‌మీడియట్ ఎగ్జామ్స్‌లో జరిగే ప్రాక్టికల్స్ విషయమే తీసుకుందాం. ఎలా జరుగుతున్నాయనేది జగమెరిగిన సత్యమే పై అధికారులందరికీ ముడుపులు చెల్లించు కుంటూ శాసించే స్థాయిలో విద్యాసంస్థలున్నాయి. ప్రాక్టికల్స్ నాలెడ్జ్ అణుమాత్రమైనా లేని విద్యార్థులు 'వైవా'లో ఏం జవాబులు చెప్ప గలుగుతారు? వాటీజ్‌ద ఇండికేటర్' అని కెమిస్ట్రీలో ప్రశ్నిస్తే, 'వెహికల్‌దా సార్' అనే స్థాయి పిల్లలది. 'రాయి బరువు, నీటిలోఎంత విడిగా ఎంత? కొలవమని ఫిజిక్స్‌వాళ్ళు అంటే, ఏం చెయ్యాలో తెలీక అదే రాత్తో నుదురు కొట్టు కుంటున్న పిల్లలుంటున్నారు. వారానికి ఒకటి చొప్పున ప్రాక్టికల్ క్లాసులు నడిస్తే ఆడుతూ పాడుతూ హాయిగా పిల్లలు నేర్చుకుంటారు. వాళ్ళలో సైంటిస్ట్‌లను, అబ్దుల్‌కలామ్ లాంటి వాళ్ళను చంపేస్తున్నారు. వైవాలో జవాబు చెప్పలేక, ఎగ్జామినర్ పరుషంగా మాట్లాడితే, ఇదికూడా తెలీదా అంటే, ఆత్మహత్యలు చేసుకున్న సున్నిత మనస్కులున్నారు. డబ్బు పడేస్తే మార్కులవే వస్తాయనే టెండెన్సీతో వుండే రేపటి రోజు వీళ్ల ఆలోచనలు ఇంకెంత క్రూరంగా పరిణమిస్తాయి? రేపు ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, రకరకాల రంగాల్లోకి అడుగిడుతున్న వాళ్ల ప్రవర్తనా రీతికి బాధ్యులెవ్వరు? ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ చిన్న జి.వో. పాస్ చేస్తే చాలు. ఇంటర్ లెవల్లో మాతృ భాష, రాష్ట్ర భాషలైన 'తెలుగు' ప్రవేశపెట్టాలని అన్నికాలేజీల్లో అమలు చేసేట్లు చేస్తే పిల్లల్లో భాషా గౌరవం పెరగడంతో పాటు, హాయిగా చదువుకో గలుగుతారు. అలాగే జంబ్లింగ్ సిస్టమ్ పెట్టడం ద్వారా కూడా ప్రాక్టికల్స్ ఎగ్జామ్స్‌లో జరిగే అనేక అవకతవకలు జరగకుండా నివారించొచ్చు. పువ్వుల్లాంటి పిల్లల్ని కాగితప్పూలలా తయారుచెయ్యకుండా, వాళ్ళ జీవితాలను పొగడపూల పరిమళాలతో నింపాలంటే మనం అందరం ఆలోచించాల్సిన రోజులివి. వాళ్ళని స్వయం నిర్ణాయక శక్తులుగా, రేపటితరం నిజాయితీపరులుగా తయారు చేయాల్సిన బాధ్యత మన అందరిదీ. వాళ్ళ జీవితాలను మనం పట్టించుకుంటే ఇంద్రధనుస్సులవుతాయి. రౌడీలుగా, నేరస్థులుగా, ఉన్మాదులుగా, బలహీనులుగా, క్రూరులుగా జడులుగా, శిథిలాలుగా మారకుండా చూడాల్సిన బాధ్యత మనందరిదీ సుమా!

# మల్లు స్వరాజ్యం ఉపన్యాసం

## (మల్లు వెంకట నర్సింహారెడ్డి మెమోరియల్ క్లినిక్ ప్రారంభోత్సవం సందర్భంగా)

వైద్యం నేడు ఖరీదైన వ్యవహారం. సామాన్య ప్రజానీకానికి అందుబాటులో లేదు. రోగమొస్తుందంటే భయం. వైద్యం చేయించుకోవాలంటే వణుకు. ఆరోగ్యశ్రీ పథకాలు ఎవరి ప్రయోజనాల కోసమో అందరికీ తెలుసు. కానీ సాయుధ పోరాటం జరుగుతున్న కాలంలో..... అవకాశాలు, సదుపాయాలు అందుబాటులో లేని ఆ రోజుల్లో తరుణోపాయం ఆలోచించి ప్రజలకు వైద్యం అందించిన ఘనత సాయుధ దళాలది! ఓవైపున పోరాటం చూసుకుంటూనే మరోవైపు ప్రజల బాగోగుల గురించి, వారి ఉన్నత జీవన ప్రమాణాలపై దృష్టి పెట్టడం అసాధ్యం. అలాంటి అసాధ్యాన్ని సుసాధ్యం చేయడం వెనుక అసలైన కారణం దళాల అకుంఠిత దీక్ష, అంకిత భావం. నేడు ఇన్ని సౌకర్యాలుండి సరిపడా నిధులుండి, చేయగల పాలక వ్యవస్థ వుండి కూడా విద్య, వైద్యం వంటి కనీస సదుపాయాలు ప్రజల చెంతకు చేర్చడం ప్రభుత్వానికి కనాకష్టమై పోతోంది. అలాంటప్పుడు అటు నమ్మిన లక్ష్యం దిశగా పయనిస్తూనే...ఇటు ప్రజల మేలుకై తాపత్రయపడిన సాయుధ దళాల పట్టుదలను ఒకసారి మననం చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

**మల్లు స్వరాజ్యం పేరే ఒక ఉద్యమం, ఊపిరే ఉత్తేజితం. స్వరాజ్యం గురించి ప్రత్యేక పరిచయం అవసరమే లేదు. తెలంగాణా సాయుధ పోరాటంలో ఉవ్వెత్తున లేచిన కెరటంగానే కాదు, నేటికీ అదే స్ఫూర్తితో ముందుకు సాగడం ఆమె సహజశైలి. ప్రజల ముంగిట పాలన పేరుకు మాత్రమే నేడు ఉంది. కానీ ఆనాటి ప్రజలు అది చవిచూశారు. ఆ వివరాలను మల్లు స్వరాజ్యం కళ్ళకు కట్టినట్లుగా వివరిస్తుంటే వినడం మనవంతు. మరి విందామా?**

**-మానవి డెస్క్**

స్వతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళయింది. ఇంతమంది నాయకులొచ్చారు. అయినా ప్రజలకు విద్య, వైద్యం లాంటి కనీస సదుపాయాలు అందుబాటులో లేవు. ప్రజల అవసరాలకు తగిన వసతులు లేవు. ఆ రోజుల్లో రాజులే నయం! స్వప్రయోజనాలకు ఎన్ని చేసుకున్నా ప్రజలకు సేవ చేయాలనే కనీస ఆలోచన వారిలో వుండేది. ఈనాటి నాయకులకు డబ్బులిచ్చి ఓట్లేయించుకోవడం, పదవులు సంపాదించుకోవడం, తిరిగి డబ్బులు సంపాదించుకోవడం ఇదే పని. చివరికి నాటి పాలకులు కట్టిన ఆసుపత్రులను సైతం అమ్ముకుంటున్నారు. దీన్ని ప్రజలు సహించకూడదు. నిలేయాలి, తిరగబడాలి.

వీరతెలంగాణ పోరాటంలో పాల్గొన్న మాకు తగిలిన ఎదురు దెబ్బలెన్నో! మేం వాటికి భయపడలేదు. పోరాటంలో ప్రజలే నిజాం దురాగతాలను, దాడులను అడ్డుకుని గ్రామ విముక్తి చేశారు. ప్రజలే పోరాటాలు చేశారు కావున ప్రజాపాలన మొదలైంది. అది కమ్యూనిస్టులు సల్పిన పోరాటం. కనుక గ్రామ పరిపాలన కమిటీలు ఏర్పాటు చేశాం. ఈనాడు చాలా గొప్పగా చెప్పుకుంటున్నారు. కానీ ఆనాడు అంటే 1944-46లో ఏర్పాటైన పంచకమిటీల్లో (పంచాయితీ కమిటీలు) ఇద్దరు స్త్రీలకు పట్టం కట్టాం. ఎందుకంటే ప్రజాసేవలో, పాలనలో గానీ వనతులను అర్ధం చేసుకుని ప్రజలకు మేలుకలిగేలా ప్రజాసామ్యయుతంగా పాలించగల సత్తా మహిళలది. దుర్మార్గాలకు వ్యతిరేకంగా పోరాడటంలో ఆనాడు మహిళల పాత్ర చాలా వుంది. ఆ నమ్మకమే వారికి పదవులు అప్పగించింది. దాన్ని వారు సమర్ధవంతంగా నెరవేర్చారు. ఆ శక్తి మహిళల్లో నాడే కాదు, నేడూ వుంది. ఈనాడు కూడా గ్రామాలలో సామాజిక కట్టుబాటులేని పరిస్థితులను, ఘోరాలను అక్కడి మహిళలు ప్రశ్నిస్తున్నారు. ఏకమై పోరాడుతున్నారు. ప్రశ్నించకపోతే పోరాటాలే వుండవు. సమస్యలు తీరవు. ముఖ్యంగా విద్య, వైద్య రంగాల్లో నా అనుభవం చెప్పాలి.

గెరిల్లా దళాల్లో చదువురాని వాళ్ళే ఎక్కువగా చేరేవారు. మేం వారిలో అక్షర దీపం వెలిగించడానికి పూనుకున్నాం. పలకలు చేతికిచ్చి చదివించాం. 1944లో అన్ని గ్రామాల్లో ఈ ఏర్పాటు చేశాం. వాస్తవిక విషయాలు తెలుసుకోకుండా, చట్టాలను అర్ధం చేసుకోకుండా, అన్యాయాలను అవలోకనం చేసుకోకుండా తిరుగుబాటుకు సిద్ధమవడం కష్టం. కమ్యూనిస్టు పార్టీ తరపున సేవాదృక్పథం వున్న యువతరాన్ని ప్రోత్సహించి పాఠాలు చెప్పించాం. ఒక ఎడ్ల కొట్టంలో చిన్న బడి పెట్టించాం. ఓవైపు ఉద్యమం చేస్తూనే మరోవైపున దళ సభ్యులలో అక్షరజ్ఞానం పెంపొందించాం.



పంచకమిటీలో పరిపాలన చేస్తున్నపుడు ఓ సమస్య గమనించాం. అది మహిళల కాన్పులకు తగిన సౌకర్యాలు లేకపోవడం. అప్పటికి గ్రామాల్లో నాటు మంత్రసానులున్నారు. వారు కొడవలితో బొడ్డు కోయడం, బిడ్డను తీయడం వంటివన్నీ చేసేవారు. కానీ కాన్పుల్లో మరణాలు గణనీయంగా వుండేవి. ఒక సందర్భంగా అప్పటి కమాండరుగా వున్న మల్లు వెంకట నర్సింహారెడ్డి గ్రామ వ్యవస్థల్లో ప్రజలకు వైద్య సదుపాయం కల్పించాలని సూచించారు. అపుడు కమ్యూనిస్టుపార్టీ దీనికి పరిష్కారం ఆలోచించింది. మద్రాసు నుంచి రామదాసు అనే వైద్యుని పిలిపించింది. ఆయన మా దళ సభ్యులకు ఆ అడవుల్లోనే అభిరుచిని బట్టి స్త్రీ పురుషులకు వైద్య శిక్షణ ఇచ్చారు.

ప్రభుత్వం చేస్తున్న ప్రైవేటీకరణ సందర్భంగా గతాన్ని తల్చుకోవాల్సిన అవసరం వుంది. అందుకు వ్యతిరేకంగా ప్రజలు పోరాడాల్సిన అవసరం ఎంతైనా వుంది. అసలు పాలకులంటే ఎవరు? కనీస అవసరాలన్నీ ప్రజలకు అందుబాటులోకి తీసుకురావాల్సిన వారు. కానీ నేడు భూమి, తిండి, గూడు ఇవ్వలేని ప్రభుత్వాలు నడుస్తున్నాయంటే కడు శోచనీయం.

మా శిక్షణ తరువాత వివెన్ మరో సూచన చేశారు. అప్పటికే గ్రామాల్లో పనిచేస్తున్న నాటు వైద్యులను, మంత్రసానులను, అల్లోపతి వైద్యం పరిజ్ఞానం వున్నవారిని, చైతన్యవంతులైన స్త్రీలను కూడగట్టుకోమన్నారు. కాన్పుల సమస్యలను పరిష్కరించడానికి వారికి వైద్య శిక్షణ ఇమ్మన్నారు. అందులో భాగంగా మహిళలకు ముందు శిక్షణ ఇచ్చారు. ఆనాడు పురుషులకు

కాన్పులుచేసే అవకాశం లేదు. అదో ఘోరమైన నేరం కిందే లెక్క. తరువాత గ్రామ కేంద్రాలు పెట్టి అందర్నీ సమావేశపరిచాం. తుప్పుపట్టిన కొడవళ్ళతో కాన్పు చేయరాదని, కాన్పు చేసేముందు కొడవలిని, చేతులను లోషన్‌తో శుభ్రపరిచి వినియోగించాలని చెప్పాం. (చేతులకు గ్లౌజులు అందుబాటులో లేవు గనుక) ఒక గిన్నెలో లోషన్ పక్కనుంచుకోవాలని చెప్పాం. అపుడో మంత్రసాని ఒక సూచన చేసింది. ఆ లోషన్లో ఏముందో.... కడుపులోకి పోయి అదేం కరాబుచేస్తుందో..... మాకు కొత్త. అందుకని మేం పసుపు, వేపాకులను మెత్తగా దంచి చేతులకు రాసుకుంటాం' అంది. మంచిదే, కానీ దాన్ని రుబ్బాక బాగా వడగట్టి రాసుకోమన్నాం. కొన్నిచోట్ల లోషన్ వాడారు. ఆ జాగ్రత్తలు బ్రహ్మాండంగా పనిచేశాయి. పూర్తి తర్ఫీదుతో గ్రామానికో మంత్రసాని తయారయ్యారు. దళ సభ్యులు కూడా అనేక కాన్పులు చేశారు. ఉదాహరణకు నల్గొండ జిల్లాకు చెందిన కమలమ్మకు తుపాకీకన్నా పురుళ్ళు పోయడంలోనే ఆసక్తి ఎక్కువ. కనుక ఆమె ఆ పనులే ఎక్కువ చేసేది.

ఇక మంత్రసానులు మేం చెప్పింది వినడమే కాదు, వారికి తెలిసిన టెక్నిక్స్ కొన్ని మాకు నేర్పారు. కష్టమైన కాన్పుల్లో పిండాన్ని లాగడం చాలా కష్టం. అలాంటప్పుడు పిండాన్ని ఒకరు లాగుతుంటే, వెనుక మరొకరు వారికి సపోర్టుగా భుజాలు పట్టుకుని గట్టిగా లాగేవారు. అపుడు ఆపరేషన్లు లేవుగా! డాక్టర్లు కూడా ఇలా చేస్తారని రామదాసుగారు తర్వాత చెప్పారు. గ్రామ పరిపాలనలో గ్రామ వైద్యులని పేరుపెట్టి ఆకు పసరువారికి, చిన్న అలోపతి వైద్యులకూ తర్ఫీదునిచ్చాం. వారికి కొద్దిగా అక్షరజ్ఞానం వుండేది. వారికి వైద్యశాస్త్రం పుస్తకాలు అందజేసేవాళ్ళం. అవి చదివి వారు మరింత మెరుగైన వైద్యం చేసేవారు. ఆ శిక్షణ బ్రహ్మాండంగా పనిచేసింది. ,' నేను ఏడెనిమిది కాన్పులు చేశా. ఇవికాక అన్ని ఊర్లూ తిరిగి వైద్యం సరిగా జరుగుతుందా లేదా అని చూసేవాళ్ళం.

డాక్టరు రామదాసుగారు మద్రాసు నుండి మందులు పంపడమే కాదు, ఉద్యమానికి పూర్తి సహకారం అందించేవారు. మందులేకాక, వున్న వనరులతోనే వైద్యం చేయడం నేర్పించాం. కాన్పు తరువాత ఆముదం, వాయిలాకు మరగబెట్టిన నీటితో కడుపు శుద్ధి చేయడం, కల్మషమంతా బైటికి తీసి శుద్ధి చేసేవాళ్ళం. ఆ రోజుల్లో కాన్పు తర్వాత 21 రోజుల వరకూ మంత్రసాని బిడ్డను, తల్లిని కనిపెట్టుకుని వుండేది. పిల్లల పట్ల తీసుకోవాల్సిన జాగ్రత్తలు వివరించేది. మేం చేసిన కాన్పులేవీ ఫెయిల్ కాలేదు. వైద్యంపై ఎప్పటికపుడు సమావేశాలు ఏర్పాటుచేసి రివ్యూ చేసేవాళ్లం.

మరోపక్కన గ్రామ విద్య నడిచేదిగా! అక్కడి ఉత్సాహవంతులకు వైద్య శిక్షణ ఇచ్చేవాళ్లం. వారిని గ్రామవైద్యులుగా తీర్చిదిద్దేవాళ్ళం. క్యాంపుపై దాడిచేయడానికి ఒకసారి విఎన్ ఊరైన మామిండ్లమడవ మీదుగా ముప్పాలం వైపుకు వెళ్తున్నాం. అప్పుడక్కడ ఒక కాన్పు కష్టమై మంత్రసాని ఇబ్బందిపడుతోందట. రాజక్క ( అంటే నేనే) ఇటుగానే వెళతోందని వారికి తెలిసింది. వెంటనే కబురు పంపారు. భుజాన తుపాకీతోనే కాన్పుచేశాను. ఆ పిల్లకు స్వరాజ్యం అని పేరు పెట్టుకున్నారు.

టైఫాయిడ్ జ్వరానికి వైద్యం నేర్పాం. బాలింత రోగమని ఎందరో చనిపోతుంటే వీటిని గణనీయంగా తగ్గించగలిగాం. ఇన్ఫెక్షన్లు రాకుండా పెన్సిలిన్‌ను ఉపయోగించాం. మాకున్న కనీస సదుపాయాలతోనే వీటిని గణనీయంగా తగ్గించగల్గాం.

వైద్యం విషయంలో మల్లు వెంకట నర్సింహారెడ్డి గారు చాలా శ్రద్ధ తీసుకునేవారు. ఇంట్లో వాళ్ళ కోసమేకాదు జనం కోసం కూడా అంతే! ఎవరైనా క్రామేడ్స్ ఒంట్లో బాగోలేదంటే చాలు వెంటనే ఆసుపత్రికి పంపేవారు. ఇబ్బందిగా వుంటే ఖర్చులిచ్చేవారు. వైద్యశాల స్థాపించాలని ఆయనకు చాలా కోరిక. 1955లో నేనూ మంత్రసాని ద్వారానే బిడ్డను కన్నాను. ఆస్పత్రిలో కాదు. నిజానికి మల్లు వెంకట నర్సింహారెడ్డి గారు ఆసుపత్రికి తీసుకెళ్లాలని పట్టుపట్టారు. ఆయనకు భయపడి అందరం కలిసి బండిలో దవాఖానాకు పయనమయ్యాం. నాకు దారిలోనే నొప్పులొచ్చాయి. అమ్మ, మంత్రసాని ముందు భయపడ్డారు. తోవలో ఒక బావి, గుడిసె కనిపించాయి. పక్కనే బొడ్డుమల్లె చెట్టుంది. పొయ్యి, కుండ, నీళ్లు కాగబెట్టుకునే వీలుంది. పూర్వం వ్యవసాయ ప్రాంతాల్లో ఆ సదుపాయాలుండేవి. వెంటనే కానుపు చేయాలన్నారు. నేనూ అదే రైట్ కానిమ్మన్నాను. గుడిసెలో మంచం కూడా వుంది. ప్రత్యేకంగా తెరలు కట్టాల్సిన అవసరం లేకపోయింది. ఆఖరుకి ప్రసవం అయింది. మంత్రసాని కొడవలితో బొడ్డు కోసింది. అమ్మ కుండతో నీళ్లు కాగబెట్టింది. మా ఇద్దరికీ స్నానం చేయించారు. తర్వాత ఆసుపత్రితో చూపించాలని విఎన్ పట్టుపట్టారు. దాంతో మేం దగ్గరలోని మిషనరీ ఆసుపత్రికి వెళ్లి మూడ్రోజుల వున్నాం. మా అబ్బాయి బొడ్డు మల్లె చెట్టు కింద పుట్టాడు కనుక వాడికి గౌతముడు అని పేరు పెట్టాం.

ఆ రోజుల్లో వేం 4,000 గ్రామాల్లో విద్య, వైద్యం అందించాం. అందర్నీ కలుపుకుంటే ఇలాంటి శిక్షణ వెయ్యిమందికి ఇచ్చాం. మేం ప్రజల జీవితాల్లో జొరబడ్డాం. కడుపుల్లో జొరపడ్డాం. మనసుల్లో జొరబడ్డాం. ఆనాడు మేము అధికారంలో లేం. ఏ శక్తీ, ఆదాయాలు లేనివాళ్ళం. కానీ ప్రజలకు అన్నీ అందుబాటులోకి తెచ్చాం. అంటే నేటి ప్రభుత్వం ఇది చేయలేని విషయం కాదు. చేయదల్చుకోలేదంతే!

ఏమైతేనేం, విద్య, వైద్యం ప్రజలకు అందుబాటులో వుంచాం. అంతేకాదు సంఘ సంస్కరణతోపాటు మహిళలకూ హక్కులున్నాయనే విషయం అందరికీ అవగాహనలోకి వచ్చింది. అక్కడితో ఆగలేదు. అప్పటి వరకూ గ్రామస్థులకు మూఢాచారాలకు వ్యతిరేకంగా ఎవరూ చెప్పింది లేదు. మేం తర్ఫీదునిచ్చిన వైద్యులే వారికి వాస్తవాలు వివరించేవారు. రోగ నిర్ధారణ చేయకుండా దెయ్యమనే అనుమానాలకు తావివ్వకూడదన్నాం. కులమనే పిశాచిని వెళ్లగొట్టమన్నాం. సామాజికం, ఆర్థికం, విద్య, ఆరోగ్యం......ఇలా అన్నింటిలో ప్రజలను చైతన్యవంతం చేసిన బహుళ ప్రయోజనాల కోసం చేసిన పోరాటమది.

గ్రామ పరిపాలన, వలంటీర్, రక్షణ వంటి విధానాలన్నీ గ్రామ పరిపాలనలో వుండేవి. వీటన్నింటినీ ప్రజలు ఆదరించారు. ఇదీ సరైన పాలనని మెచ్చుకునేవారు. ఆనాడు ప్రజల సహకారం కూడా బాగా వుండేది. వారి మంచికోసమే చెపుతున్నారనే విశ్వాసం వుండేది. అన్నింటిలోనూ స్త్రీలకు సరైన ప్రాతినిథ్యముండేది. స్త్రీఆత్మస్థైర్యాన్ని పెంపొందించడంలో మేం అనేక ప్రయత్నాలు చేశాం. వారు నిత్యం వాడే వస్తువులతోనే ఎదురుతిరిగి ఎలా పోరాడాలో నేర్పాం. కూలికి, కట్టెలు కొట్టడానికి ఉపయోగించే కొడవలినే ఆయుధంగా చేసుకోమన్నాం. పిట్టలు కొట్టడానికి వాడే వడిసెలతోనే నైజాం పోలీసులను తరిమికొట్టమన్నాం. కాసెపోసి కట్టి కొంగుచుట్టిన నడుములోనే ఆత్మరక్షణకై కొడవళ్ళు దాచుకొమ్మన్నాం. అందుబాటులో వుండే కారం, మట్టినే ఉపయోగించి శత్రువులను మట్టి కరిపించమన్నాం. వీటిపైన ఎవరికీ అనుమానం రాదు. ఈరోజుల్లో మహిళలు హ్యాండుబ్యాగులేసుకున్నట్లు ఆ రోజుల్లో మహిళల

దగ్గర కొడవలి వుండేది. కనుక అదే వారి ఆయుధం. దుర్మార్గులను ఎదుర్కొనే సాధనం. ఆ ధైర్యంతో వారంతా ఆ ఆయుధాలతోనే తిరగబడేవాళ్ళు. అలాగే వడిసెలు. మహిళలు వడిసెలతో ఒక్క రాయి విసిరారంటే చాలు వాడి పని ఖతం. తలకు తగిలిందంటే ఇక అంతే. పోలీసులు తోవలో వస్తే మంచెలమీద నుంచి సులువుగా ఎదుర్కొనేవారు. ఇంకేముంది? మాటు చూసి కొట్టేది. తప్పుకునేది. ఇక పోలీసులు పలాయనం చిత్తగించడమే. ఈ విద్య చాలా బాగా పనికొచ్చింది.

అత్యాచారానికి ఒడిగట్టబోయిన ఒకడ్ని ఒక మహిళ కొడవలితోనే ఎదుర్కొంది. ఐదుగురు పోలీసులు వెంటపడ్డే ఓపికున్నంతసేపు పరిగెత్తింది. తర్వాత కళ్ళలోకి మట్టికొట్టి ఒకడి అంగాన్ని నరికేసింది. మరొకసారి సామూహికంగా అందరు మహిళలను ఒకింట్లో తోలి గడియ పెట్టి పోలీసులందరూ ఇంట్లో జొరబడ్డారు. వారిని అత్యాచారం చేయాలని ప్రయత్నించారు. అప్పుడు వాళ్ళు వంటింట్లో వుండే కారంతోనే పోలీసులను ఎదుర్కొన్నారు. రోకలిబండలతో ప్రతిఘటించి పారద్రోలారు. ఆ రోజుల్లో మాసిరెడ్డిపల్లిలోని ఇళ్ళన్నీ తగలబెట్టారు. గ్రామాన్ని నాశనం చేశారు. కానీ మహిళలను ఏమీ చేయలేకపోయారు. ఈ విషయం ఈ కాలం వారికీ తెలియాలి. దుర్మార్గుడు అక్రమానికి ఒడిగట్టినపుడు శాయశక్తులా ప్రతిఘటించాలి.

సమిష్టి వ్యవసాయం చేయించేవాళ్లం. పండింది సమానంగా పంచుకోమనేవాళ్ళం. ప్రజలు మాకు బ్రహ్మరథం పట్టారు. అంతేకాక వివాహ వ్యవస్థలో గ్రామంలో వచ్చే తగాదాలు మహిళలే పరిష్కరించేవారు. గ్రామస్థులకు ఏ ఇబ్బందులొచ్చినా తట్టుకునేలా సమాయత్తం చేశాం. తాగుడుకు దూరం చేశాం. మూఢనమ్మకాలను తొలగించాం. ఫిట్స్ గురించి అవగాహన పెంచాం. వరకట్నం తప్పని చెప్పాం. మహిళలకు రక్షణగా స్త్రీ ధనం న్యాయంగా అందేలా కృషి చేశాం. వితంతువులకు భూమి అందేలా పట్టుబట్టి విజయం సాధించాం. విడాకులు తీసుకుంటే ఆమెకు పైకం ముట్టచెప్పించాం.

నాకు వివిఎన్ 1947లో కమాండరుగా పరిచయం. మాకు 1954లో పెళ్ళయింది. నార్యాపేటలో స్కూలు బాయ్‌కాట్ చేయమన్నపుడు ఆ పిలుపును బట్టి 1945లో ఒక డజనుకు పైగా విద్యార్థులు కలిసి బైటికొచ్చి దళాల్లో చేరారు. దళంలో వివిఎన్ మిలటరీ బాధ్యతలుచేపట్టారు. ధర్మభిక్షంను అరెస్టు చేస్తే ఆయన జైలు చువ్వలు కోసి ధర్మభిక్షంతోపాటు ముగ్గుర్ని జైలునుంచి తప్పించారు. అవి కోయడానికి మూడు రోజులు పట్టిందట. అది కూడా ఎవ్వరికీ అనుమానం రాకుండా రాత్రుళ్ళు చేసేవారు. కానీ ధర్మభిక్షం దొరికిపోయాడు. మరో ఇద్దరు దొరకలేదు. ఇక వివిఎన్, ఇతరులను పట్టుకోవడానికి పోలీసులు వెంటబడ్డారు. వారంతా తప్పించుకుని దళంలో చేరారు.

గ్రామ పాలన రెండేళ్లు విజయవంతంగా జరిగింది. ఇది అనుభవించిన ఫలితం ప్రజలు ఇప్పటికీ గుర్తు పెట్టుకున్నారు. ఇప్పటికీ అక్కడికి వెళ్తే ఆనాటి పోరాట ప్రాంత ప్రజలు నేటికీ అంతే స్వాగతం పలుకుతారు. వారిలో ఎంత సంబరమో ఆత్మబంధువులొచ్చారని. తరువాత నేను ఎమ్మెల్యేగా ఎన్నికయ్యాను. అపుడు తుంగతుర్తికి వెళ్లిననాడు బడి గురించి, వైద్య సలహాలు అడిగారు. ఆరోజు ఒక పాఠశాలో మధ్యాహ్న భోజనం హరిజన మహిళ వండుతుందని గ్రామస్థులెవ్వరూ తమ పిల్లలను పంపలేదు. అపుడు నేను అందరి ఇళ్ళకీ వెళ్ళి పిల్లల్ని రావాలని, తినాలని చెప్పాను. అక్కడికి అనేక మంది మహిళలను కూడగట్టుకుని తిరిగి ఊరేగిరపు చేశాం. ఇది నేరమని, ప్రభుత్వానికి ఫిర్యాదు చేస్తామన్నాం. ఇక అందరూ వచ్చారు.

కరువులొచ్చినా షావుకార్ల వద్ద అడిగి తీసుకొచ్చాం. అప్పులిప్పించాం. ఇవాళ గోదాముల్లో ధాన్యం వుంది. అది ముక్కిపోతున్నా, కోర్టు తీర్పిచ్చినా ప్రభుత్వానికి కళ్ళు లేవు, సిగ్గు లేదు, శరం లేదు ఇదెంత ఘోరం. ఈ దుర్మార్గులను అడ్డుకోవాలంటే పోరాటమే మార్గం.

సమావేశాలలో మూఢనమ్మకాలను వ్యతిరేకిస్తూ అనేక విషయాలు చెప్పేవాళ్ళం. ఈనాడు టీవిల్లో మూఢనమ్మకాల గురించి చెపుతుంటే ఇది తప్పని చెప్పేవాళ్లెవరు? ఆనాడున్న భూస్వాములు కొట్టేవారు, తన్నేవారే తప్ప ప్రజలకు ఇది మంచి, ఇది చెడు అని చెప్పేవారే కాదు. మేము ఆ విషయాలు చెప్పేవాళ్ళం. కనుక మంచి అని ప్రజలంతా వినేవారు. మేం జనం కోసమే చేస్తున్నామని విశ్వసించేవారు.

ఆనాడు ప్రజలు ఇప్పటికీ మా యెడల ప్రవర్తించే తీరు, బ్రహ్మరథం పట్టిన తీరు మా కోసం ఏడ్చిన తీరు ఎన్నడూ మరువలేం. మేం అండర్‌గ్రౌండ్‌లో వుంటే మేమేమైపోయామోనని దిగులుపడేవాళ్లు. మా పేరున చెట్టు నాటేవాళ్లు. ఆ మొక్క పూలు పూసి, కాయలుగాస్తే క్షేమంగా వున్నామని గొప్పపని చేస్తున్నట్లు అనుకునేవారు. పోరాటం మరింత అభివృద్ధి పడుతున్నట్లు సంతోషించేవారు. ఆ మొక్క ఏ రాయో తగిలి వడలినా, చనిపోయినా శోకాలు పెట్టేవారు. ఇదంతా మాపైన వున్న ప్రేమ, ఆదరణ దీన్ని దేన్తో కొలవగలం.

మా పోరాటం సరైనదని ప్రజలంతా భావించారు. కనుకనే భూస్వాముల భార్యలు చాకలోళ్ళ గంపల్లో అన్నం దాచి మాకు పంపేవారు.

60 యేళ్ళల్లో టెక్నాలజీ ఎంతో పెరిగింది. ఎన్నో రకాల మందులు కనుగొన్నారు. అయినా ప్రజలకు సదుపాయాలు కల్పించడంలో ప్రభుత్వం విఫలమైంది. నిజానికి విద్య, వైద్యం, ఉపాధి ఇవన్నీ ప్రభుత్వం ప్రజలకు అందుబాటులోకి తీసుకురావచ్చు. ఒక గజం స్థలం అమ్మకుండానే, ప్రజలిచ్చిన పన్నులతోనే చేయొచ్చు. కానీ ప్రభుత్వం వీటన్నింటినీ ప్రైవేటీకరణ చేయదల్చుకుంది. లాభాలు మిగుల్చుకోదల్చుకుంది. అందుకే ప్రాథమిక సదుపాయాలను కూడా అమ్ముకుంటోంది. ఒక్క పోలీసులను మాత్రమే ప్రభుత్వం కొనసాగించేలా ఉంది. కారణం, వారి ఉపయోగం ప్రజల కన్నా ప్రభుత్వానికే ఎక్కువ. ప్రజలను నరకంలోకి పంపిస్తోంది. ఎలాంటి ముసుగులూ లేకుండా డైరక్టుగానే దోపిడీ చేస్తుంది.

చిత్తశుద్ధి లేని ఈ సర్కారు ప్రజలకు ఏ సదుపాయాలు కల్పించడం లేదు. ఉపాధి లేదు. నిరుద్యోగ సమస్య, రోగాలు పెరిగిపోయాయి. గ్రామాల్లో డైరక్టుగా మద్యం పోస్తున్నారు. ఆ రోజుల్లో తాగితే తప్పనే భావం వుండేది. ఆనాడు భూస్వామో, వాడి కొడుకో తాగి పొర్లేవాళ్ళు. ఆనాడు తాగకూడదని, తప్పుడు ఆలోచనలు చేయకూడదని ప్రచారం చేశాం. ఈనాడు ప్రభుత్వం అందరికీ మందు అలవాటు చేసింది.

విదేశ విష సంస్కృతి దిగబడి ప్రజలను క్లబ్బులకు, పబ్బులకు అలవాటు చేసింది. కనీస అవసరాలకు దూరం చేసింది. వున్న ఆసుపత్రులను ఎత్తేస్తామంటున్నారు. ప్రభుత్వం రాక్షస దోపిడీకి పూనుకుంది. ఈ ప్రభుత్వాన్ని కూలగొట్టి ప్రజలందరికి భూమి, కూడు, గూడు, నీడ, విద్యా, వైద్యం అందించే ప్రజా ప్రభుత్వాన్ని ఎన్నుకోవాలి. ఇందుకు మహిళలు, ప్రజలు ఎక్కడికక్కడ ఎదిరించాలి.

# నూరేళ్ళ అంతర్జాతీయ మహిళా దినోత్సవం
# సందర్భంగా రాష్ట్ర మహిళలకు శుభాకాంక్షలతో...





**కందుల సంధ్యారాణి**

ఎంపిపి, రామగుండం,



**కందుల పోచం**

తెలుగుదేశం పార్టీ నాయకులు
రామగుండం

## కరీంనగర్ జిల్లా.

# ఆటల అవసరాన్నిచాటిచెప్పే చిత్రం గోల్కొండ హైస్కూల్

- కె. నాగలక్ష్మి




"ఆటలు మా హక్కు" అనే క్యాప్షన్‌తో మోహన్‌కృష్ణ ఇంద్రగంటి దర్శకత్వంలో రామ్‌మోహన్ నిర్మించిన "గోల్కొండ హైస్కూల్'' చిత్రం పిల్లలను మార్కులు, ర్యాంకులంటూ ఆటలకు దూరం చేసి వత్తిడి చేసే తల్లి తండ్రులు ఒక్క నిముషం ఆగి ఆలోచించేలా చేసింది. పిల్లలు చదువులోనైనా మరే అంశంలోనైనా చురుకుగా వుండాలంటే వారికి ఉత్సాహం, ఉత్తేజం నింపే ఆటలు అవసరమని చెపుతూ నేటి కార్పొరేట్ కల్చర్ దుష్ప్రభావం తల్లి తండ్రులపై ఎలావుందో చెప్పే ప్రయత్నం ఈ చిత్రం ద్వారా జరిగింది.

**కథలోకి వెళితే:** గోల్కొండ హైస్కూల్ హైదరాబాద్‌లోని ఒక ట్రస్టు ఆధ్వర్యంలో నడిచే ఒక ప్రముఖ హైస్కూల్. ఒకప్పుడు అటలలోనూ, అన్నింటిలోను ముందుండే ఆ స్కూల్ కొన్ని కారణాల వలన అట్టడుగు స్థాయికి చేరుకుంటుంది. పిల్లలను పట్టించుకునే టీచర్లు కరువై పిల్లలు ఎవరి తీరున వారు వ్యవహరిస్తుంటారు. ఇంతలో లాభార్జనే ధ్యేయంగా వున్న స్కూల్‌బోర్డ్ ట్రస్టీ అయిన కిరీటి (సుబ్బరాజు) దృష్టి ఆ స్కూల్ గ్రౌండ్‌పై పడుతుంది. ఆ స్కూల్‌లోని గ్రౌండ్‌లో ఒక బిల్డింగ్ కట్టి అందులో ఐఐటి, ఎంసెట్ లాంటి కోచింగ్ సెంటర్లు పెడితే డబ్బుతో పాటు స్కూలుకీ పేరుకూడా వస్తుందని స్కూల్‌బోర్డుని ఒప్పించే ప్రయత్నాలు మొదలు పెడతాడు. ఈ ప్రతిపాదనను స్కూల్ ప్రిన్సిపాల్ విశ్వనాధ్ (తనికెళ్ళ భరణి) ఎంతమాత్రమూ ఒప్పుకోడు. ఒకప్పుడు స్కూల్‌ను ఆటల్లో అగ్రభాగాన నిలిపిన చరిత్ర ఆ గ్రౌండ్‌కు వుందనీ, దానిని కోచింగ్ సెంటర్ల పేరుతో లాభార్జనకు ఉపయోగించడం తాను ఒప్పుకోననీ చెబుతాడు. దానికి కిరీటి ఒప్పుకోడు. ఆటల వలన ఉపయోగమేమీ లేదనీ, ఎడ్యుకేషన్ అంటే ఐఐటి, ఎంసెట్‌లలో ర్యాంకులేననీ వాదిస్తాడు. అయినా స్కూల్‌లో ఒక్క ఆటగాడు కూడా లేడనీ, అలాంటపుడు గ్రౌండ్ వుండటం కూడా వృధా అని వాదిస్తాడు. కాని విశ్వనాధ్ ఒక మంచి కోచ్‌ను నియమించి స్కూల్ టీమ్ ఇంటర్ కాలేజీ క్రికెట్ టోర్నమెంట్ గెలిచే ప్రయత్నం చేస్తున్నానని చెప్పగా దాన్ని కిరీటి అపహాస్యం చేస్తాడు. దీంతో కోచ్‌గా నియమించబడ్డ సంపత్( సుమంత్) కిరీటి ఛాలెంజ్ చేసుకుంటారు. స్కూల్ టీమ్ గెలిస్తే కిరీటి ట్రస్టు బోర్డుకు రాజీనామా చేయలనీ, స్కూల్ టీమ్ ఓడిపోతే గ్రౌండ్‌ను స్కూల్ ఎప్పటికీ వదులు కోవాలనీ ఛాలెంజ్.

కొన్ని విలువలకు కట్టుబడి పట్టుదలగా కృషిచేసే స్వభావంగల కోచ్ సంపత్. ఒక లక్ష్యం లేకుండా తిరుగుతున్న స్కూల్ పిల్లలను ఉత్తేజ పరిచి ఒక మంచి టీమ్‌ను తయారుచేసి ఆ టీమ్ స్టేట్ ఇంటర్ కాలేజ్ టోర్నమెంట్ గెలిచే విధంగా చేయడమేగాక చదువులో కూడా వారు చురుకుగా వుండేలా చేసి అటు తల్లి తండ్రుల మెప్పు, ఇటు టీచర్ల మెప్పు పొందేలా చేస్తాడు.

హిందీ చిత్రాలు చెక్‌దే ఇండియా, లగాన్, గోల్ లాంటి చిత్రాలను తలపించేలా ఈ సినిమా వున్నా ఒక మంచి కథాంశాన్ని ఎంచుకున్నందుకు దర్శక నిర్మాతలను అభినంధించాల్సిందే.

ప్రస్తుత విద్యారంగంలో కార్పొరేట్ కల్చర్, పోటీ వాతావరణం పిల్లల అందమైన బాల్యాన్ని ఛిద్రం చేస్తున్నాయి. ట్రాఫిక్ రద్దీ సెంటర్లలో, ఇరుకైన గదులదో వున్న ఆపార్ట్‌మెంట్లలో వెలుస్తున్న స్కూళ్ళను నేడు చూస్తున్నాము. లాభార్జనే ధ్యేయంగా వున్న యాజమాన్యాలు స్కూళ్ళలో అసలు ఆటస్థలం వుండాలనే ఆలోచనే చేయటం లేదు.

పిల్లలకు స్వతహాగా కొన్ని అభిరుచు లుంటాయి. బాల్యంలో చదువుతోపాటు ఆటపాటలతోనే వారికి శారీరక, మానసిక వికాసం కలుగుతుందనే విషయాలను తల్లి తండ్రులు గానీ, విద్యా సంస్థలు గానీ పట్టించుకునే పరిస్థితులు క్రమేణా దూరమవుతున్నాయి. ఈ అంశాలను అందరి దృష్టికీ తేవడంలో ఈ చిత్రం సఫలీకృతమైంది.

కోచ్‌గా సుమంత్ పాత్రలో జీవించాడనే చెప్పడం తక్కువే అవుతుంది. ఇంగ్లీషు టీచర్‌గా స్వాతి నటన బాగుంది. తనికెళ్ళ భరణి ప్రిన్సిపాల్‌గా వెరైటీ పాత్ర పోషించి ప్రేక్షకుల్ని మెప్పించాడు. సుబ్బరాజు నెగిటివ్ పాత్రలో ఇమిడిపోయి నటించాడు. విద్యార్థులుగా నటించిన వారు గౌతమ్, వరుణ్, మైకీ, సర్దార్జీ మొ॥లైన పాత్రలు గుర్తుండిపోయేలా నటించారు. మోహన్‌కృష్ణ ఇంద్రగంటి వ్రాసిన కొన్ని మంచి డైలాగ్‌లు ఆసక్తిని కలిగించాయి. మగతనమంటే తొడగొట్టడం, మీసాలు మెలేయడం, ఫలానా సెంటర్‌కురా! చూసుకుందామనడం కాదనీ, నమ్మిన ఆశయం కోసం అహర్నిశలూ కష్టపడి సమిష్టి లక్ష్యం కోసం పనిచేయడమనీ చెప్పడం బాగుంది. సినిమా చివరిలో సమాజంలో ప్రముఖ స్థానాల్లో వున్న కొంతమంది మాజీ ప్లేయర్ల పరిచయం బాగుంది. (సినిమాలో క్రికెట్‌నే కాక ఇతర ఆటల ప్రాముఖ్యాన్ని కూడా చూపితే బాగుండేది. పోటీ తత్వమే పరిమావధిగా వుంటున్న కార్పొరేట్ కల్చర్‌తో పిల్లల ఆత్మహత్యలు పెరగడం, పిల్లలు సమాజంలో ఏ విషయాలనూ పట్టించుకోక పోవడం, ఉత్సాహరహితంగా గడపడం లాంటి కొన్ని అంశాలను కూడా స్పృశిస్తే బాగుండేది) హరిమోహన్ పరువు వ్రాసిన "ద మెన్ వితిన్ " నవల ఆధారంగా నిర్మించిన ఈ చిత్రం కుటుంబ సమేతంగా చూసి ఆనందించదగిన చిత్రం

కేస్ స్టడీ

# సంసారం చక్కబడింది

ఒక రోజు సనా అనే అమ్మాయి తల్లిని వెంటబెట్టుకుని ఏడుస్తూ " లీగల్ సెల్" ఆఫీసుకి వచ్చింది. ఆమె చంకలో బిడ్డ. చూడముచ్చటగా వున్నాడు. ఆమె బాధ ఏమిటో?

ఏడుపు మాని తన సమస్యను చెప్పి తనకు విడాకులు ఇప్పించమని కోరింది.

అమ్మాయికి ఈ సంస్థ గురించి ముందు వివరించాలనిపించింది. భార్యా భర్తలను కలిపేటందుకు, సమస్యలు వస్తే పరిష్కరించి ఒకటిగా వుంచడానికి ప్రయత్నిస్తుంది తప్ప విడాకులు ఇప్పించడానికి కాదని చెప్పాం.

2 సంవత్సరాల క్రితం తనకు పెళ్ళి జరిగే వరకు తన పుట్టింట్లో ఇద్దరు అన్నలు, వదినల మధ్య ప్రేమతో పెరిగానని తన తల్లి తన వదినలను అమ్మలాగ చూసుకుంటుందని తను ఒక్కగానొక్క ఆడపిల్లనైనందున అతి గారాబంగా పెంచారని, పెళ్ళి సంబంధం చూసి పెళ్ళి చేశారని చెప్పింది. చూడటానికి మంచి సంబంధమే. కానీ పెళ్ళి చేసుకున్న తర్వాత తెలిసింది. ఆ సంబంధం గూర్చి వినడానికి అక్కడ జరిగేదానికి ఎంత తేడానో!

ఆ ఇంట్లో అత్తా, మామ, పెళ్ళికాని మరిది, పెళ్ళి కావాల్సిన మరదలు, మతి స్థిమితం లేని ఇంకో మరదలు వున్నారు. తన భర్త చాలా అమాయకుడు. వయసులో కూడా తనకంటే కొంచెం చిన్నవాడు ( ఈ విషయం రహస్యంగా దాచారు) తన మరిది జీతం 9 వేలు. తన భర్త జీతం 5 వేలు. ఈ డబ్బులతో సంసారం నెట్టుకొస్తున్నారు అత్త మామలు.

జీతంలో ఈ తేడా వుండటం వల్ల సనాకు కష్టాలు మొదలయ్యాయి. కడుపునిండా అన్నం పెట్టేవారు కాదు. అర్ధాకలితో అలమటించి పోయేది. మతిస్థిమితం లేని మరదలు కొట్టడం, రక్కడం చేసేది. దీనికి తోడు మామ బెదిరింపులు, అత్త ఆరళ్ళు. ఒకొక్కసారి చావాలనిపించేది. ఆఖరికి కొన్నాళ్ళకు గర్భిణి అయింది సనా. పండంటి కొడుకును కన్నది. ఇప్పుడైనా అత్త మామలు సంతోషపడి మంచిగా చూసుకుంటారను కుంది. కానీ కొంతమంది తాము సంతోషంగా వుండరు, ఎదుటివారిని వుండనివ్వరు. చివరికి సనాకు ఓపిక నశించింది. విడాకులు తీసుకోవాలని నిర్ణయానికి వచ్చింది.

ఒకరోజు వాళ్ళ అన్న బస్సులో వెళ్తుంటే మోటూరు ఉదయం లీగల్ సెల్ బోర్డును చూసాడట. ఇక్కడ న్యాయం దొరుకుతుందని మా దగ్గరకు వచ్చారు. ఇది విన్న తర్వాత మేము లీగల్‌సెల్‌కు హాజరుకమ్మని సనా భర్తకు లెటర్ వ్రాసాము. వారం రోజుల తర్వాత సనా భర్త, అత్తమామలు వచ్చారు.

వాళ్ళ ద్వారా విషయాలను తెలుసు కున్నాం. అమ్మాయి మీద ఏమి ఫిర్యాదు చేయలేదు. మేము చెప్పాం అమ్మాయికి మీరు చాలా నరకం పెట్టారు. 2 సం॥రాలు భరించింది. ఇప్పుడు వేరు కాపురం పెట్టమంటోంది. మీరేమంటారు? అన్నాం.

మేము మా కొడుకుల జీతాలతో బతుకుతున్నాం. మా పెద్ద కొడుకు ( సనా భర్త) చాలా అమాయకుడు. మా దగ్గర వుంటేనే మంచిది అని అన్నారు. లీగల్‌సెల్ సభ్యులంతా ఒక నిర్ణయానికి వచ్చాము. మీ కొడుకు కోడలిని వేర్పాటు పంపాల్సిందే. మీ ఇంట్లో ఒక పోర్షను వుంది అంటున్నారు కదా! సనా వాళ్ళను దీంట్లో వుండమంటు న్నారు. దానినే మీరు అద్దెకి ఇచ్చుకోండి. వీళ్ళు మాత్రం వేరేచోట వేరేఇల్లు తీసుకుని వుంటారు. అని చెప్పాం. సరే మంచిది అని చెప్పారు. వాళ్ళే ఇల్లుచూసి కొడుకుని, కోడలిని ఒక ఇంట్లో వుండమన్నారు. పెళ్ళినాడు సనాకిచ్చిన సామాన్లు కూడా ఆ ఇంట్లో పెట్టారు.

ఒకరోజు సనా అత్తమామలు లీగల్‌సెల్‌కు ఫోనుచేసి సనా బంగారు నగలను మీ సమక్షంలో సనాకు ఇస్తామని చెప్పారు.

సరే ఇరువైపుల వారిని పిలిచి ఆ నగలను స్వాధీనం చేసుకొని సనాకు ఇచ్చాం. సనా చాలా సంతోషపడింది. ఆ నగలు ఇస్తారో లేదోనని ఆందోళన పడింది.

ఈ కేసుద్వారా ఒకటి తెలుసుకోవలసినదే మిటంటే మనిషికి స్వేచ్ఛ, స్వాతంత్రం ఎంత ముఖ్యమోనని! సనా స్వేచ్ఛ లేకుండా స్వాతంత్ర్యం అనేది లేకుండా ( తల్లికి ఫోన్ చేయడానికి వీలులేకపోయేది) చాలా కష్టపడింది. తన భర్త ఎప్పుడు తల్లి తండ్రులకు భయపడేవాడు.

భర్తకు తక్కువ జీతం అయినా మేము సంతోషంగా బతుకుతాము. నేను కూడా మిషన్ కుట్టుకుంటూ ఆదాయాన్ని పెంచుకుంటానని చెప్పింది. . అత్తమామలు కూడా అర్థం చేసుకుని తమ పెద్దకొడుకుని కోడలితో వేరు కాపురం పెట్టించారు.

వాళ్ళు ఎక్కడకు పోరు. దూరముంటే ప్రేమలు పెరుగుతాయి. రిస్క్ వుండదు అని ఆ పెద్ద వాళ్ళకు అర్థం అయ్యేలా చెప్పాము. సనా అత్తమామలతో సహా అందరూ ఈ కేసు సెటిల్‌మెంట్‌ను అంగీకరించారు. ఈ విధంగా సనా కేసును లీగల్‌సెల్ పరిష్కరించింది. ఒకప్పుడు చనిపోవాలనుకున్నది. విడాకులు కావాలనే ఆలోచనతో వచ్చిన సనా లీగల్‌సెల్‌కి వచ్చాక తన సంసారం చక్కబడింది. ఇదేకదా నేను ఆశించింది అని తన ఆలోచనని మార్చుకుని ఇప్పుడు చక్కగా కాపురం చేసుకుంటోంది. "ఇదంతా మోటూరు ఉదయం లీగల్‌సెల్ వాళ్ళు ఇచ్చిన సలహా వలన జరిగింది'' అని చెప్పనలవికాని సంతోషంతో అంది.

**(బాగ్‌లింగంపల్లిలోని కుటుంబ న్యాయ సలహా కేంద్రం ద్వారా పరిష్కరించబడిన కేసు)**

**శ్రీమతి బృందాకరత్‌గారితో (ఇష్టా-గోష్టి)**




ఖమ్మం జిల్లా భద్రాచలంలో కా॥ బృందాకరత్ మాట్లాడుతూ నానాటికి మహిళలకి రక్షణ లేకుండా పోతోందని, మహిళల చట్టాలు కేవలం కాగితాలకే పరిమితమయ్యాయని మహిళలపై వేధింపులు, దాడులు పరిశీలిస్తే వాటి శాతం ప్రతి సంవత్సరం పెరుగుతుందని, ఆమె ఆందోళన వ్యక్తం చేసారు. ఇటీవల కాలంలో మంత్రులు, ప్రజాప్రతినిధులు సైతం మహిళలపై జరిగే దాడుల్లో ఉండటం ఆందోళన కలిగించే విషయమని ఆమె ఆవేదన వ్యక్తం చేసారు. చట్టాలను కాపాడాల్సిన వారే వాటిని తుంగలో తొక్కుతున్నారని ఆమె అన్నారు. 33% రిజర్వేషన్ బిల్లు విషయంలో ఇప్పటి వరకూ పరిపాలించిన ప్రభుత్వాలకు చిత్తశుద్ధిలేదని, ఆమె ప్రభుత్వాన్ని విమర్శించారు. తక్షణమే మహిళా బిల్లు ఆమోదించాలని ప్రభుత్వాన్ని డిమాండ్‌చేసారు.

# ఉద్యమ వార్తలు

## సంక్రాంతి ఆటలపోటీలు

కుల మతాలకు అతీతంగా స్త్రీలలో నిద్రాణమై వున్న కళలను వెలికితీసి, వారిలో వున్న ప్రతిభను చాటటానికి ఐద్వా రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాలలోను ఆటల పోటీలు నిర్వహించింది. సంక్రాంతి సందర్భంగా ప్రతి సంవత్సరం ఐద్వా నిర్వహిస్తున్న పోటీలలో


అనంతపురం

మహిళలు వేలాదిగా పాల్గొంటున్నారు. రంగవల్లులు, మ్యూజికల్ ఛైర్స్, రన్నింగ్, కబడ్డీ, మెహింది, టగ్ ఆఫ్ వార్ లాంటి మొదలైన ఆటలు నిర్వహించి గెలుపొందిన వారికి బహుమతులు ఇవ్వటమేగాక పాల్గొన్నవారందరికీ కన్సోలేషన్ బహుమతులు అందజేయటం జరిగింది. వేలాది మంది ఈ క్రీడలను ప్రోత్సహిస్తూ తిలకించారు.

## మైక్రోఫైనాన్స్‌పై

మైక్రోఫైనాన్స్‌పై రాష్ట్ర వ్యాప్తంగా సర్వేచేసి సదస్సులు జరిపి ఋణ వసూళ్ళలో సంస్థలు అనుసరిస్తున్న అమానవీయ పద్ధతులు రద్దయ్యే వరకూ, రిజర్వ్ బ్యాంకు వడ్డీరేటు నిర్ణయించే వరకు వాయిదాలు కట్టవద్దని ఐద్వా పిలుపు నిచ్చింది. మహిళా సాధికారత పార్లమెంటరీ కమిటీ బృందాకరత్ నాయకత్వంలో హైదరాబాద్ వచ్చిన సందర్భంగా మహిళా సంఘాలు జాయింట్‌గా మెమోరాండం ఇవ్వటం జరిగింది.



కడప

## బడ్జెట్‌పై

మార్చిలో అసెంబ్లీలో ప్రవేశపెట్టబోయే బడ్జెట్‌లో జండర్ బడ్జెటింగ్ వుండాలని ప్రతి మంత్రిత్వశాఖా పరిధిలో మహిళలకు 30 శాతం నిధులు కేటాయించి ఖర్చు చేయాలని ఆర్థిక శాఖా మంత్రికి మెమోరాండం ఇవ్వడమైనది. ప్రజా సంఘాల ఆధ్వర్యంలో బడ్జెట్‌పై సదస్సు జరిగింది.

**అధిక ధరలపై :** ఐద్వా కేంద్ర కమిటీ అధిక ధరలు నియంత్రించాలని ప్రజా పంపిణీని పటిష్ఠం చేయాలని, నిత్యావసర వస్తువులు రేషన్ షాపుల ద్వారా అందించాలని ఫిబ్రవరి 3,4 తేదీలలో ఢిల్లీలో నిర్వహించిన నిరవధిక దీక్ష కార్యక్రమానికి మద్దతుగా హైదరాబాద్‌లో ఒకరోజు నిరాహారదీక్ష జరిగింది. విజయవాడలో ధరల పెరుగుదలపై రైతు బజారు వద్ద ధర్నా చేసి కమీషనర్‌కి మెమోరాండం ఇచ్చారు.


హైదరాబాద్

**మున్సిపల్ పన్నులపై :** గ్రేటర్ విశాఖ కార్పొరేషన్ అనేక రెట్లుగా పెంచిన ఇంటిపన్ను నిరసిస్తూ పెంచిన పన్నును రద్దు చేయాలని కోరుతూ విశాఖ నగర కమిటీ 18 వార్డులలో ప్రజాభిప్రాయాన్ని సేకరణ కొరకు ప్రజా బ్యాలెట్ నిర్వహించింది. 7,000 మంది ప్రజా బ్యాలెట్‌లో పాల్గొన్న ఈ కార్యక్రమానికి సంపూర్ణ మద్దతు తెలిపారు.


విశాఖపట్నం

## డ్వాక్రా

విజయవాడ నగర కమిటీ ఆధ్వర్యంలో స్వయం సహాయక సంఘాలకు పావలా వడ్డీ రుణాలు, లింకేజీ లోన్సు, దీపం పథకంలో గ్యాస్ ఇవ్వాలని కమీషనర్ ఆఫీసు వద్ద ధర్నా జరిగింది. అనంతరం ఐద్వా బృందం కమీషనర్ గారికి మెమోరాండం ఇవ్వడమైనది.


విజయవాడ






## ప్రగతిపథంలో

# ప్రకాశం జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయక సహకార సమితి లిమిటెడ్

ఒంగోలు డెయిరీ, ఒంగోలు - 523 002 ఆం.ప్ర. 231205, సెక్యూరిటీ: 234707, ఫ్యాక్: 234919







యస్.కె.యం.వలి, M.Sc (A.N)
మనేజింగ్ డైరెక్టర్

శత వసంతాల అంతర్జాతీయ
మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో...

చల్లా శ్రీనివాసరావు
ఛైర్మన్

1. రాష్ట్రంలోకి ఎక్కడా లేని విధముగా ఉత్పత్తిదారులకు గిట్టుబాటు ధర కల్పించబడుటకు అత్యధిక పాల కొనుగోలు ధర చెల్లించుట జరుగుచున్నది.
2. గాలికుంటు మరియు గొంతువాపు వ్యాధి నివారణకు 50% రాయితీపై పశువులకు వ్యాధి నిరోధక టీకాలు కార్యక్రమము నిర్వహించుట జరుగుచున్నది.
3. పాల ఉత్పత్తి పెంచుటకు పశుగ్రాసం కొరకు రైతులకు 25% రాయితీపై మేలు జాతి పశుగ్రాస విత్తనములు సరఫరా చేయబడుచున్నవి.
4. మేలు జాతి పాడి పశువుల అభివృద్ధి కొరకై 50% రాయితీపై హర్యానా రాష్ట్రము నుండి ముర్రా విత్తనపు దున్నపోతులను సంఘములకు సరఫరా చేయుట జరుగుచున్నది.
5. రైతులను ఆర్థికంగా అదుకొనుటకు అతి తక్కువ వడ్డీకి జాతీయ బ్యాంకుల నుండి ఇప్పటి వరకు 12000 పాడిపశువుల కొనుగోలుకు ఋణ సదుపాయం కల్పించబడినది.
6. పశువులకు ఉచితంగా వైద్య సదుపాయం కల్పించుటకు ప్రతిరోజు పశు వైద్యులను ఆయా గ్రామములకు పంపించుట జరుగుచున్నది.
7. అత్యవసర పశువైద్యసేవలను అందించుటకు రెండు అత్యవసర పశు వైద్య వాహనముల సదుపాయం కల్పించి సమాచారం అందిన తక్షణమే చికిత్సకు ఆ గ్రామమునకు పశువైద్యున్ని పంపించి, వైద్య సదుపాయం కల్పించుట జరుగుచున్నది.
8. యన్.డి.డి.బి. వారి సహకారముతో రోజుకు 30 టన్నుల పాలపొడి సామర్థ్యం గల పాలపొడి కర్మాగారం డిసెంబర్ 2006 నుండి పనిచేయుట జరుగుచున్నది.
9. 2010-2011 సం॥ సమితి వార్షిక టర్నోవర్‌ను రూ. 13947.39 కోట్లతో 30-09-2010 వార్షిక సర్వసభ్య సమావేశంలో ఆమోదించుట జరిగినది.
10. పశుసంక్షేమ పథకము ద్వారా 17627 పశువుల బీమా ద్వారా పశుపోషకులకు లబ్ది 56,65,100/- రూ. లు ప్రీమియంను రైతులకు చెల్లించుట జరిగినది.
11. 2010-11 సం॥నందు సాంకేతిక వనరుల కార్యక్రమముల కొరకు రూ. 4,128 కోట్లతో వార్షిక బడ్జెట్‌కు సర్వసభ్య సమావేశము ఆమోదము జరిగినది.

**మన ఒంగోలు డెయిరీ ఉత్పత్తుల్ని కాపాడుకుందాం-**
**రైతు శ్రేయస్సుకు- వినియోగదారుని ఆరోగ్య రక్షణకు పాటుపడదాం**

## తల్లి పాలు బిడ్డకు శ్రేష్టం- ఒంగోలు డెయిరీ పాలు అందరికి శ్రేష్టం

# బ్యాంకు అప్పులు సకాలంలో చెల్లించడంలోనే మీ అభివృద్ధి దాగి ఉంది.

బ్యాంకుల నుండి తీసుకున్న అప్పులు సకాలంలో చెల్లించండి. ఇది ప్రజల సొమ్ము తిరిగి ప్రజలకే ఉపయోగపడుతుంది. బ్యాంకుల కన్న తక్కువ వడ్డీకి ఏ బంధువు, ఏ వడ్డీ వ్యాపారి కూడా ఇవ్వలేడు. బ్యాంకుల నమ్మకాన్ని కోల్పోవద్దు. వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలో నలిగిపోవద్దు. ఆర్థిక క్రమ శిక్షణలో మెలగండి. మీ అభివృద్ధే దేశాభివృద్ధికి మూలమని గమనించండి.

## బ్యాంకు అప్పులు సకాలంలో చెల్లించండి. అది మీ అభివృద్ధికి తోడ్పడుతుంది.

## మహిళల అభివృద్ధి మరియు శ్రేయస్సు కొరకు ప్రత్యేక కార్యక్రమాలు

1. ట్రాఫికింగ్ బారిన పడి తిరిగి పునరావాసం కోరుతున్న 56 మంది మహిళలకు ఎస్.జి.ఎస్.వై. పథకం ద్వారా చేయూత.
2. హెచ్.ఐ.వి. బారిన పడిన 113 మందికి బాలసహయోగ కార్యక్రమం ద్వారా ఆర్థిక చేయూత.
3. మంగళకర చారిటబుల్ ట్రస్ట్ మరియు బాలసహయోగ ద్వారా వీరి పిల్లలకు ఆశ్రమము, చదవు మరియు ఆరోగ్య సౌకర్యాలు.

**సామాజిక సమస్యల పరిష్కార కమిటీలచే పరిష్కరించబడిన సమస్యల వివరాలు**

| సమస్యల రకము | గుర్తించబడినవి | పరిష్కరించబడినవి |
|---|---|---|
| వరకట్న బాధితులు | 70 | 31 |
| లైంగిక వేధింపులు | 68 | 30 |
| కుటుంబ కలహాలు | 114 | 113 |
| మద్యపానము | 63 | 30 |
| బాల్యవివాహాలు | 36 | 26 |
| ఆడ పిల్లల అక్రమ రవాణా | 57 | 22 |
| మొత్తం | 408 | 252 |



- జిల్లా సమాఖ్య ఆవరణలో ప్రతి సోమవారము మహిళల సమస్యల పరిష్కారానికై ఉచిత కుటుంబ సలహా కేంద్ర నిర్వహణ.
- గర్భవతులు, బాలింతలు మరియు చిన్న పిల్లల ఆరోగ్యము మరియు పోషణ కొరకు 85 గ్రామాలలో పోషకాహార కేంద్రాల ఏర్పాటు.
- ఆరోగ్యము మరియు పోషణ విషయములపై మహిళలకు శిక్షణా కార్యక్రమములు.
- గర్భవతులను, బాలింతలను శ్రమశక్తి సంఘములుగా ఏర్పరచి జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం క్రింద తేలికైన పనులు చేయించుట.
- కూలీకి వెళ్ళే కుటుంబాలు పిల్లలు కొరకు బాలబడులు మరియు పిల్లల సంరక్షణ కేంద్రముల నిర్వహణ.
- ఆరోగ్య అత్యవసరముల కొరకై ఆరోగ్య పొదుపులు చేయించుట మరియు ఆరోగ్య నిధి ద్వారా అప్పులు అందించుట.
- ప్రజలకు అందుబాటులో 50% నుండి 90% తగ్గింపు ధరలతో అత్యంత నాణ్యమైన మందులను అనంతపురం ప్రభుత్వ ఆసుపత్రి ఆవరణలో జనత సంజీవనీ మందుల షాపుచే అమ్మకం.

**జిల్లా కలెక్టర్**
అనంతపురం

**డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్టు డైరెక్టరు**
డి.ఆర్.డి.ఎ. ఐ.కె.పి. అనంతపురం

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | CMV01A 130 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యిలివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |